

తరుముకొస్తున్న మబ్బులు

—ఫొటో : బి. రంగనాథన్, మద్రాసు.




శాంతారావ నిశీథ కాలముల
భాస్వత్సాంద్ర చంద్రాతపా
క్రాంత స్వచ్ఛ మరున్నదీ పులిన
యోగ్య క్షోణి గూర్చుండి, జ
న్మాంతోద్వేగులమైన మేము
శివశబ్దావృత్తితో, నెప్పు డ
త్యంతానంద భవాశ్రు సంకుల
నిశావాప్తిన్ సుఖం బుందుమో!

తా॥ నిశ్శబ్దముగా శాంతంగా ఉన్నటువంటి రాత్రివేళలందు ప్రకాశమానమైన నిండినపండు వెన్నెల ఆవరించినటువంటి చక్కని గంగానది ఇసుకతిన్నెలపై కూర్చుండి, జన్మరాహిత్యమును కోరిన మేము "శివా! శివా!" అనే శబ్దమును మరల మరల ఉచ్చరిస్తూ, ఆనందమువల్ల కలిగిన కన్నీళ్లతో నిండినవారమై ఎప్పుడు సుఖంబుగా ఉందుమో గదా!

ఆడలేక మద్దెల ఓడన్నట్లుగా, అందని ద్రాక్షపండ్లు అతి పులుపు అన్నట్లుగా, ఇహలోకజీవయాత్రలో దారితప్పి తీరు తప్పి నడచి, ఇంట్లో అడచుకోలేని అహంకారమును, హిమాలయ పర్వత ప్రాంత కాంతారంలో అడచుకోవలెనని ప్రయత్నించడం ప్రస్తుత ప్రపంచ ప్రవర్తనా ప్రగతి ప్రభావమునుబట్టి ప్రయోజకత్వమూ కాదు-ప్రశంసనీయమూ కాదు. ఎందుచేతనంటే, యీ కాలంలో ఎవడు ఏపనిచేసినా కూటికీ గుడ్డకూ అక్కరకు వచ్చేదిగా ఉండాలి, ఆఖరుకు కాలేజీలో చదువుకొంటున్న విద్యార్థికూడా తాను చదివేటటువంటి అభిమాన శాస్త్రం ఉత్తరోత్తరా మంచి పనిపాటులకుగాని, ఉద్యోగ ఉపాధులకుగాని, వృత్తి వ్యాపారాలకుగాని అక్కరకు వచ్చేటటువంటిదై ఉండాలి. వాణిజ్య శాస్త్రం చదివి అందులో బి. కాం. పరీక్షయందు (బాచెలర్-ఆఫ్-కామర్సు-వాణిజ్య శాస్త్ర బ్రహ్మచారి) కావచ్చు. అందులో ప్రవీణుడై ఉత్తీర్ణుడైతే, అనేక ఆర్థిక వ్యాపార వ్యవహారాల లోతుపాతులు జాతిరీతులు బోధపడతాయి. అటుతర్వాత ఆడిటర్‌గా ఆరితేరి అనేక వ్యాపారసంస్థల లెక్కల చిక్కుల చక్కగా విమర్శించి సోదాచేసి ఆదాయం లెక్క తేల్చి, ఆదాయపు పన్ను విధించుటకు వీలుగా మథించగల గణిక ప్రవీణుడవుతాడు. ద్రవ్యం గుణించడంలోనూ, గడించడంలోనూ ప్రవీణుడవుతాడు. దివ్యంగా ద్రవ్యం గడించి ఘనుడని వినుతికెక్కగలడు.

రసాయనశాస్త్రం అభిమాన విద్యగా అభ్యసించిన విద్యార్థి అందులో ఆరితేరి బి. యస్‌సి - (బాచెలర్ - ఆఫ్ - సైన్సు - విజ్ఞానశాస్త్ర బ్రహ్మచారి) అనే పట్టాపొంది; రసవిష గంధకాదులతో కూడిన ఔషధరాజములను కూడా తయారు చేయుటలో తయారై, వైద్యశాస్త్ర విద్వాంసుడై, రోగులకు మందులబిళ్లలిచ్చి, అటు పిమ్మట వారికి తన వైద్యకట్నపు బిల్లులిచ్చి, కొల్లలుగా గడించి మల్లెలు మూటకట్టవచ్చు - అటువంటి వైద్యుడు జనవంద్యుడు కాకమానడు. ఆ వైద్యవృత్తిలో వరహాల వర్షం కురిపించే పరమహంస క్రియలుకూడా ఉన్నాయి. సిద్ధ మకరధ్వజం తయారు చేస్తే, తులము నలభైరూపాయలకు నిరభ్యంతరముగా అమ్మవచ్చు. ఒక్క పోతాదుతో వస్తాదును చేయగల వీర్యవృద్ధి లేహ్యం తయారు చేయగలిగితే, ఆ లేహ్యంతో ఆర్జించగల అయిశ్వర్యం దురూహ్యం. అటువంటి ధన్వంతరి ధనవంతుడు కాకమానడు. ఆ మందును శ్రీ మహావిష్ణువునకు కూడా యిప్పించుచున్నదో యన్నట్లుగా లక్ష్మి అట్టి వైద్యునియింటికి విచ్చేసి విడిదిచేయగలదు.

అదీ యిదీ కాకపోతే, ఆఖరుకు ఆనందభైరవి మాత్రలైనా అమ్మితే చాలు. లోకానికి ఆరోగ్యం యిచ్చి, తాను అయిశ్వర్యంపొంది, ఆనందంగా జీవించగలడు. అయితే, ఆనందభైరవి మందు తయారు చేయడం అంత సులభం కాకపోయినా, ఆనందభైరవి రాగం ఆలాపన చేయడం అంత కష్టమైనపనికాదు. అందువల్ల వైద్యం తెలియనివాడు ఉన్నప్పటికీ, సంగీతం రానివాడు ఉండడం సందేహమే. కనుక, కళాశాలలో ప్రవేశించి సంగీత శాస్త్రం సాధకంచేసి పనిపాటులు చేతకాని పాటకుడైనా పాటలు పాడి మూటలు కట్టలేక పోతాడా? ఏ సినిమా కంపెనీలోనైనా, పాట పాడలేని సినిమా తారలకు వెనుకపాంగు (*Play-back* (ప్లేబాక్) గాయకుడై కావలసినంత సంపాదించవచ్చు. పాట కచ్చేరీలు చేయవచ్చు - గ్రామఫోను రికార్డు లియ్యవచ్చు - తన పాటను ఎంత వెలకైనా వెలముపాట పాడవచ్చు - ఈ విధముగా ఏవిద్య నభ్యసించినప్పటికీ, విద్యయొసగును విత్తంబు అనే గ్యారంటీతో, సరస్వతిని ప్రార్థనచేసి లక్ష్మీపూజ చేస్తున్నారు.

ఏ కళాశాల విద్యార్థి అయినా వేదాంత శాస్త్రం తన అభిమాన విద్యగా స్వీకరించి చదువుతున్నట్లయితే, అట్టివానిని వెర్రి వెంగళప్పగా భావించే కాలం ఇది. చాలా

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: సాహిణీ వారి "అమర సందేశం"లో అమరనాథ్.

ఏండ్లక్రిందట మద్రాసులో ఒక సుప్రసిద్ధ కాలేజీలో జరిగిన విద్యార్థి సమావేశ సభయందు మద్రాసులో సుప్రసిద్ధ న్యాయవాదులుగా నుండినట్టియు, గౌహతీలో జరిగిన కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించినట్టియు కీ॥ శే॥ యస్. శ్రీనివాసయ్యంగారు ఉపన్యసించడం తటస్థించింది. కాలేజీలయందు వేదాంత శాస్త్రాధ్యయనం అనవసరమనిన్నీ, దానిని కళాశాలలందు బోధించడం విద్యార్థులను వ్యర్థముగా బాధించడమనిన్నీ వారు ఆనాటి ప్రసంగంలో ప్రబోధించారు. ఆ ప్రసంగ పర్యవసానం ఏమిటంటే, ఈ వేదాంత శాస్త్రంగాని, తత్వశాస్త్రంగాని కూటికి గుడ్డకూ అక్కరకురాని విద్యయనిన్నీ, దానిని బోధించడం మానివేయవలెననిన్నీ, వారి అభిప్రాయం, అభిమతం, అభిలాష, అభీష్టం అన్నారు. అట్టి అభీష్టమే అరిష్టమని అరిస్టాటిల్ వంటి ప్రాచీన పాశ్చాత్య యవన (గ్రీకు) పండితుడు ఖండితంగా అన్నాడు.

ఇప్పటికి 2,280 సంవత్సరాల క్రిందట యీ భారతదేశంమీదకు దండెత్తి వచ్చిన గ్రీసు చక్రవర్తియైన అలెగ్జాండరు మహాశయునకు యీ అరిస్టాటిల్ పండితుడు కొంతకాలం గురువుగా ఉండిన కోవిద వరేణ్యుడు. ఇతడు బహుశాస్త్ర పారంగతుడు. ఇతడు రచించిన గ్రంథములు 400 సంపుటములు అని లెక్కించారు. మరికొందరు వెయ్యి సంపుటములు (వాల్యూములు) అని లెక్కించారు. గ్రీకుభాషలో ఇతడు వ్రాసిన గ్రంథాలు ఇంతవరకూ లభించినవన్నీ పోగుచేస్తే, తర్క మీమాంసశాస్త్రములో 6 గ్రంథములున్నాయి. వీని నన్నింటినీ ఒక్కటిగా సంపుటీకరించి ఆ సంపుటికి (*Organon*) 'సత్య జిజ్ఞాస సాధనం' అని నామకరణం చేశారు. ఇవిగాక భౌతికశాస్త్ర సంబంధమైన గ్రంథములు 9 ఉన్నాయి. వీనిలో జ్యోతిశ్శాస్త్రం మొదలుకొని జంతుశాస్త్రం వరకూ ఉన్నాయి. అన్నింటి కన్నా విచిత్రమైన విషయం ఏమిటంటే (*on the soul* — "ఆత్మవిషయం") అనే చర్చగల గ్రంథం ఒకటి యీ పండితుని భౌతిక విజ్ఞాన శాస్త్ర గ్రంథములలో ఒకటిగా చేర్చబడియున్నది. ఇవిగాక రసవిచారణకు కవిత్వ విచారణకు సంబంధించిన గ్రంథాలు పెద్దవి రెండు లభించాయి. ఇక నాల్గవ వాల్యూముగా (సంపుటిగా) చేర్చదగిన గ్రంథాలలో "నీతిశాస్త్రము," "రాజనీతి శాస్త్రము" "పరతత్వశాస్త్రము" అను మూడు గ్రంథాలు లభించాయి. 2,800 సంవత్సరాల క్రిందట గ్రీసుదేశములో విస్తరించిన మహా విజ్ఞాన వట మహీరుహము యీ అరిస్టాటిల్ మహాపండితుడు. ఆ మఱ్ఱి చెట్టు ఊడలే అయిరోపా ఖండ రాజ్యాలకన్నింటికీ వ్యాపించి, పాశ్చాత్య విజ్ఞాన వికాసమునకు ఆకాశమంత పందిరి వేయగల్గెను. అరిస్టాటిల్ పుట్టి 28 శతాబ్దాలు గతించాయి కాని, అతనిని అయిరోపాఖండం యీనాడు కూడా "మహా తత్వవేత్త" అని ప్రకీర్తించి ప్రస్తావిస్తోంది. అరిస్టాటిల్ అంటే ఆనాటి విజ్ఞాన సర్వస్వం. భౌతికజగత్తు నంతటినీ నడిపించేటటువంటి శక్తి, ఒక పరాశక్తి, ఉన్నదనిన్నీ అదే భగవత్తత్వమనిన్నీ అరిస్టాటిల్ నిరూపించాడు. భగవంతుడనేవాడు ఒక వ్యక్తి కాడని వ్యక్తీకరించాడు.

బహువిధ భౌతికశాస్త్రముల నన్నింటినీ, ఒక్క కల్వములోనికి ఎక్కించి ఒక్క మాత్రగాచేసి మన గొంతుకలో వేయగలిగినదే "పరతత్వశాస్త్రం" అన్నాడు అరిస్టాటిల్. శాస్త్రము లన్నింటియొక్క లక్ష్యం ఏమిటో చూపించేది ఈ పరతత్వశాస్త్రం — ఆయుర్వేదం, అంటే వైద్యశాస్త్రం - ధనుర్వేదం అంటే ధనుర్విద్య - సంగీతం అంటే గాంధర్వ విద్య - ఈవిధంగా ఎన్ని వేదాలైనా, ఎన్ని విద్యలైనా ప్రపంచంలో ప్రచారం పొందవచ్చు - ఈ వేదము లన్నింటిలో ఏ అంత్య పర్యవసాన సారాంశం కన్పిస్తున్నదో దానిని బోధించేది వేదాంతం. అన్ని శాస్త్రాలను సమన్వయించి, అన్ని శాస్త్రాలను సక్రమంగా నడిపించేది వేదాంతం. కాని యీ విషయం విద్వాంసులు కూడా విస్మరించడం వింత విశేషంగా ఉంటుంది.

ఒకప్పుడు ఇంగ్లండులో బర్మింగుహాం విశ్వవిద్యాలయంలో హక్స్లీ అనబడు గొప్ప శాస్త్రవేత్త ఉపన్యసిస్తూ పైవిధంగానే ప్రసంగించాడు. కాలేజీలలోను హైస్కూల్లలోనూ పిల్లలకు కావ్యాలూ పురాణాలూ నాటకాలు భావకవిత్వాలూ పాఠం చెప్పడం వ్యర్థమైన విద్యాబోధ అన్నాడు. విద్యార్థులకు అది ప్రయోజనం లేని పాండిత్యం అన్నాడు. ప్రతిదినమూ కొన్ని గంటలకాలం యీ పనికిమాలిన పద్య గద్య పఠనంలో వాళ్లు మునిగితేలడంకంటె, ఆ పెక్కు గంటల కాలమును భౌతిక శాస్త్రాధ్యయనంలో వినియోగించడం అనేకవిధాల మంచిదన్నాడు. ఆవిషయమై ఆనాడు విశ్వవిద్యాలయ పండిత ప్రకాండులకు చాలా వాద ప్రతివాదములు జరిగినవి. భౌతికశాస్త్రానికే పట్టాభిషేకం చేయవలెనన్న పండితుల వాదం ఖండింపబడింది.

భౌతిక ఆనందంకంటె మించిన, ఆత్మానందం ఇచ్చేది సాహిత్యం. కాని ఆ సత్యం గ్రహించని ప్రవీణులు నవీనులలో కూడ ఉన్నారు. పురాణాలన్నీ బూజుపట్టిన ఎండు వరుగులనిన్నీ, దుర్బలులకు, అర్భకులకు, గర్భిణులకు పథ్యంగా అరగించవలసిన ఊరగాయలనిన్నీ, "చల్ చల్ రె నవజవాన్" (వడి వడి నడు నడు నవయౌవ్వనుడా!) అనే అభ్యుదయ ఆధునిక అభినవ నవనాగరిక విజ్ఞాన వికాస విప్లవ యువక యుగానికి, పనికిమాలిన చేవచచ్చిన పాత పచ్చడులనిన్నీ వాదించెడి ఆధునిక యోధులున్నారు. కాని, ఈపురాణ భారతభూమిని విడిచిపెట్టలేకుండా ఉన్నాము. ఈ "భూమి" అనబడే గ్రహం ఎన్నికోట్ల సంవత్సరముల నాటిదోగాని, ఎండి వరుగై పెద్ద ఊరగాయ జాడీవలె సూర్యుని చుట్టూ గిరగిర తిరుగుతోంది. ఈ భూమినీ సూర్యుణ్ణీ పరస్పరం ఆకర్షించే శక్తి ఒకటి తాతలనాటినుంచీ పరస్పర గురుత్వాకర్షణ శక్తి అనే పేరుతో ఒక పురాణాకర్షణ కథాకలాపం లాగున ప్రవర్తిస్తోంది. ఏనాడో పుట్టిన ఎక్కాల పుస్తకాలు ప్రతి పుస్తకాల షాపులోనూ పాత వరుగుల వలె కన్పిస్తున్నాయి. అవి యీనాటివి కావు. బహుశః యీ ఎక్కాల పుస్తకాలు కూడా వ్యాసమహర్షి కాలము నాటివే అంటే, అవికూడా పురాతన పురాణసరకులనుటకు సందేహములేదు. నిన్న మొన్నటిది విజయనగర సామ్రాజ్యం. కాని ఆనాటి ఆంధ్ర పౌరుషం యీనాడు గొప్పగా చెప్పుకొనడం దొంగవేషంగా ఉంది. అల్లసాని పెద్దన్నగారి మనుచరిత్ర ప్రబంధము అప్పుడే మూతపెట్టిన పాత వరుగుల మరజాడీ అయింది. కాని, ఆ ప్రబంధంలోని ప్రవరుడు ఎటువంటి వరుగో చూడవలెననే భ్రాంతికలవారు యీజాడీ తెరచి చూస్తారు. కాని, ఆ జాడీలూ ఆ పాత్రలూ అవన్నీ పాత ఊరగాయ సరకు అన్నారు నవీనులు. శిష్టకవిత్వం చెప్పిన పెద్దనవంటి పెద్దలు మడికట్టుకొని తయారుచేసి మనకు యిచ్చిన పాత ఊరగాయలను రుచిచూడరు నేటిఅభ్యుదయ ఖండకావ్య లఘు కావ్య అల్పాహార ప్రియులు.

హంపీక్షేత్రం, ఆంధ్ర ప్రశస్తి, ఆంధ్ర పౌరుషం, ఆంధ్రతేజం, ఆంధ్రజ్యోతి,— యివన్నీ సారం లేని, . కారం లేని, చేవచచ్చిన, రుచిపచి లేని ఎండు వరుగులు కావచ్చు - అందుకు మన అవకతవక నవ యువక విమర్శకుల కులశేఖరులే కారణం. అట్టి స్థితిలో, ఆరిపోయెడి ఆంధ్రజ్యోతిని ప్రాచీనార్య ఋషిసత్తముల సత్తేజముతో ఉత్తేజమొనర్చి మరల వెలిగింపదలపెట్ట బని

# ★ కాలక్షేపం ★

లేదు - నేటి మానవకోటిలో సాటి లేని మేటియని లోకపరిపాటిగా పొగడబడిన పురుషోత్తముడు గాంధిమహాత్ముడు.

"కొల్లాయి గట్టితే నేమి?
మా గాంధి కోమటై పుట్టితే నేమి?"

అని మృదుమధురగానము చేసిన కీ॥ శే॥ బసవరాజు అప్పారావుగారి సంకీర్తన జీవము లేని గేయమనుట హేయము. ఎండి వరుగైన జిహ్వకు మహాత్ముల మహోపదేశములు కూడ పసలేని పాతవరుగు లగుట నిజము. ఋషులు చేసిన ఆత్మబల సాక్షాత్కార కృషి మృష కాదనుటకు మహాత్ముని సత్యాగ్రహ మనోనిగ్రహములే నిత్య నిదర్శనములు. ఆయన గడ్డము లేని ఋషి యని మనము పరిగణింపవచ్చును - లేదా, పరిహసింపవచ్చును. ఆయన మహర్షి అయితే, ఆ మహర్షికి గడ్డమున్నదా లేదా యను విషయముగాని, ఋషులలో గడ్డము గొడ్డగా పెరిగినవా రెవరను విషయము గాని పరిశీలించుట, పనిలేనిమంగలియొక్క అమిత సునిశిత విమర్శయనుట విదితము. ఋషుల ఆత్మనియమనిగ్రహ సాధన విధానము మనకు అర్థముకాని వ్యర్థపురాణము కావచ్చు. కాని, ఆనాటి పురాణనీతులు ఎండి వాడిన పసచెడిన ఎండు వరుగులైపోయి,— నేటి మన సినిమాభామల చేతల రీతులు ప్రేక్షకుల చిత్తము జల్లుమన వారి విత్తమును కొల్లగొనదగు మచ్చున పచ్చిపచ్చిగా ప్రదర్శితమగుచున్న, ప్రస్తుత వికృత పరిస్థితిలో, సినిమాతారల త్రికోల, త్రి"షా"ల భజన మన సుజన లక్షణమా యనెడి సునిశిత విమర్శ గాని, తర్జనభర్జన గాని దుర్జన లక్షణమూ కాదు; పనిలేని మంగలి పదును లేని కత్తితో చేయు పణమూ ఫలమూ లేని అమంగళ బిడాల వపనమూ కాదు. మనము ఋషులము కాము -ఆమాట ముమ్మాటికీ నిజమే. ఋషులమూ కాము; ఋషుల పరిహసింప సాహసించగల పరమపురుషులమూ కాము. కాని,ఆత్మపరిశీలన చేసుకుంటే అసలువరుగై పోయింది మనమేగాని యుగయుగాలనుంచీ ఉన్న యీ ప్రపంచంకాదు. ఈ సనాతన పురాతన భారత భూమి కాదు.

మన ప్రాచీన సంస్కృతిని మనం జీర్ణం చేసుకోలేని శీర్ణావస్థలో ఎండు వరుగై పోయింది మన జీర్ణకోశం. మన పూర్వుల జీర్ణకోశం సకలశాస్త్ర సమన్వయకోశంగా, విజ్ఞాన సర్వస్వంగా ఉండేది. వారు సకలశాస్త్ర సమగ్ర సమన్వయ శక్తితో తత్వజిజ్ఞాస చేశారు. అన్ని తీగెలను ఒక్క స్థాయిలోకి శ్రుతి చేశారు. ఆర్థికం పారమార్థికం వేర్వేరుగా తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం అన్నట్లుగా వాళ్లు విమర్శించి పరిశీలించలేదు.

ఆయుర్వేద వైద్యశాస్త్రజ్ఞానం ఎందుకయ్యా అంటే, ఆయుర్వృద్ధికోసం - ఆయుర్వృద్ధి ఎందుకయ్యా అంటే, ధర్మసాధనకు-ధర్మసాధన ఎందుకయ్యా అంటే, ఆత్మ పరిపక్వానికీ, ఆత్మశాంతికీ అన్నారు. కాబట్టి వైద్యం అనేది ఏవిధంగా చేసినప్పటికీ వ్యాధుల నిర్మూలించాలి. వ్యాధి భయం లేకుండా చెయ్యాలి. మంత్రం వేసినాసరే, నవగ్రహ జపం చేసినాసరే, సూర్యనమస్కారాలు చేసినాసరే, చేయించినా సరే, చెరువులోని మెత్తని ఒండ్రుమన్ను తెచ్చి మట్టిపట్టీలు వేసినాసరే, వ్యాధి బాధలను నివారించేటట్లు చెయ్యడమే ప్రధానం. అటువంటివన్నీ వైద్య విధానములే - అవి అన్నీ ఆదరించి అభిమానించి పోషించి ప్రోత్సహించదగిన విద్యలే. అది సనాతన ఉదారభావం.

అమెరికాలో అనేక సంవత్సరాలు అత్యంతాధునిక ఔషధముల పరిశోధనలు చేసిన కీ॥ శే॥ డాక్టరు యల్లాప్రెగ్గడ సుబ్బారావుగారు అఖండ కీర్తి విఖ్యాతులైనారు. వారు కనిపెట్టిన అనేక ఔషధ ప్రక్రియలను అమోఘములైన ఆధునిక చికిత్సా విధాన సాధనములుగా యీనాడు విరివిగా వినియోగిస్తున్నారు. అటువంటి ఔషధ ప్రక్రియలను, యోగములను ఆయన కష్టించి కనిపెట్టి అమెరికాలోని ఔషధ వ్యాపార సంస్థకు సమర్పిస్తే, ఆ ఔషధ వ్యాపార సంస్థ అపార లాభములను ఆర్జించి ఆయనకు కృతజ్ఞతా వందనము లర్పించుటలో ఆశ్చర్యంలేదు. వ్యాపార ఆర్థిక ప్రయోజనములకై అనేక శాస్త్రవేత్తల శాస్త్రపరిశోధనలను ప్రభుత్వాలుకూడా ప్రోత్సహిస్తున్నాయి. పరిశోధనల ప్రయోజనం ఏమిటి? ఆర్థికలాభం. పండితుల శాస్త్రజ్ఞానం వ్యాపారస్థులకు అక్కరకు వచ్చే సరకుగా ఉండాలి. ఎవరైనా ఒక తపస్సంపన్నుడు తన తపశ్శక్తివల్లగాని, యోగసిద్ధివల్లగాని, అనేక వ్యాధులను అవలీలగా పోగొట్టవచ్చు. కాని, ఆ తపశ్శక్తి ఆయనలోనే ఉంటుంది. ఆ యోగసిద్ధి ఆయనకే బద్ధమై ఉంటుంది. కీ॥ శే॥ పాముల నరసయ్యగారు తమ మంత్రప్రభావమువల్ల త్రాచుపాము కరచిన వానిని కూడా బ్రతికించారు.

అటువంటి మంత్రప్రభావం కనిపెట్టినట్లయితే, దానికి తగిన విలువయిచ్చి ఏ వ్యాపారపు కంపెనీ అయినా యీమంత్రం కాపీరైటు కొనుక్కొని వ్యాపారం చేయడం వీలవుతుందా? భారీ ప్రమాణంలో బజారు సరుకుగా అమ్మదగిన మహాప్రసాదం కాదు యీ మంత్రప్రభావం - అందువల్ల యిటువంటి మంత్రవిద్యలను, యోగసిద్ధులను, ఆత్మశక్తులను ప్రోత్సహించడం ఆర్థిక వ్యాపార దృష్టిలో వ్యర్థ నిరర్థక వ్యాపారం. ఇటువంటి ఆత్మశక్తి యోగశక్తి చింతానురక్తు లందరూ అవ్యక్తులు - అప్రయోజకులు - వారి విద్యలన్నీ కూటికీ, గుడ్డకూ అక్కరకురాని విద్యలు. అందువల్ల ఆత్మతత్వ విచారణ ఆధునిక ఆర్థిక ప్రపంచంలో అక్కరకురాని విద్య అయింది.

కాని, ఆత్మశక్తివల్ల సాధింపగల్గిన స్వరాజ్యమే స్థిరమై చిరసౌఖ్యప్రదమై వెలయగలదని మహాత్ముడు మనకు చెవినిల్లు గట్టుకొని బోధించి ప్రబోధించి పరమపదించాడు. అటువంటి స్వరాజ్యమే స్వారాజ్యమన్నాడు. భారతజాతిగాని, అఖిలభారత జాతీయ మహాసభగాని తన మాటలను ఎండిన వరుగుల మాటలుగా ఎంచి పాటించనియెడల, తాను మంచుకొండలకు వెళ్ళి తన ఆత్మశక్తిని తాను గ్రహించుటకై ప్రయత్నిస్తానన్నాడు. తపస్సుకై హిమవత్పర్వతములకు వెళ్లి తన మహిమ హిమవత్పర్వతములకంటె మహోన్నతమైనదని మహాత్ములు గ్రహించి తరించగలరు. కాని ఎవరెస్టు శిఖరం ఎక్కినా "శివశివా!" అని స్మరించనివాళ్ళకు, ఆ మంచుకొండ ఎక్కినా లభించదు ఆత్మజ్ఞానం. ఆ మంచుకొండ ఎత్తును పరిశోధించే శాస్త్రవేత్త తన మహత్తును గ్రహించే సాధన సంపత్తితో, చిత్తప్రవృత్తితో ఆ కొండలకు వెళ్ళడు. ఆ మంచుకొండనెక్కెడి భౌతిక శాస్త్రవేత్తకు కలిగే ఆనందంకంటే మించిన ఆత్మానందం, అక్కడ తపస్సు చేసిన యోగులు పొందిరనే మాటలు తాతలనాటి వరుగుల మాటలు కావచ్చు. కాని వారికి కలిగిన ఆనంద భవాశ్రువులు మన కిప్పుడు కలుగవు. ఈ ఆనందబాష్పములు మన కంటివెంట రావు. ఆత్మచైతన్యం ఎండిపోయిన ఎండువరుగుల కుండయెవరు? పాత కొత్తల మెఱుగు తరుగుల నెఱుగని యఖండులు నేటి మేటి పురాణ తత్వ పరిశీలనా ప్రవీణులు - ఆత్మవిద్యతో సంబంధంలేని. ఆర్థికయుగంలో వరుగులు ఏవో గురుతెరుగని పరిస్థితి పరిపరి విషయముల పరిస్ఫుటము కాగలదు.

అందువల్లనే
జన్మాంతోద్వేగులమైన మేము
శివశబ్దావృత్తితో, నెప్పుడే
త్యంతానంద భవాశ్రు సంకుల
నిశావాప్తిన్ సుఖింబుందుమో!
అని కలవరించేవాళ్లు కరవైనారు. ★

# వీధిలో మనిషి

[ఆ వీధిలో రాత్రి బాగా పదిగంటల వేళప్పుడు, వూరిజనం ఎవరిళ్లకు వారు చేరి, వారి వారి పెళ్లాం పిల్లల్ని ముచ్చటగా చూసుకుంటూ, సుష్టుగా భోజనాలు చేసుకుని, మెత్తమెత్తగా పక్కలు సరిచూసుకుని, వెచ్చవెచ్చగా నిద్రపోయే వేళప్పుడు, వెంకటప్పయ్యగారి వీధి అరుగు మొత్తమీద వొళ్లంతా పైపంచ కప్పుకుని, కళ్ళూ చెవులు వీధి వేపుకు నిక్కబెట్టి, బిగదీసుకుని ముడుచుక్కూచున్న ఆ మనిషి ఎవరైందీ, ఆవేళప్పుడు అంత చలిలో అక్కడ ఎందుకు కూచుందీ చూసినవారికి అంతు పట్టటం బహుకష్టం.

ఇంతలో ఎక్కణ్ణుంచో ఓతోక తెగిన చుండు నాయకుల నల్లటి వూరకుక్క డొక్క లెగరేసుకుంటూ, అయింటి యీ యింటి మొత్తల్ని వాసన చూసుకుంటూ, గబగబ వెంకటప్పయ్యగారి వీధి అరుగు మొత్తదగ్గరకొచ్చి ఒక్కసారిగా గభిక్కున ఆగిపోయి, అరుగు మొత్తమీద విగ్రహమల్లే కూచున్న ఆ మనిషిని చూసి, వెంటనే గబగబ రెండు మూడుసార్లు ముక్కుపుటాలు ఎగరేస్తూ వాసనచూసి, ఏదో అనుమానం ముక్కుమధ్యన అడ్డంపడినట్టయి భౌయిమనరిచింది. కూచున్న మనిషిని పరీక్షగా చూస్తూ ఒంటి మొత్తమ్మీద ఏ భాగాన్నికూడా యింతంటే యింత కదల్నికుండా బిగదీసేసి, తనకేం ప్రమేయం లేనట్టు చల్లగా కళ్లు మూసుకున్నాడా మనిషి. తగిల్న అనుమానం వెంటనే విరగడైనట్టు ఓ చిన్న దగ్గు దగ్గేసి, చివరిసారి అరుగు మొత్తను యింకోసారి దీర్ఘంగా వాసనచూసి గిర్రున తిరిగి ఆ చీకట్లోకి దూకి ఎటుగానో మాయమైంది వూరకుక్క.

అయితే యింటిలోపల వెంకటప్పయ్యకు పక్క వేస్తున్న పెళ్ళాం వెంకాయమ్మ చెవిన వూరకుక్క అరుపు గట్టిగా నాటింది. వెంటనే వెంకాయమ్మ వెంకటప్పయ్యను వెంటబెట్టుకునివచ్చి, వీధితలుపు దభీమని తెరిచి అరుగు మొత్తమీద చూసింది.]

వెంకా: ఇంకేం? నేననుకున్నంత పనీ అయింది.

వెంకట: అసలు నువ్వు అనుకున్నదేవిటీ, జరిగిందేమిటి?

వెంకా: ఇంకా జరిగిందేమంటారేమండీ. ఇదిగో? ఎవరా అరుగుమీద కూచుందీ? అదేమిటి అట్టా బిగదీసుకుంటున్నాడేం ఆ మనిషీ? కాస్త ముందుకొచ్చి కనుక్కోరేమండీ? అట్లా వెనకవెనకనుంచుని చూస్తారూ?

వెంకట: బాగానే వుంది. అసలు నువ్వు నన్ను ముందుకు పోనిస్తేగా పోనివ్వందా? దారికడ్డంగా నిలబడి ముందోస్తివిగా అన్నీ నువే ఆరా తీస్తుంటివి.

వెంకా: అరుగుమొత్తమీద ఆ విధంగా ఆ మనిషి దుప్పటి కప్పుకుని నక్కి కూచుంటే ఆరా దీస్తున్నానంటా రేమి

మా. గోఖలే

టండీ? దారే పొయ్యే యీ వూరి జనాన్నందర్నీ ఆరాతీసే ఖర్మం పట్టలా నాకు. వీధిలో మాటకు ముందర పెద్దపెద్ద మాటలు మాట్లాడకండి. ఎవరన్నా వింటే యిట్టే నవ్విపోతారు.

వెంకట: ఎందుకు నవ్విపోరూ? ఆ అరుగుమీద కూచున్న పెద్దమనిషి యింకా నీ ధోరణి వినకుండా వున్నాడంటావా? యింతకూ నువు నాకు అడ్డంలేచి ఆ మనిషిని చూడనిస్తావో లేదో ముందు చెప్పే. తొందరగా లోపలికి వెళ్లి, పడుకుంటా.

వెంకా: అవ్వ... చూశారా, ఆ మనిషి ఎట్టా బిగదీసుకుపోతున్నాడో మనల్ని చూసి? అట్టా చూస్తారు ఇంకా అడగరేం? మరీ మనిషి దగ్గరకంటూ పోక యిక్కణ్ణుంచే కాస్త కనుక్కోండి మీకు పుణ్యం వుంటుంది?

వెంకట: ఛస్తున్నాం మీ ఆడవాళ్లతో. ఎందుకు అట్టా లబలబలాడి పోతావూ? వుండు. ఎవరా కూచున్నదీ?

మనిషి: ఆఁ...

వెంకా: ఆఁ ఏమిటో? అక్కడ ఎందుకు కూచున్నాడో చెప్పమంటే. ఆ, యీ అంటూ నంగినంగిగా మాట్లాడతాడేం?

వెంకట: అసలా మనిషి నోట్లోంచి మాట రానిస్తావంటావా లేక యిహ నువ్వే మాట్లాడ్తూ కూచుంటానంటావా? ఆ కూచున్న మనిషి పొరపాటున ఏ పెద్దమనిషో, ఏ పరమసాధువో గనకైతే యిహ మనకు పుట్టగతు లుండవు. లోకోత్తర పురుషులు ఐహికసుఖాల్ని ఆశింపక యీ విధంగా సంచరిస్తారు కూడా.

వెంకా: అయ్యొ. పల్లెత్తు మాట నేనెవర్నీ అన్లేదే. పాపం. ఆయనెవరో కనుక్కోండీ తొందరగా.

వెంకట: వుండు గాభరా పడకు. ఎవర్నాయనా అక్కడ కూచున్నారూ?

మనిషి: నేనేండి. వూరకనే కూచున్నా.

వెంకా: ఎవడో మాలపక్షల్లే వున్నాడు కాస్త సరిగా కనుక్కోండీ?

వెంకట: అబ్బబ్బ వుండవమ్మా తల్లీ. ఇదిగో, కాస్త గట్టిగా చెప్పు, వినపట్టం లేదూ?

మనిషి: వూరకనే కూకున్నా లెండీ. కాసేపుండి ఎల్లిపోతా.

వెంకా: ఇంకేం? నే ననుకున్నంత పనీ అయింది. వీడెవడో యివాళ మనమీదే పట్టిచ్చాడు. కాస్త ఒకడుగు ముందుకు వేసి వీడెవరో చూడరేమండీ?

వెంకట: ఒకడుగు కాదు, పదడుగులు వేసిచూస్తా, నువు నన్ను స్వేచ్ఛగా వుండనిస్తే. ఇదిగో? మీ దేవూరూ?

వెంకా: వూరూ గోత్రాలూటండీ అడగటం ఆ పేరేమిటో బయటికి లాగుతే తేలిపొయ్యేదానికి? మీరుండండి. ఇదిగో నీ పేరేమిటీ?

వెంకట: ఎవరూ? పోలాయా?

వెంకా: పోలాయా. ఏ పోలాయండీ?

వెంకట: ఏపోలాయేమిటే. నీకు పోయిన కొద్దీ మతిపోతున్నట్టేవుంది చూస్తే. ఆ కూచున్నది మన ఏనాది పోలాయిగాదుటే.



రూపశిఖ
ఫొటో : నాళం కామేశ్వరరావు—రాజమండ్రి.

# ★ వీధిలో మనిషి ★

కొంతు అదేవని అప్పుడే అనుకున్నా.

వెంకా: మన ఏనాది పోలాయా యింకా నయం

వెంకట: ఇంకా నయమేమిటి నయం! అనవసరంగా పాడలుగొట్టి చంపితివి. పద పద లోపలికి, వెళ్ళి పడుకుందాం

వెంకా (మెల్లిగా) మీకేమన్నా మతి పోతున్నదా ఏమిటి? రాత్రి పదిగంటలప్పుడు వాడు వాళ్ల గూడెంలో పడుకోకుండా ఆవిధంగా దుప్పటి కప్పుకుని మూల నక్కి కూచుంటే మీకు చీమకుట్టినట్టు లేదేం?

వెంకట: (మెల్లిగా) ఆ, నీదంతా మరీ వృత్త

వెంకా. (మెలిగా) అట్ల కొంప గుండాన పడుతుంటే యింకేమన్నావుండా? మీరు లక్ష చెప్పండి. వాడి వాలకం, ఆ నంగినంగి మాట్లాట్టం, ఆ నక్కినక్కి కూచోటం చూస్తూంటేనే నాకు దడపుడుతున్నది అందుట్లో యీ ఏనాదులు కన్నాలు వేయటానికి ప్రసిద్ధని లోకం కోడయి కూస్తున్నది

వెంకట: ఇదిగో పోలాయ్!

పోలాయ్: ఏంటి దొరా?

వెంకా: ఇంత రాత్రప్పుడు యిక్కడెందుకు కూచున్నావురా పోలాయ్?

వెంకట: గూడెం పోకుండా యిక్కడెందుకురా కూచున్నావు?

పో: ఎక్కడయితే ఏంలే దొరా, కాసేపు కన్ను మూస్తే చరిపాయె

వెంకా: ఇంత చలిలో నువు కన్ను మూయకేం?

వెంకట: అవున్రా యీదురుగాలికూడా సాగుతున్నది ఎందుకురా విశేషంగా గుడిసెకు వెళ్ళి వెచ్చగా పడుకోకా?

వెంకా: అవును పూరిగుడిసెల్లో ఎంత వెచ్చగా వుంటాదీ నాకు బాగా తెలుసు. వెళ్లువాయనా, వెళ్లు హాయిగా వెచ్చగా పడుకో

పోలా: ఆఁ, ఏం లేదులెండి - మొన్న గాలోనకు మా గుడిసె కప్పు కాస్తా లేగిపోయేమా, యాడయితే ఏంలే యీ అరుగు మీన పండుకుందాం గందా అనొచ్చి కూకుండా గలీజ చెయకుండా గమ్మున పండుకుని, తెల్లారకతలకే లేగిసిపోతా లెండి

వెంకా: అయ్యో! అసలు నువీ చలిలో యీ అరుగుమీద పడుకుంటే లోపల మాకు నిద్దర పట్టదు చూస్తూ చూస్తూ.

వెంకట: అంతకన్న సిగ్గు నాకింకోటి ఉండదు

పోలా: మా గూడెంలో యిప్పుడుంటే లేదకన్న యీ సలి ఒక లెక్కంటండీ మీకెందుకు మీరెల్లి ఆయిగా పండుకోండి దొరా, దొంగలు గింగలు రాకుండా నేనీడ కుక్క కావిలి కాస్తాగా.

వెంకా: (మెల్లిగా) చూశారా వాడి ఎత్తు! యివాళ వీడు మన కొంప ముంచాడే వున్నది కాస్తా వూడ్చుకుని యీ పూర్ణించి పత్తాలేకుండా పోతే అప్పుడు మీరూ నేనూ వీధిలో కాపరం పెట్టొచ్చు

వెంకట. (మెల్లిగా) అంతపని జరిగినా జరగవచ్చు—

వెంకా: (మెల్లిగా) తమ్మా గిద్దని యింకా నీళ్లు నములుతారేం వాణ్ణి యీడ్చి అవతల పారెయక - ఒరే పోలాయ్!

పోలా: ఏంటి దొరసానమ్మగోరూ?

వెంకట. ఆఁ—ఏం లేదురా పోలాయ్. నిన్ను చూస్తే మా అవిడకు ఏంటో— యిదిగా ఉందట గానీ, కాస్తలటు ఎటూ వేపన్నా వెళ్ళి పడుకో - ఏం?

వెంకా: తెలివి మండినట్టే ఉంది. యింతకీ యిదా మీర చేదీ—

పోలా: అకేంటి దొరగారూ తెల్లారిగెస్తే యీ పోలాయ్ తమ కళ్లముంగల

మసుల్తాడు, రేత్తిరవంగానే మారిపోతానంటండి? నేనీడ కూకుంటే తనుకు ఎటనో ఉందని అప్పుడే సెబుతే యిందాకనే ఎల్లిపొయ్యేవాణ్ణిగా?

[తనను చూసి ఉత్త పుణ్యానికి వెంకటప్పయ్య, వెంకాయమ్మలు బెదిరిపోయినారనుకుంటూ మెల్లిగా వీధిలోపడి చోటుకోసం వెతుక్కుంటూ సురవయ్య దుకాణం దగ్గిర కొస్తాడు పోలాయ్. సురవయ్య దుకాణం తలుపుకు అడ్డంగా మంచం వేసుకుని, పక్కనే అరుగుమీద సాధువు కూచుని పాడుతున్న తత్వం వింటుంటాడు, నిద్రకలతలో సురవయ్య.]

సాధువు తత్వం :

ఈ జన్మ మిక దుర్లభమురా
సహజన్మ సహకార సద్గురుని గనరా
......ఈజన్మ...

.........
.........
.........
.........

పోలా: దణ్ణమండి సాగువుగోరూ.

సాధు: భగవదర్పితం. ఎవరు నాయనా?

పోలా: మాదీవూరే లెండి. యీడ కూసేపు కూకుంటా.

సాధు: భగవదేచ్ఛ హరి.

సురవ: ఎవరా వచ్చిందీ?

పోలా: నేను పోలాయ్‌నిగదండీ సురవయ్యగోరూ.

సుర: రాత్రివేళ వీదో పనిమీద వచ్చినట్టున్నావే?

పోలా: అబ్బెబ్బెబ్బె. రేత్తిరి నాకేం పనుంటది సావాఁ? తత్వం యింటా కూసేపు కూకుందామనీ—

సుర: ఏందో? అర్ధరాత్రప్పుడు అంకమ్మ సివాలని నువు యిప్పుడు యిక్కడ కూచుంటావా? ముందు లే అక్కణ్ణుంచీ?

పోలా: అదేంటి సావా? నేనేం జేశానండీ?

సుర: అసలు మీ ఏనాది ముశాకు యింత రాత్రప్పుడు నా దుకాణందగ్గిర ఏం పనుందీ? ముందు నడు యిక్కణ్ణుంచీ?

సాధు: హరి.

పోలా: ఆదేంటండోయ్. తెల్లారింది మొగులు మీ దుకాణంకాడ తిరుగుతుంటాను రేత్తిరికి రేత్తిరే మడిసిని మారిపోతానంటయ్యా యీడన్నా?

సుర: ఇదిగో యివన్నీ కాచి వడబోసినట్టు యీ సురవయ్యకు తెలుసుననుకో— తెలిసిందా? పగలు పగలే రాత్రి రాత్రే. లే లే—

సాధు: భగవదేచ్ఛ. హరి.

[సాధువు మళ్ళీ తత్వం అందుకుంటాడు. పోలాయి మళ్ళీ కాళ్లీడ్చుకుంటూ ఏనాది గూడెం యివతల చెరువుపక్క మర్రిచెట్టు కింద కొచ్చి నుంచుని గూడెంవేపు చూస్తుంటే వెనకనుంచి ఓ నల్లని విగ్రహం వొచ్చి పోలాయ్‌పక్కన నిలబడ్తుంది, పోలాయ్ గుండె అదిరేటట్టు].

పోలా: ఎవరు...నువు దెయ్యానివా?

విగ్ర: నేను నీకు దెయ్యానికిమల్లే అగుపిస్తుండానా? అవున్లే, నేను వోడులైతే నే సాలనుకుంటున్నావు పాపం.

పోలా: ఆఁ. సీతాయ్?

సీతా: ఎవురయిందీ అగుపియటంలా?

పోలా: యాడికే నువు ఎల్లిందీ?

సీతా: యాడికో ఎట్టోకెల్లా.

పోలా: సిగపాయ ఊడదీసితంతా, పిచ్చి పిచ్చి ఎసిగాలేశావంటే. నాకాడనంటే నీయాటా?

సీతా: మా తన్నావులే మొగోడివి. నాకూ తెలుసు నీ ఏసం. తింటానికి తిండి లేదు, వుంటానికి యిల్లులేదు, ఏ ఆడదయ్యా నీతో కాపరం సేసేదీ? పొద్దస్తమానం నన్ను కనిబెట్టుక్కూకుంటావుగాని నీకసలు మన కాపరం నిలబెట్టే ఆలోశ సుందా? రేత్రి గాలివానకు గుడిసె కప్పంతా లెగిసిపొయె తెల్లారి లెగిసి యాడికి బోయినావో ఏ యాలకు రాకపోతివి. ఆమైన సింతపల్లిలో మా పిన్నాం గారింటి కెల్లిపోయినా.

పోలా: పోయిందానివి మళ్లీ ఎందుకొచ్చావు? అవజాన ఏమారాజు నన్నా బతిమలాడుకుని, కూలిపనేదన్నా సేసి, నాలుగు డబ్బులు సంపాయించిగాని యింటికి రాగూడదనుకుని నేనుపోతే, సెప్పవన్నా సెప్పకండా నంటే లగెత్తుకెల్లేదీ? నువు యాడికిబొయ్యిందీ, ఏమయిందీ నా కెట్టనే తెగిసేదీ? నీకు ఒల్లుబల్సిగందా అటువంటి పన్లు సేసేదీ? ఆ సూరయ మారాజు బాయి తవ్విస్తుంటే ఓ రూపాయిడబ్బులు కళ్ళ చూసి, యింటియింటికి తిరిగొస్తే లగెత్తుకుపోతావంటే? నీకోసం వూరంతా దిమ్మ తిరిగితి నే.

సీతా: నిజంగానా? నాకు తెలవలేదయ్యా.

పోలా: ఏంటే నీకు తెల్పేదీ? యిదేమన్నా మొగుడూ పెల్లాంయవారమనుకుండావా, మరింకేదైనా అనుకుండావా?

సీతా: బుద్ధితక్కువ పనిసేశా. సెంప లేసుకుంటుండా? మా పిన్నాంగారింటికి ఎల్లానేగాని, ఎల్లినప్పట్నుంచీ పిచ్చెత్తినట్టయి ఆమయిన యిగ సీకట్లోబడి లగెత్తుకొచ్చా. యిగ ఎప్పుడూ సెయను గా?

పోలా: నువు అగుపించకపోయేతల్లికి పానం ఎటోపోయిందనుకో. గూడెం పోను మొగం సెల్లక సీకట్లో యీ యీడుల్లో తిరుగుతుండా.

సీతా: నేనుత్త అక్కడచ్చిని. కాగా తన్నాల్సిందే నన్ను.

పోలా: లేదులేయే బుల్లా. నిన్ను తన్నటానికి నా సెయి, కాలు రాకేం.

సీతా: నా కంతే సాలు. పదయ్యా తెల్లారేదాకా ఏ మారాజు అరుగుమీద కన్నా ఎల్లి పండుకుంతాం.

పోలా: ఆ, అంతా మారాజులే. యింతకు ముంగలే ఆ ఎంకటప్పయ్యగారి అరుగు మీదా, సురవయ్య అరుగుమీదా అట్టకూకో బొయ్యానో లేదో నన్ను కుక్కను తరిమినట్టు బయిటికి తరిమారు. యీ మారాజులు మనకి ఎప్పుడేం జేస్తారో తెలవనన్నా తెలవదు. తెల్లారగిసి మనల్ని ఎన్నిసార్లు సూసీ ఎన్ని పన్లుసేయించుకున్నా, వుండట్టుండి అరికి మనం దొంగలకి మల్లే అగుపిస్తాం.

సీతా: ఎంతిన్నాయం.

పోలా: మెల్లిగా అంటా వేంటే? ఎప్పటికయినా యింతన్నాయం ఊరక నే పోదు.

సీతా: పదయ్యా, మన గూడానికేపోయి యాడన్నా యింతసోటు సేసుకుని పండుకుందాం.

పోలా: అంతే. మన గుడిసెలో నే యాడో ఓమూల నాలుగు తాటాకు లేసుకుని పండుకుందాం పద. యిదిగో బుల్లోవ్? నా బొడ్లో గిద్దెడు బనగపప్పూ, అర్ధణా బెల్లం వుండదే.

సీతా: నువు బలే మంచోడివయ్యా. పద దబ్బున ఎల్దాం.

[ఆలిండియా రేడియో ప్రసారితం]



# జెట్టి

## 1

బయట సన్నని జల్లు పడుతున్నది. లోపల గాలిలేక ఉక్కపోస్తున్నది. కొంప ఇరుకుకొంప. పదివేల కల్పాల నుండీ కాలగమనం స్తంభించిపోయినట్లుగా వుంది.

తండ్రీ కొడుకులమధ్య సంభాషణ సాగలేదు. వాళ్ళిద్దరూ అజానుబాహులు. జెట్టీలు. తరతరాలనుండీ తమను పోషిస్తున్న ప్రభువుల వీరసేవలో వారి కండరాలు పిరికితనాన్ని మరిచిపోయినవి. ఉష్ణకాసారంవలె వుడుకుతున్న వాళ్ళ రక్తం గదిలోని విషమ ప్రతిష్టంభనలో సంచలనమే పోగొట్టుకొన్నట్లున్నది.

ఆ యింట్లో దీపంలేదు. నరశింహులు జెట్టి - నిప్పురాయికొట్టి ఆరిపోయిన పచ్చి ఆకు చుట్ట తిరిగి వెలిగిస్తున్నాడు. నిప్పురాయి మెఱుగులో అతని పలితకేశాలు బంగారంవలె మెరిసినవి. కొడుకు పొంత కుండపక్కనే మునిగాళ్లమీద కూచుని పొయ్యిలోకి పుల్ల లెగదోసి మంటజేస్తున్నాడు. అతని ముఖం తూర్పుకు. తండ్రి ముఖం పడమటకు. తడిపుల్లలు మండక పొగతో వేధించినప్పుడు, పొయ్యిమీద కుండలో కళ పెళ అగిపోతున్నది. కుండలోవి గిద్దెడంటే గిద్దెడే మెరికలు దంచగా వచ్చిన బియ్యపుగింజలు. కాని కుండ నిండుగా గంజి వస్తుందని పొగలో, విషవాయు స్తంభనలో రెండు మానసిక సంఘర్షణలలో-బరువుగా, బిరుసుగా, దురభిమానపు మూర్తిగా, నిరాశాదేవతమంటపంగా మారిన ఆ యిరుకుకొంప ఒక తాత్కాలిక ఆశతో - కాలగమన స్తంభనను ఛేదింపజూస్తోన్నది. కాని పొగను భరించలేని వీరరాఘవులు జెట్టీ కళ్లు మండిపోతున్నవి.

విసుకుపుట్టి పెద్ద జెట్టి చుట్ట పారవేయబోయాడు. కాని అతనిచెయ్యి వెనుకకు లాగింది. చిన్న జెట్టి, కడుపు మంటతో కుండ బద్దలు చెయ్యబోయాడు. కాని అతని మనసు వెనుకకు పీకింది. అతడు బొంగు వూదుగొట్టాన్ని కింద పారేశాడు. కుండలో గుడబిడ, గప్పునలేచిన మంటతో పాటు, తిరిగిసాగింది. కాని జెట్టీలమధ్య

కారు. ఆకలి, రక్తం, శౌర్యం వాళ్ళిద్దరూ పంచుకొన్న పొత్తు సొత్తులు.

ఉండివుండి జెట్టి నరశింహులు మట్టిఆకు పొరగా చుట్టిన చుట్ట దూరంగా విసిరివేశాడు. కొడుకు పక్కకు తిరగకుండానే- "రాజావారు కబురు పంపించారు" అని విషవాయువులోకి తన ఆత్మను వదిలాడు.

పగ్రతాచువలె పొగగొట్టాన్ని వూదాడు చిన్న జెట్టీ వీరరాఘవులు. అతడు తండ్రిమాటకు ఊఁ అనలేదూ ఆఁ అనలేదు. కాని ఆ మాటలు పదివేల కల్పాల నిశ్శబ్దతనూ, విషమ ప్రతిష్టంభననూ భంగపరచగలిగినవని అతనికి తెలుసు.

కాని అతడు సమాధానం చెప్పలేదు. అన్ని నాళాల్లోని రక్తం జివ్వున అతని హృదయమండలంలోకి లావావలె దూకింది.

పెద్ద జెట్టీ మళ్ళీ మెల్లగా అన్నాడు.

మునిపల్లె రాజు

"చిన్న దొరవారు సీమనుంచి తిరిగి వచ్చారట" ఊఁ లేదు ఆఁ లేదు.

"యువరాజావారికి షికారీ సేర్పాలని కబురు" ఊఁ లేదు ఉప్పురాయి లేదు.

"పడమట అడివిలో చిరుతను మాటు పెట్టాలని సెలవయింది."

ఆ గదిలో హఠాత్తుగా ఒక ఉరుము వురిమినది.

"ఆ గాడిదలమాట నాదగ్గర లేవద్దని లక్షసార్లు చెప్పాను."

"వాళ్ల ఉప్పు తిన్నాంరా - వీరన్నా."

"ఆ మాటే వద్దన్నాను. ఎవరి దా ఉప్పు మనం తినటానికి? మన ఉప్పు మనం తిన్నాం. ఎవరి ఉప్పుతింటే అమ్మ అట్లా కుక్కచావు చచ్చింది? ఎవరి ఉప్పుతింటే మనకీ గతిలేని గంజి యివ్వాళ కరువైంది? ఎవరి వుప్పుతింటే నీకు కొయ్యకాలు దొరికింది'?"

జెట్టి నరశింహులు కండరాలన్నీ ఉబికిపోయినవి. చీకటిలోగూడా అతనికి అద్దంలోలాగా తన ముఖబింబం కనిపించింది. అది కందగడ్డ. ముదిరి ఎర్రబారిన నలుపు కందగడ్డ. ఆ మాటలు అతని జీవితపు సంసార ధరిత్రి. నిలవలేక అతడు కదిలాడు. ఒక కాలు బరువుగా కదిలి శబ్దం చేసింది. అది కుంటి కొయ్యకాలు.

బయటి జల్లు వానకింద మారింది. ఇంట్లో నిశ్శబ్దం తిరిగి మానవుల బహిః ప్రపంచంమీద అధికారం చలాయించింది. పొయ్యి త్రాచుపాము బుసలు కొట్టటం మానింది. పొయ్యిముందున్న మనిషి పళ్లు పటపటలాడలేదు. ఇటు కొయ్యకాలు కదిలి కటుశబ్దం చెయ్యలేదు. ఊర్ధ్వలోకపు అక్షౌహిణి జనుల ఏడుపువలె వాన శబ్దంచేస్తున్నది. పొయ్యి ఆరిపోయినట్లుంది. పైన బూడిద. లోపల నిప్పు.

వీరరాఘవులు రెండు ముంతల్లో గంజి పోసి ఒకటి నిట్టాడి స్తంభానికి దగ్గరగా వుంచి ఒకటి ముందుంచుకొన్నాడు. రెండు ముంతలనుండీ భూదేవి ఆవేదనవలె ఆవిరి పైకొస్తున్నది. చిన్న జెట్టీ గంజి వూదుకొని ఒకసారి చప్పరించాడు. అందులో ఉప్పులేదు.

అడివిలో మానులరాపిడివలె అతను పళ్లు కొరికి దిగ్గున లేచాడు చీకట్లో మూరులో చేతులుపెట్టి రెండు మూడుచోట్ల వెతికాడు. తిరిగి పొయ్యిలోకి తొంగిచూచి వూది ఒక మోడుపుల్లను కాగడాగా చేశాడు. ఈమాటు అతనికి చూరులో వుప్పు పొట్లాం కనిపించింది. కౌగితంమడతలు ఓర్పులేకుండా గబగబా విప్పాడు. అందులో చారెడు వుప్పుగూడా లేదు. అతడు పొట్లాం నిట్టాడిదగ్గిర ముంతలో విదిలించి తిరిగి తన ముంతముందు చతికిలబడ్డాడు.

ఒక్క నిట్టూర్పు విడిచి కొయ్యకాలు కదిలింది. అప్పుడే బయటినుండి వీస్తున్న చలిగాలికి ముంతలో ఆవిరి పైకి రావటం మానింది.

"అదిగాదురా వీరన్నా"

కొడుకు మాటాడలేదు. పెద్ద జెట్టి ఒకచేత్తో నిట్టాడి అందుకొని మెల్లగా ముంత అందుకొని, ఆవురావురున రెండు గుక్కలు తాగాడు. కొంచెం ఆగి, వుప్పు కరిగేట్లుగా ముంతను గుండ్రంగా కదిలించాడు.

"జరిగిందేదో జరిగిపోయింది. నీకా పని దొరక్కపోయె. చివరికి గుర్రాల మాలీసు చేద్దామన్నా రాజాగారి గుర్రాలన్నీ పట్నంబోయె. నాకు వెనకటి ఓపిక వుండి చచ్చిందంటా? ఈ షికారీకి పోయొస్తే పదిడబ్బులు దొరుకుతై. ఇంతలో నీకు పని దొరక్కపోదు."

కొడుకునుండి ఒక్క మాటగూడా రాలేదు. అతను గంజి చప్పరిస్తున్నాడు.

"నీతోడు. కానికాలం వచ్చింది. ఈ ఒక్కసారికి పోయిరానీ."

కొడుకు మాటాడదలుచుకొన్నాడు.

పెద్ద జెట్టీ ముంతలో గంజి అడుగునబడింది. వీరరాఘవులు ముంత తరగలేదు.

"యువరాజావారు మంచి సరసుడు. చిన్నప్పుడు సామూ, తుపాకీ నీతోపాటు గదరా నేర్పింది? ఏం దర్జా మనిషి! నువ్వెరగవూ?"

కొడుకు ఒక్కటే ప్రశ్న వేశాడు.

"అమ్మకు దొంగతనం అంటగట్టి కొసా వాళ్లు చావమోదుతుంటే ఏ దర్జాపురుషుడు అడ్డం వచ్చాడు?"

ఆకాశంమీది అమరలోకాలన్నీ ఒక్కసారి శోకించినట్లుగా, రాత్రి గభీరతలో, ఊర్ధ్వలోకాల అశ్రువులు ఆకాశానికి చిల్లులు పొడిచినవి. అంతకంతకూ వాన పెద్దదవుతూనే వున్నది. అన్నవలె చలిగాలి ఆసరా వచ్చినది.

ఒక్క వాక్యం. ఒక్క ప్రశ్న. ఒక్క దురంత కఠిన సత్యం. ఒక్క కుటుంబం. ఒక్క ఇల్లాలు. ఒక్క కొడుకు. ఒక్క తండ్రి. ఒక్క దురన్యాయం.

పెద్ద జెట్టీ పెల్లుబుకివచ్చిన క్రోధాన్ని దిగమింగుకొన్నాడు. ఎవరా మానవమాత్రుడు తనముందింకా ఆ ప్రశ్న తర్వాతగూడా బ్రదికున్నది? తనకొడుకు. తన రక్తాన్నీ, కండరాల్నీ, నరాల్నీ, బోలికల్నీ పంచుకొన్న తన కొడుకు. కన కనే బ్రదికాడు.

"మాట యిచ్చాన్రా వీరన్నా! నామాట విను. ప్రభువులతో పని. సాధించి చేసేదిమున్న. కలో గంజో తాగి బతకాలి."

కొడుకు ముంతఎత్తి సూటిగా స్తంభాని కేసి గిరవాటు వదిలాడు. ఆకాశపు శోకానికి ఈ మానవుల అంజలి యిది.

"మాట యిచ్చావ్‌గా - పో. పో. పో. వాళ్ళ గులాంవిగా. నీవు పుట్టలేదను కొంటా. ఇంత పిరికిగుండెకు, యింత నీచుడికి తిరిగి నేను పుట్టను. నీకూ నాకూ యింతే చెల్లు. పో. పో."

వీరన్న చీకటివానలోకి గంతు వేసి పోకాడు. పైనున్న శోకతప్తులు అతన్ని పిలవలేదు. కిందున్న చీకట్లో అతడు మాయమైనాడు. గంజికుండ పెంకులు పెద్ద జెట్టీ మంచికాలుకు గుచ్చుకొన్నవి. అతడూ వానలోకి తొంగిచూశాడు. తను ఊర్ధ్వలోకపు శోకాతురుల ప్రతినిధిగా గంజిముంతను వానలో పెట్టాడు.

## 2

పెద్ద జెట్టీకి పిలుపు వచ్చింది.

"దొరవారు తయారుగా వున్నారు. యూనాడులు పొద్దున్నుంచీ పడిగాపులు గాస్తున్నారు. ఏమయ్యావ్, ఎంత జెట్టీ వయితేమాత్రం యింత తల బిరుసా? పద పద"



# జెట్టి



పిలుపు !

"తను మాటుపెట్టిన పులిముందు నుంచుని తుపాకితో ఫోటో తీయించుకొని పేపర్లలో వీరులుగా మెప్పైశ్కె ప్రభువుల పిలుపు వచ్చింది. నరసింహాలు జెట్టి కొయ్యకాలు తిరిగి శబ్దం చేసింది. ఉక్కుభీముణ్ణి లక్కతుంపుల నుగ్గుగా ధృతరాష్ట్రునివలె తను ఆ పిలుపు తెచ్చినవాని పీకను నులిమివేయగలడు. కాని అది దొరలపిలుపు. అది కడుపు పిలుపు. అది ఆ యింటి ఆకలి పిలుపు. ఆ సంగతి పెద్ద జెట్టికి తెలుసు.

అతను నులకమంచంలో మూలుగుతున్న కొడుకువంక చూశాడు. ఆ చీకటిలో, వానలో కలిసి తడిసి జ్వరతీవ్రతలో, పూపిరితిత్తుల ఎగశ్వాసల తన కొడుకు యింటికి రాకపోయినా బాగుండును. కాని తన కొడుకు. తన యిల్లు. తన పొత్తుసొత్తు. వచ్చి నుక్కినులకమంచంలో దగ్గుతున్నాడు.

అతడు కొడుకువంక చూశాడు. అతని కుంటికాలు అడుగెత్తి అడుగువేసి పిలుపు తర్వాతి నిశ్శబ్దాన్ని భంగంచేసింది. ఎవరు తను? యుధిష్ఠిరుడా? ధృతరాష్ట్రుడా?

కొడుకుకు దగ్గు తెరవచ్చి పోయింది. అతడు పెద్దమూలుగు మూల్గాడు.

"పోయిరా బాబ్బా!"

పెద్ద జెట్టి చిన్న జెట్టివంక జూశాడు. తండ్రి కొడుకువంకకు తిరిగాడు. నరసింహాలు వీరరాఘవుల్ని తేరిపార జూశాడు. ఆ మాటలు ఆకాశాన్నుంచి వూడిపడలేదు. భూమి బద్దలై ఆశాంతన వచనం వినబడలేదు. అది తన కొడుకు కంఠం. అది తన కొడుకు వాక్యం. అది నుక్కి నులకమంచపు దగ్గునుండి వచ్చింది. అతని కొయ్యకాలు ముందుకు సాగింది.

అతను డప్పుల యానాదులతోపాటు జీప్‌లో కూర్చున్నాడు. వెనకవస్తున్న క్యాడిలాక్‌లో యువరాజావారు, పట్నం నుంచి భోగంవాళ్ళకోసం వచ్చిన ఆయన రసికమిత్రుడూ. చిఱుత పసిగట్టో, దెబ్బతినో యీ యువరాజా దొరనే కబళించబోతే తన ప్రాణం అడ్డువేసి ప్రభురక్షణకు పూనుకోవాలి. అడివిలో ముల్లు విరగకుండా యీ పాలబుగ్గల ప్రభుబిడ్డను తను కాపాడాలి. కాని తను, ప్రాణరక్షకుడు, దొరలప్రక్కనె కూర్చోను అర్హుడుగాడు. అతని హృదయం కమిలిపోయింది. నులకమంచంకుక్కిలోని మూల్గుల కొడుకు, దుమ్మును చీల్చుతున్న జీపుకారు అద్దంలో కన్పించాడు. ఆనాటి రాత్రి చీకటివలె అతని హృదయం నల్లనైపోయినది. ఆనాటి రాత్రి చీకటివలె అతని హృదయాన్ని నల్లని తలంపులు పెనవేసుకొన్నవి.

అడివికి మైలుదూరంలోనే ప్రభువులు కొట్టించిన మట్టిడొంక గూడా మాయమైపోయింది. అక్కడే కార్లాగినవి. కను చీకటి పడలేదు. జెట్టీ నరశింహాలు జీపుదిగి చిన్నదొరకు అభివాదం చేశారు. చిన్నదొర సిగిరెట్టు పారేసి డ్రైవరును సంబోధించాడు.

"ఎవర్రా యీ కుంటివెధవను మనతో తోలింది."

డ్రైవరు సమాధానం అతను - పెద్దజెట్టీ - వినలేదు. చిన్నబాబులు తనను మరిచిపోయారేమో.

"ఈ దాసుడు తమకు చిన్నతనంలో తుపాకివేత, సాము నేర్పాడు దొరవారూ!"

ఈ గురుసమానుడి మాట చిన్నదొర చెవిని దూరలేదు. రాత్రి అనుభవించవలసిన పసుభోగాలు భంగమైపోయాయని కుళ్ళుతున్న పట్నం స్నేహితుణ్ణి అతడు సముదాయిస్తున్నాడు. కుంటి వెధవ.

చిఱుతను చుట్టుపెట్టటానికి అన్ని సన్నాహాలు పూర్తిఅవుతున్నై. కాని పెద్ద జెట్టి హృదయం ఆ విషయంలో సన్నాహం కావటంలేదు.

కుంటివెధవా? శత్రురాజులు దండెత్తి వచ్చినప్పుడు ప్రభువుల ప్రాణాన్ని, అంతఃపురాల మానాన్ని, బొక్కసాల సంపదనూ - కాపాడిన వీర జెట్టీల సంతతివాడు. మల్లయుద్ధాల్లో సంస్థానపు గెలుపు జెండా ఎత్తిపట్టిన యోధుడు. ఈ కుంటికాలెందుకు వచ్చింది? ప్రభువులు తమవన్న అడవుల్ని ఆటవిక వీరులు కొల్లగొట్టకుండా ప్రాణాలొడ్డి పోరాడిన పంతాల్లోనేనా? మన్యపు చలి జ్వరాల్లో, నాలుగు నారికురుపుల్ని మరిచిపోయి, అహర్నిశలు ఈ ప్రభువుల ఆస్థి కాపాడి దేవిడీలో తిన్న తిండికి పదింతల సేవను సమర్పించిన సేవకుడు తను గాదా?

కాని యీ భీష్మాచార్యులకు, ఈ ద్రోణాచార్యులకు, ఈ అశ్వద్ధామలకు పట్నపునీతి అబ్బిన కొత్త రాచరికంలో కాసావాళ్ళకున్న గౌరవం లేదు. ప్రభువుల లాడీ కారుడ్రైవర్ల ప్రతిపత్తి లేదు. ప్రజలనుండి దోచుకొన్న భూములమ్ముకొని పట్నాల్లో ఫాక్టరీలూ, వండెపు గుర్రాలు కొన్న ఈ కొత్త రాచరికం కోటల్లో, దేవిడీల్లో అంగరక్షకుల పురాతన గృహాల్లో గూడా తలదాచుకోకుండా తరిమివేసింది. ఎవరీ కుంటివెధవా? వీరుడు. యోధుడు. గురుసమానుడు. ప్రాణరక్షకుడు. ఒకప్పుడు ప్రజాశత్రువు. ఇక - ప్రభుభక్షకుడు. భీష్మాచార్యుడు గాడు. శిఖండి. రావణాసురులకు విభీషణుడు. ధృతరాష్ట్రుడే గాని యుధిష్ఠిరుడుగా తను చచ్చిపోలేదు. తను అశ్వద్ధామ ఈ కౌరవ సంతానంనుండి ఏనాడో బయటబడ్డాడు. వానలో కొడుకన్నమాట తన వేదం. తన లక్ష్యం. తన ధర్మం. ప్రభుసేవలో పడిపోయిన తన పూర్వుల గోరీలకు ఇక రక్తాంజలి. తరతరాలు రైఫిల్ పట్టిన తమ నిరంకుశత్వానికి యిక ధర్మరక్షణ కర్తవ్యం. పులినుండి పులులు. దుమ్మునుండి మానవులు. రక్తంనుండి కొత్త రక్తం. వీరులనుండి వీరులు.

## 3

చీకటి పడుతున్నది. మబ్బులనుండి విడిన చంద్రుడి మూగవెలుతురు అడివి సాంద్రతమీద వాలి వాపోతున్నది. వేటకు కావలసిన మాటులన్నీ జెట్టి నరశింహాలు ఏర్పాటు చేశాడు. ఏభైగజాల దూరంలో చిన్న నీళ్లదొరువు ఒడ్డున ఎండి చిగురిస్తున్న చెట్టుకు మేకను అంటగట్టారు. దొరువు కెదురుగా చింతచెట్ల చాటులో

మంచె గట్టివున్నది. మంచెమీదికి చిన్న దొర నెక్కించి జెట్టి చిన్నగొంతుతో చిఱుతవేటలోని లోతుపాతులు వ్యక్తం చేస్తున్నాడు. యువరాజాగారి పట్నపు మిత్రుడు నిషా నిసాలతో డ్రైవరుతోపాటు కారు దగ్గరే నిలిచిపోయాడు. ఆయన అసహాయులైన అబలలను బలాత్కరించటంలో అతి ధైర్యశాలి. కాని చిఱుతపులుల వేటలో గాదు. మంచెకింద రెల్లుపొదల్లో డప్పుల యానాదివాళ్లు నాలుగు మూలలకూ చెదిరిపోయి నక్కివున్నారు. చిఱుతను అయోమయపరచటానికి వాళ్లు ఒక సమయంచూసి డప్పులు మోగిస్తారు.

మేకను పొట్ట బెట్టుకోటానికి వన్నెల మెకం వస్తుంది. దాన్ని భక్షించి దొరువులో నీళ్ళు తాగబోతుంది. ఆ మధ్యలో దానికి తుపాకిగుండు తగులుతుంది. ఇంతలో నలుమూలలనుండి డప్పులు మోగుతాయ్. దానికి శత్రు వెక్కడున్నాడో తెలియక తబ్బిబ్బుపడుతుంది. దారీతెన్నూ తోచదు ఇంతలో ఇంకొక దెబ్బ. ఢాం!! అంతే. ఇదీ ప్లాను.

"ఇప్పటినుండే ఆ స్థలాన్నంతా పరిశీలించి అవగాహన చేసుకొని గురి సరిజూసుకోవాలి" అని జెట్టి యువరాజా దొరవారి చెవిలో చెప్పాడు.

"మనిషివాసన దక్కిందా ఇక అంతు దొరకదు!"

యువరాజా తను సీమలో కొనితెచ్చిన జోడుగుళ్ళ ఆస్ట్రియన్ తుపాకి తెచ్చాడు వేటకు. పెద్ద జెట్టికి వెనకటి రోజుల్లో బహుమతిగా పొందిన మొదటియుద్ధం నాటి ఇంగ్లీషు ముతకరకం తుపాకి వుంది. కాని అది డజను మెకాల మెదడులు చీల్చిన ఆయుధం. అంతా నిశ్శబ్దం.

చిన్నదొరగుండెలో మోతలు జెట్టికి వినబడుతున్నవి. దొరవారికి యిందాకటి వేళాకోళం పోయింది. జెట్టి తను ప్రాణప్రదంగా యిన్నేళ్ళనుంచీ శుభ్రపరిచి పోషించి దాచిన తుపాకివంకకు చూశాడు. దానిబారు మంచె చీకటిలో నిగనిగలాడుతున్నది. చిన్నదొర హృదయస్పందనం ఆస్ట్రియన్ జోడుబార్ల తుపాకినుండి ప్రసరించి, తన మొద్దు తుపాకి బారునుండి సరాసరి తన హృదయానికి తగులుతున్నది. అంతా నిశ్శబ్దం.

అతనికి హఠాత్తుగా తనపేరు స్మృతికి వచ్చింది. తనపేరు జెట్టి నరశింహులు. నరశింహావతారంలో హిరణ్యాక్షు హిరణ్యకశిపుల వధ జరిగి, ప్రహ్లాదుల రక్షణ జరిగింది. కాని అతను పానకపు బిందెలు అసంఖ్యాకంగా తాగిన మంగళగిరి నరశింహస్వామివలె కదలక కూర్చున్నాడు.

అతను హఠాత్తుగా అన్నాడు - "బాబూ, తమ పేరేమిటి?" యువరాజా గజం పొడుగుగల తన బిరుదుల పేర్లపట్టీ చదివాడు. అంతా చెప్పి, "నా పేరెందుకు?" అని ప్రశ్నించాడు. జెట్టి "ఊరికనే - ప్రభువులకు చిన్నప్పుడు తుపాకి పేల్చ నేర్పించినప్పుడు ఎప్పుడూ అడగలేదు. అప్పుడు తమరు చిన్నవారు." అంతా నిశ్శబ్దం.

దూరాన రెల్లు గుబ్బులముందు ఒక నీడ కదిలింది. చిన్నదొర జెట్టిని తాకాడు నిశ్శబ్దంగా. యువరాజా చెయ్యి వణికిపోతున్నది.

"చిఱుత"

"కొంచెం ఆగాలి" అంతా నిశ్శబ్దం.

నీడ పెద్దదైనది. తర్వాత ఆకారం కనపడ్డది. ఆకారం అరుస్తున్న మేకవైపు నడిచింది.

మరొక క్షణంలో ఆకాశపు హృదయాన్ని ఛేదిస్తూ ఒక అసహాయ ఆర్తనాదం వినిపించింది. ఈ గురన్యాయాన్ని భిన్నురాలై తలవంచి అడివి దిక్కులేక పరికించింది. కాని ఆ మూలనుండి ప్రతిధ్వని ఆ ఒంటరి ఆర్తనాదానికి బదులు చెప్పింది. అంతా నిశ్శబం.

మంచెమీది మనుషుల కళ్ళు మెరిసినవి. వాళ్ల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆగినవి. వారి తుపాకి బారులు కూడా మెరిసినవి చీకటిలో. దురన్యాయాన్నీ, ప్రకృతి ధర్మంలో లిఖించిన సమన్యాయాన్ని, మానవ న్యాయం విచారించనున్నది

జెట్టి నోరులో నోరుపెట్టి "తమరు" అన్నాడు. కాని ఆస్ట్రియన్ జోడుబార్ల తుపాకి కదిలిపోతున్నది. చీకటిలో యువరాజా ముచ్చెమటల బిందువులు ముఖంమీద తళతళలాడుతున్నవి. జెట్టి మోచేతితో పొడిచి "ఊఁ" అన్నాడు.

మంచెనంతా కదిలిస్తూ మెఱుపు మెరిసి "ఢాం" అన్నది. కాని అది మెకానికి తగలలేదు. వణకుతున్న చేతులు గురితప్పి నీటిలోకి గుళ్లు విడిచినవి. ఇక నిశ్శబ్దం లేదు నియంత నాందీవాక్యంవలె భయంకరమైన గాండ్రు వినిపించింది అష్ట ప్రజాపతుల యజ్ఞశాలలోని వాయిద్య గోష్టివలె నలు మూలలనుండీ డప్పులు పిక్కటిల్లినవి

చిఱుత పిరుదులు తిప్పి మంచెకు సూటిగా చూసింది అక్కడే నరుడివాసన. గాండ్రించి ఒక్క దూకు దూకింది. యువరాజా ఒక్క క్షణం నిలవలేదు. తుపాకి వదిలివేసి మంచెనుండి వెనుకభాగానికి ఒక్క ఉడాయింపు దూకు దూకాడు.

జెట్టి ఊపిరి పీల్చుకోలేదు.

"ఢాం"

మువ్వన్నెల మెకం మూడు చుట్లు తిరిగింది. జెట్టి రెల్లుదుబ్బుల్లో గుచ్చిన బల్లెం తీసి ఒక్క గిరవాటు వేశాడు. అది మెకానికి భూమికీ ఇరుసుగా గుచ్చుకున్నది. అంతా నిశ్శబ్దం. తప్పెటలు ఆగిపోయినవి.

పెద్ద జెట్టి ఊపిరి పీల్చుకొని మంచె వెనుకకు చూశాడు. దూరం పోలేక పరుగిడుతున్న చిన్నదొర తెల్లచొక్కా కనిపించింది. నరశింహులు తుపాకి లంకించుకొని రెల్లు తలలమీదుగా గురిచూశాడు. దూరపు ప్రతిధ్వనికి వణికి తలలు వంచింది. ఢాం... ఢాం... ఢాం ... తెల్లచొక్కామీద నీడ కనిపించింది. భూమి కొరిగిపోయింది.

జెట్టి మంచె దిగి చచ్చిన చిఱుత పక్కన ఒక క్షణం కూర్చున్నాడు. దాని డొక్కలోని బల్లెం లాగి దొరువులోకి విసిరివేశాడు. యానాదులంతా కార్లవద్దకు పలాయనం చేశారు.

ఆ తెల్లవారుజామునగాని పెద్ద పోలీసు బందోబస్తు అతన్ని చుట్టుముట్టలేదు. అతడు చిన్నదొర శవం పక్కనే కూచొని వున్నాడు.

లాంతరు వెలుతురులో అతడు పోలీసులను తన ముఖం చూడనిచ్చి చేతులు ముందుకు చాచి అన్నాడు—

"నాపేరు నరశింహులు. నేనే చంపింది. అరెష్టు చెయ్యండి."

## 4

పెద్ద జెట్టిని ఉరితీస్తారు.

కాని ఆ వుదయం అతనివద్దకు కొడుకును తీసుకొచ్చారు. అతను వూపిరితిత్తుల నుండి దగ్గటంలేదు - అప్పుడు.

కొడుకు తండ్రి పాదాలు తాకి—

"నాన్నా. నువ్వు జెట్టివి. జగజెట్టివి. నేను నీ కొడుకును. ఆ రోజు నేను నిన్నన్నమాటలు మర్చిపో నాన్నా!" అన్నాడు. ★

# కడుపున్న కుదురు

చెల్లెలు పెళ్ళిరా అబ్బాయీ. వీలయినంత త్వరగా సెలవు తీసుకొని కనీసం పదిరోజులయినా ముందుగా రా అని ఉత్తరం రాస్తే ఇంకా కొన్ని గంటలలో పెళ్ళివారు విడిదిలో దిగుతున్నారనగా కూడా పెద్దకొడుకు సత్యం అంతు లేకపోవడంవల్ల గుమాస్తా రామయ్యగారికి ఒకచెంప కోపమూ మరొకచెంప అవమానమూ ఎక్కువయాయి.

పోనీ సత్యం చేసే ఉద్యోగం తీరికలేని ఉద్యోగమా అంటే అటువంటిదేమీ కాదు. రోజుకు అయిదు గంటల చొప్పున అయిదు రోజులు పనిచేసి వారానికి రెండు రోజులు దర్జాగా సెలవు అనుభవించే పంతు లుద్యోగం!

బడిపంతు లుద్యోగమంటే గుమాస్తా రామయ్యగారికి అరికాలిమంట నెత్తికెక్కుతుంది. అయినా సత్యం ఆ వుద్యోగమే చేస్తున్నాడు. స్కూల్ ఫైనల్ రెండో సంవత్సరం పాసయి రెండేళ్లు ఖాళీగా వున్నాడు. కొన్నాళ్లు టైపురైటింగూ షార్టుహాండూ నేర్చుకొన్నాడు. ఆతరవాత అవి మానివేసి సంస్కృతం చదివాడు. తెలుగు విద్వాన్‌లో ఒక భాగం పాసయాడు కూడా. ఇంకా నయం. ఆ విద్వానంతా పాసయి తెలుగు పండితుడయాడు కాదు. తెలుగు పండితులన్నా శాస్త్రార్థం చేసే తార్కికులన్నా రామయ్యగారికి చాలా అగౌరవం. బతకలేక బడిపంతులు ఉద్యోగం చేయడమయితే చావలేక తెలుగు పండితుడుద్యోగం చేయడమని రామయ్యగారి అభిప్రాయం. అంతమాత్రాన తెలుగు పాండిత్యమంటే రామయ్యగారికి గిట్టనే గిట్టదనుకు నేరు!

ఆయన పెద్దన్నగారు సుప్రసిద్ధ పండితుడు. రెండవ అన్నగారు సంస్కృతంలోనూ తెలుగులోనూ కూడా పెద్ద కవి. అందాకా ఎందుకూ రామయ్యగారు స్కూల్ ఫైనల్ వరకూ సంస్కృతం చదివాడు. అయినా ఆయనకు తెలుగు పండితులంటే గౌరవంలేదు. వాళ్లందరూ తమ మతమే సరయిన మతమనే దృష్టితో వ్యవహరిస్తారనీ ఎదుటివాళ్ల వాదనలోని తర్కాన్ని అర్థంచేసుకొనడానికి ప్రయత్నించరని గుమాస్తా రామయ్యగారి స్వానుభవం. ఒకసారి ఏదో చిన్న విషయం గురించి అభిప్రాయభేదం రాగా తన రెండవ అన్నగారు తింటూ తింటూన్న విస్తరి వదిలిపెట్టి వెళ్లిపోయాడు. పోనీ ఆ విషయం అటువంటిది. ఆయనకు అంత కోపం వచ్చింది కనుక అలా చేశాడని రామయ్యగారు సరిపెట్టుకొందామనుకొన్నాడు కాని, నలభయి యకరాల సుక్షేత్రమైన మాగాణి పొలం యాభయి వేల రూపాయల రొక్కమూవున్న తమ సమష్టి కుటుంబం అంటే రామయ్యగారి అన్నదమ్ములు నలుగురూ కలిసి ఉండలేకపోయారు. తండ్రి బతికిఉండగానే ఆస్తి పంచుకొని ఎవరి పొయ్యి వాళ్లు పెట్టుకొనవలసిన పరిస్థితికి రావడానికి కారణం అన్నలేనని గుమాస్తా రామయ్యగారి అభిప్రాయం. కనుకనే పెద్దకొడుకు సత్యం సంస్కృతం చదువంటే ఆయనకు గిట్టలేదు. బడిపంతు లుద్యోగమన్నా గిట్టదు

ఏ. యస్. అవధాని

కాని, తాను ఏం చేస్తాడూ? వాడు ఖాళీగా ఉన్నప్పుడు ఏమీ ఉద్యోగం చూపించలేకపోయాడు. పైగా సంసార భారం ఎక్కువకావడంవల్ల స్థిరాస్తిమీద చెప్పుకో తగ్గంత ఆదాయం రాకపోవడంవల్ల ఇంట్లో అందరిమీదా రామయ్యగారు విసుక్కున్న మాట నిజమే. ఇంట్లోకి ఏమన్నా తీసుకు రావాలంటే ఇంట్లోవాళ్ళని ఏడిపించి ఏడు చెరువుల నీళ్ళు తాగించిన మాటకూడా నిజమే. అటువంటి రోజులలో సత్యం ట్రెయినింగుకు వెళ్ళాడు. వెళ్ళవద్దని ఖచ్చితంగా రామయ్యగారు చెప్పలేకపోయాడు. పైగా నెలకు ఎనిమిదిరూపాయల చొప్పున ట్రెయినింగు చదువుతున్న సత్యానికి పంపించాడు. అట్లా పంపించడానికిగాను ఆయన అనేక అవస్థలు పడవలసి వచ్చింది. ట్రెయినింగు చదివే రోజులలో సత్యానికి ఆయన తాను ఎదుర్కొంటున్న ఇబ్బందులన్నీ తెలుపుతూ ఉత్తరాలు రాసేవాడు.

పోనీ సత్యం చెడ్డవాడా అంటే రామయ్యగారికి అట్లాగూ తోచదు. చిన్నప్పటినుంచీ తనను చూస్తే భయం. సంతానంలో కల్లా పెద్దవాడు కావటంవల్ల ఇంట్లో తల్లికి చేదోడు వాదోడుగా వుండేవాడు. పిల్లలకు నీళ్ళుపోయడం తల్లి మూడు రోజులూ బయట ఉంటే ఇంట్లో అందరికీ అన్నం వండడంతో సహా అన్నిపనులూ చేసేవాడు. తల్లికి నల్లపాండువ వచ్చి ఏడాదిపాటు మంచంలో నుంచి కదలలేకపోతే మలమూత్రాదులు ఎత్తిపోయడంతో సహా అన్నిపనులూ చేశాడు. అందాకా యెందుకూ తనకు జబ్బుచేసినప్పుడు సత్యం ఎంత చాకిరీచేశాడు! ఈ పెండ్లికి పూర్వం అంటే కిందటేడు సరిగ్గా ఇదేరోజులలో రెండవకూతురు బాలింత చావుచస్తే సత్యం వచ్చేవరకూ శవం లేవడానికి వీలయిందా? అటువంటి సత్యమంటే గుమాస్తా రామయ్యగారికి కోపమని ఎవరు అంటారు?? ఇటువంటి సత్యానికి తండ్రి అంటే భయభక్తులూ గౌరవవాత్సల్యాలూ లేవని ఎవరనగలరూ?

రేపుప్రొద్దున లగ్నం జరుగుతుందనగా ఆ రాత్రి సత్యం వచ్చాడు. వచ్చినప్పటినుంచీ అన్నిపనులూ సత్యమే చేశాడు. అప్పటికి వాడి భార్య సరళ ప్రసవించి ఇరవయిరోజులు. కనుక సరళ పెళ్ళికి రాలేదు. రామయ్యగారికి సరళ రాలేదన్న విచారంలేదు. ఆయనకు కావలసింది సత్యమే. సత్యం తన రక్తంలో రక్తం. కష్టసుఖాలలో తనకు అండదండగా నిలిచాడు పెద్దకొడుకు సత్యం.

లగ్నమయింది. ఒకరోజు పెళ్ళి. ఈ రోజులలో అయిదురోజుల పెండ్లి ఎవరు చేస్తున్నారు కనుక!!

లగ్నమయి అంపకాలు తప్ప మిగతా వివాహతంతు అంతా అయిపోయిన తరువాత, ఆనాటి సాయంకాలం పెండ్లిపెద్దలందరూ తీరిగ్గా కూర్చొనుండగా సత్యం ఇంత ఆలస్యంగా ఎందుకు వచ్చాడన్న విషయం గురించి పంచాయతీ ప్రారంభమయింది.

“అసలు చిట్టిపెళ్లికి రానని ప్రసాదుతో అన్నావుటగా” అన్నాడు రామయ్యగారు.

“అవును అన్నాను” అన్నాడు సత్యం.

“ఏం? ఎందుకన్నావ్” అన్నాడు సత్యం పెద్దతమ్ముడు.

“నువుఉండరా...మరి చిట్టిపెళ్లి చేస్తే

గాని ఈ యింట్లో అన్నం తినని భాస్కరంతో అన్నావుటగా" అన్నాడు రామయ్యగారు.

"ఆఁ అన్నాను." అన్నాడు సత్యం.

"అబ్బాయీ నీ పద్ధతి వీళ్ళకు గిట్టడం లేదు" అన్నాడు రామయ్యగారి చివరి అన్నగారు.

సత్యం మాట్లాడలేదు. మాట్లాడేందుకు ఏమి ఉన్నదిందులో????

రామయ్యగారు కొంచెంసేపు పెద్ద కొడుకు ముఖంలోకి చూచాడు. ఆ ముఖంలో దేనికోసమో ఆయన వెతికాడు. ఆఖరికి అన్నాడు గదా "అసలు రానే రావేమో అనుకొన్నాను. మీ మామయ్య నీకోసం వస్తానన్నాడు. ఇక రావని రూఢి చేసుకొని బయలుదేరబోతుండగా వచ్చావ్. మీ అమ్మ ఇంటినబడి రాగాలు ప్రారంభించింది. ఇదంతా ఏమిటి?" అన్నాడు రామయ్యగారు.

నిజమే ఇదంతా ఏమిటి అనిపించింది సత్యానికి కూడా. పెళ్ళిచేసుకోవలసింది చిట్టి. చేసేవాళ్లు ఉండనే ఉన్నారు. చూచి ఆనందించడానికి కావలసినంతమంది వచ్చారు. తను రాకపోవడాన్ని గురించి ఇంత ఆందోళన దేనికో?? తను పెద్ద కొడుకు. తన రాకవల్ల, శుభకార్యంలో తాను పాల్గొనటంవల్ల తల్లిదండ్రుల హృదయాలు సంతోషిస్తవని సత్యానికి తెలియని విషయంకాదు. అయినా ఇదంతా ఏమిటి అనిపించింది సత్యానికి!

"చిన్నన్నయ్య నీకోసం బెజవాడ వెళ్ళి వచ్చాడు తెలుసా" అన్నాడు మూడో వాడు అంటే సత్యం రెండవ తమ్ముడు.

సత్యం వాడివంక జాలిగా చూస్తూ "అల్లాగా తెలియదు" అన్నాడు.

"వదిన చెప్పలేదా?" అన్నాడు చిన్నవాడు.

"చెప్పలేదు." అన్నాడు సత్యం విసుగ్గా.

"అంత విసుగు దేనికి? నీకు వ్యక్తిత్వం ఉంటే మాకూ ఉన్నది. నీకోసం వచ్చిన వాళ్లను అంత అమర్యాద చేయటం బాగా లేదు" అన్నాడు మూడోవాడు.

రామయ్యగారు సత్యంకేసి ఆదుర్దాగా చూస్తున్నాడు. కథ పాకంలో పడుతున్నదని పెండ్లికి వచ్చిన పెద్దలందరూ అక్కడికి వచ్చేశారు.

"ఎవరు ఎవరిని అవమానించారు?" అన్నాడు సత్యం.

"అది సరేకాని, బాబు భారసాల అని నాన్నకు ఎందుకు రాయలేదు నువ్వు. నువ్వేమో భారసాల అని రాయకపోతివి. ఆయనేమో ఊరికే నూనెలో ముఖం చూచుకుంటారు కాబోలునని వట్టిచేతులతో అక్కడికి పోచ్చాడు. తీరా మీ ఇద్దరూ పీటల మీద కూచుంటే మీకు ఏమీ ఇవ్వకపోతే ఆయనకు ఎంత బాధగా ఉంటుందీ?"

సత్యం మాట్లాడలేదు? ఏమి మాట్లాడుతాడు? కోపం ఎక్కువయింది. నిర్లక్ష్యం కూడా జాస్తి అయింది.

"ఏమిట్రా పెద్దవాడా అన్నింటికీ అట్లా బెల్లంకొట్టిన రాయల్లే చూస్తూ ఊరుకుంటావేం?" అన్నాడు సత్యం మేనమామ మూర్తి.

"ఏం చెయ్యమంటావ్ మరి" అన్నాడు సత్యం.

"పెండ్లికి రావని ఎందుకు అనవలసి వచ్చింది? భారసాల చేస్తున్నానని ముసలాయనకు ఉత్తరం ఎందుకు రాయలేదు?" అన్నాడు మూర్తి.

సత్యం విన్నాడు. రామయ్యగారు వాడి ముఖంలోకి చూచాడు దేనికోసమో ఆ ముఖంలో వెతికాడు. కాని, సత్యం జవాబు చెప్పలేదు. ఏమి చెబుతాడు కనుక !!

"అదంతా అట్లావుంచు. నువ్వు ఎక్కడున్నావో చెప్పమంటే వదిన ఎందుకు చెప్పలేదూ?" అన్నాడు సత్యం పెద్ద తమ్ముడు.

"నేను ఎక్కడ ఉంటాను? ఉద్యోగం వదిలి దేశాంతరం ఇంకా వెళ్లలేదుగా" అన్నాడు సత్యం.

"అదేమిటి? అడిగినదానికి సమాధానం చెప్పకుండా డొంకతిరుగుడుగా మాట్లాడతావేం?" అన్నాడు ఆఖరివాడు భాస్కరం.

"ప్రసాదు ఉన్నాడా? ఉంటే ఇటు పిలుచుకురా" అన్నాడు సత్యం భాస్కరం వంక చూచి. భాస్కరానికి సత్యమంటే భయం. కనుక వాడులేచి వెళుతూండగా "ఇప్పుడు వాడుకూడా ఎందుకులే" అన్నాడు రామయ్యగారు.

"సరిపోయిందా? ఇక నేను నాన్నకు రాసిన లెటర్ ఎక్కడున్నదో తీసుకురా" అన్నాడు సత్యం మళ్ళీ.

"ఇప్పుడు అది ఎక్కడున్నదో ఎవరు వెతుకుతారు" అన్నాడు రామయ్యగారు సంతృప్తిగా సత్యం ముఖంలోకి చూస్తూ.

"అయిందా? నాకు టైమయింది. రేపు సెలవులేదు. వెళతా మరి. భాస్కరం నా సంచీ తీసుకువస్తావా?" అన్నాడు సత్యం.

"అదేమిట్రా అప్పుడే వెళతానంటావ్? రాత్రికి చిట్టెని అత్తవారింటికి పంపించవద్దూ మరి." అన్నాడు మూర్తి.

"పంపించడానికి పెద్దలందరూ మీరున్నారుగా. నాకు రేపు బడిఉన్నది. ఇవాళ ఒక్కరోజే సెలవు ఇచ్చారు. అవసరమయినప్పుడు రాకుండా ఉండను. కాని, మిమ్మల్ని సంతోషపెట్టడానికి మాత్రం రాలేను." అంటూ సత్యం భాస్కరం తెచ్చిన సంచీ పట్టుకొని బయలుదేరాడు.

## 2

"కాఫీపొడి అయిపోయింది" అన్నది సరళ.

"తెస్తాను." అన్నాడు సత్యం ఏదో పుస్తకం చదువుతూ.

"బియ్యం ఇవాల్టికి వస్తయి."



# కదుల్తున్న కుదురు



"అట్లాగా కుటుంబయ్యగారింటికి ఖబురు చెయ్యకపోయావా?"

"ఏమని ఖబురుచేసేది? ఇప్పటికే వాళ్లకు మూడ్రూపాయిలదాకా ఇవ్వాలి."

"మూడ్రూపాయలా? ఏ నెల డబ్బు ఆ నెల ఇస్తునే ఉన్నాంగా? ఇంత అప్పు ఎందుకయిందీ?"

"కిందటి నెలలో పది బాకీపెట్టారా. ఆ కిందటినెల పది బాకీపెట్టారా. పదిరోజులనాడు పదిరూపాయల బియ్యం తెచ్చావా?"

"ఏం లేవడమో యేమిటో" "అందుకే ఈ గొడవంతా నాకు వద్దు. అదంతా మీరే చూడండి. తీసుకువస్తే వండుతాను. లేకపోతే లేదు."

సత్యం చదివే పుస్తకం టేబుల్ మీద పడేసి "ఇప్పుడేం చెయ్యమంటావ్?" అన్నాడు సరళవంక కోపంగా చూస్తూ.

"బియ్యం అయిపోయాయన్నాను. నేను మిమ్మల్ని ఏమీ చెయ్యమనలేదు" అన్నది సరళ.

"ఇవాళ ఇంకా పదో తేదీయే గదా. ఇంతలో డబ్బు ఎక్కడినుంచి వస్తుందీ?" అన్నాడు సత్యం.

"నేను మిమ్మల్ని డబ్బు అడగలేదు. పిల్లలకూ నాకూ నగలు చేయించమని గొడవ పెట్టలేదు. బియ్యం అయిపోయాయన్నాను. డబ్బు ఎక్కడినుంచి వస్తుందీ అంటే నేనేం చెప్పేది?"

"అవును నువ్వేం చెపుతావ్? అవి అయిపోయాయి ఇవి అయిపోయాయంటావ్?" అన్నాడు సత్యం కోపంగా.

"అంత బిగ్గరగా అరుచుకుంటారు దేనికి?"

"అవును నువ్వన్నది బాగానే ఉన్నది. నేను మళ్ళీ సమాధానం చెపితే అరుచుకోట మవుతుంది."

"బియ్యపురేకుకు కట్టవ డబ్బు పంపించమని మా అన్నయ్య ఉత్తరం రాశాడు. నా వంట్లో ఏమీ బాగుండడంలేదు. డాక్టరుకు ఎప్పుడు చూపిద్దాం" అన్నది సరళ.

సత్యం మాట్లాడలేదు. మాట్లాడేందుకు ఇందులో యేమున్నది కనుక. కోపం తగ్గింది. సరళవంక చూశాడు. సరళ చెప్పినదంతా నిజం. ఇంట్లో బియ్యం అయిపోవస్తున్నవని తనకు తెలుసు. బాబు పుట్టిన తరువాత సరళ ఆరోగ్యం నానాటికీ క్షీణించిపోతున్నదని కూడా సత్యానికి తెలుసు. బియ్యం, కాఫీపొడి మొదలయినవి కొనడానికి డబ్బు కావాలి. వంద రూపాయల జీతం వచ్చి ఇంకా పదిరోజులు కాలేదు. డబ్బుంటేనేగాని ఇవన్నీ పరిష్కారం కావు. కాని, డబ్బేదీ? డబ్బు ఎట్లా సంపాదించాలి? సంపాదించిన డబ్బు చాలకపోయె నే? కనుక సరళవంక చూస్తున్న సత్యానికి దిగులు వేసింది. దిగులుకాదు భయం పుట్టుకొచ్చింది. అయోమయంగా మళ్ళీ సరళవంక చూచాడు. సరళ వంట ఇంట్లోకి వెళ్ళింది.

సత్యం ఆలోచిస్తున్నాడు. ఏమి ఆలోచన లవి? ఆలోచించడానికి ఏమి ఉన్నది ఇందులో? డబ్బు కావాలనే విషయం గురించి ఆలోచించ నక్కరలేదు. బాకీలు తీర్చాలనే విషయం ఆలోచించ నవసరం లేదుగదా? మరి దేన్ని గురించి ఆలోచించాలి? డబ్బు గురించి ఆలోచించాలి. కాదు - డబ్బు సంపాదించడం ఎట్లాగో ఆలోచించాలి. అంతలో మళ్ళీ సరళ వచ్చింది. చిరునవ్వుతో సత్యం అన్నాడుగదా. "సరళా...ఏం చెయ్యమంటావ్ చెప్పు. చూస్తున్నావుగదా? కాఫీ మానేశాను. రెండుజతల గుడ్డలతో రోజులు నెట్టుకువస్తున్నాను. సంపాదన చాలటంలేదు. మరి నువ్వుకూడా నన్ను రాపాడితే ఏంచెయ్యను చెప్పు"

"అవునవును అనండి. రాపాడుతున్నాను. కనీసావసరాలకు కావాలని అడగటంకూడా రాపాడడమే. పిల్లల గుడ్డలు పేలికలయాయి. రెండు చీరలతో మెళ్లోమంగళ సూత్రంతో..."

"అవును. నువ్వు చెప్పేదంతా నిజమే. నన్నేం చెయ్యమంటావ్ చెప్పు."

"చేసినవన్నీ నేను చెయ్యమంటేనే చేశారా? దేనికయినా చేసుకు పుట్టాలంటారు. ఈ యేడు కూడా వాళ్లు ఏమీ ఇవ్వనన్లేనా?"

"ఉత్తరం రాశాను."

"ఉత్తరం అయిదేండ్లనుంచీ రాస్తునే ఉన్నారు."

"అయితే వాళ్లు ఎప్పుడూ యేమీ ఇవ్వలేదంటావా?"

"ఇచ్చారు లెక్కురూ ఇప్పుడు పది అప్పుడు పాతికానూ? మిగతావాళ్లందరికీ అన్ని ముద్దుముచ్చటలూ జరిపినవాళ్లకు నా దగ్గరికి వచ్చేటప్పటికి చేతులురావు కాబోలు. ఇంతకూ నా రాత. ఒకళ్లనని ప్రయోజనం ఏమిటి?"

అంతలో ఎవరో స్నేహితుడు రావడం వల్ల సత్యం బయటికి వెళ్ళాడు.

## 3

"ఈ యేడయినా పెద్దన్నయ్యకు ఏమీ పంపించవా" అన్నాడు ఆఖరివాడు భాస్కరం గుమాస్తా రామయ్యతో.

"ఏం పెద్దన్నయ్య సంగతి నీ కెందుకూ" అన్నాడు మూడోవాడు.

"ఎందుకా? ఎనిమిదేండ్లనుంచీ చూస్తున్నాను. వాడు రానంతవరకూ రాలేదు రాలేదు అని గోలచేస్తారు. వస్తే ఎప్పుడు వెళతాడా అన్నట్లు చూస్తారు. ఈ యేడు పంట డబ్బులో మీ అందరూ తలా కాస్త తీసుకున్నారుగా పెద్దన్నయ్యకు కూడా కొంచెం పంపించండి" అన్నాడు భాస్కరం.

గుమాస్తా రామయ్యగారు భాస్కరం వంక కన్ను ఆర్పకుండా చూడటమే తప్ప ఏమీ మాట్లాడలేదు. భాస్కరం చెప్పింది నిజమే. ఏదో ఒకటిరెండుసార్లు తప్ప సత్యానికి తాను ఏమీ ఇవ్వలేదు. వాడంతట వాడు కష్టపడి ఉద్యోగం చేస్తూ బియ్యే పాసయాడు. ముగ్గురు పిల్లలనీ రోగిష్టి పెళ్లాన్నీ పోషిస్తున్నాడు. సమిష్టి కుటుంబంవల్ల పొందవలసినంత ప్రయోజనం సత్యం అనుభవించలేదు. మామూలు రోజులలో ఎటూ తాను సత్యానికి డబ్బు ఇవ్వలేదు. కనుక పంటరోజులలో నయినా కొంచెం పంపించడం న్యాయమే. కాని, డబ్బు ఏదీ? అప్పులన్నీ తీర్చితే మిగిలేదేమిటి? అవన్నీ అట్లా ఉంచు. డబ్బు కావలసినవాడు సత్యం స్వయంగా ఎందుకురాడూ? ఉత్తరం రాయడం ఏమిటీ? ఇప్పటికి నాలుగేండ్లయింది కదా ఇంటికివచ్చి. ఎంత మద్రాసయితే మాత్రం ఆరునెలలకొకసారి కాకపోయినా ఏడాదికొకసారయినా కనీసం ఈ డబ్బుకోసమయినా ఇంటికి రారాదా? అంత ముఖం చూపించరాని తప్పు తనేమి చేశాడు అనుకొంటున్నాడు రామయ్యగారు.

"ఇట్లాగే మీనమేషాలు లెక్కపెడ్తూ ఆ వచ్చింది కాస్తా ఖర్చుచేస్తారు. ఆ తరువాత పంపించడానికి డబ్బు ఏదీ అంటారు. చిన్నన్నయ్యకి రెండు వందలు ఇచ్చారు గదా? పెద్దన్నయ్యకు నాలుగేండ్లనుంచీ దమ్మిడీ ఇవ్వలేదుగదా ఈయేడు వంద రూపాయలు ఎందుకు పంపించరాదూ?" అన్నాడు భాస్కరం మళ్ళీ తండ్రివంక కోపంగా చూస్తూ.

"మరి ఈ అప్పు లెవరుతీరుస్తారూ?" అన్నాడు మూడోవాడు.

"ఈ అప్పులు చిన్నన్నయ్యకు డబ్బు ఇచ్చేటప్పుడు అడ్డంరాలేదా" అన్నాడు భాస్కరం.

"అది వేరేసంగతి. చిన్నన్నయ్య సమిష్టి కుటుంబానికి చాలా డబ్బు ఇచ్చాడు

తెలుసా? చిన్నవదినె ఇంట్లో ఉండి అందరికీ చాకిరీ చేసింది." అన్నాడు మూడవవాడు.

"మీరు పెద్దన్నయ్యను ఇంటికి రానిచ్చారా అసలు? జబ్బుతో వాడు ఇంటికి వస్తే ఈ కొంపలో వాడిమీద విసుక్కోని వాళ్లెవరో చెప్పండి. పైగా అంత జబ్బులో పోయి పెళ్ళాన్ని తీసుకురమ్మన్నారు. తీసుకొచ్చిన తరువాత అనవసరమయిన అల్లరంతా చేశారు. ఇంకా పైగా ఏమిటో చెప్పాస్తారేమిటి?"

భాస్కరం చెపుతున్నదంతా నిజమనిపించింది రామయ్యగారికి

"వాడికి డబ్బు పంపిస్తే నీ చదువుమాట ఏమిటి? నీ పెళ్ళిసంగతేమిటు?" అన్నాడు రామయ్యగారు.

"నా సంగతి నాకు వదిలివెయ్యండి. పెద్దన్నయ్యకు డబ్బు పంపించండి."

"అదికాదురా బాచీ. డబ్బుకావలసినవాడు వాడే ఎందుకురాలేదూ?" అన్నాడు రామయ్యగారు.

"పైగా అదొక దండగ. మద్రాసునుంచి ఇక్కడికి రావటం, డబ్బంతా ఖర్చయిందని మీరు చెప్పటం నీళ్ళు నములుతూ వాడు తిరిగి వెళ్లడం ఎందుకొచ్చిన గోల ఇది. ఎవరికి వచ్చేది వాళ్లకు ఇచ్చివెయ్యరాదూ? ఎటూ పెద్దవాళ్ళిద్దరూ విడిగానే ఉంటున్నారుగా" అన్నాడు భాస్కరం.

"అంటేందయ్యా అన్నగారి మతం. ఆయనో పెద్ద విప్లవవాది. మళ్లీ ఈయనగారూ అదే దోవలో తయారవుతున్నాడు" అన్నాడు రామయ్యగారు.

"అదంతా ఇప్పుడెందుకులే, ఏదీ వందరూపాయలిటేయ్. పెద్దన్నయ్యకు మనియార్డరు చేసివస్తా" అన్నాడు భాస్కరం.

ఇక్కడెక్కడుందీ డబ్బు" అన్నాడు రామయ్యగారు.

"ఈ కొంపలో ఇదే పెద్ద గోల. దీనివల్ల ఎవరికీ మనశ్శాంతి లేకుండా పోతున్నది" అన్నాడు భాస్కరం.

"ఎవరిచేతనయింది వాళ్లు సంపాదించుకొంటున్నారుగా" అన్నాడు మూడవవాడు.

"అరేయ్. అనవసరంగా మాట్లాడకు. ఒకప్పుడు పెద్దన్నయ్యకు కూడా చిన్నన్నయ్య ఈ శ్రీరంగనీతులే చెప్పాడు. ఆతరువాత చిన్నవదినెమీద మనం ఎన్ని అభాండాలు వేశాం. నిలుచున్నవాణ్ణి నుంచోన్నట్లు వేరే కాపరం ఉండమని చెప్పామా లేదా? పెద్దన్నయ్య డబ్బు ఇవ్వలేదు. అందుకని చెడ్డవాడయాడు. డబ్బు ఇచ్చిన చిన్నన్నయ్య కూడా ఎందుకు చెడ్డవాడయాడూ?" అన్నాడు భాస్కరం.

"ఇదంతా నాకెందుకు చెప్పు." అన్నాడు మూడవవాడు.

"ఇప్పుడు అనవసరమేలే. ఒకనాడు అవసరమవుతయ్. అప్పుడు బాధపడవద్దని ఇప్పుడే చెబుతున్నాను. మీరు పెద్దన్నయ్యకు డబ్బు పంపించలేదు. ఇది గుర్తుంచుకోండి. నేను ఇక ఈయింట్లో మంచినీళ్ళు కూడా తాగను" అంటూ భాస్కరం లేచిపోయాడు.

## 4

"ఇంత జ్వరం వస్తుంటే నాకుఎందుకు రాయలేదు" అన్నది సరళ సత్యానికి కాఫీ అందిస్తూ.

"రాయలేదు. నువ్వు వచ్చి మాత్రం ఏం చేస్తావ్.?" అన్నాడు సత్యం.

"అంత మరీ ఎక్కువగా వుంటే ఓ నెల రోజులు సెలవుపెట్టి బెజవాడ రమ్మన్నాడు మా అన్నయ్య. ఏమంటారూ?"

సత్యం మాట్లాడలేదు. ఏమి మాట్లాడతాడు? మాట్లాడడానికి ఏమున్నదిందులో?

సత్యం తాగిన గ్లాసు తీసుకొని, వస్తున్న కన్నీళ్ళను బయటికి రాకుండా ఆపుకొంటూ సరళ వంటఇంట్లోకి వెళ్ళింది. పిల్లలు అన్నాలు తింటున్నారు. సత్యం కొంచెంసేపు అటూ యిటూ తిరిగి ఆఫీసుకు వెళ్ళడానికి బయలుదేరుతున్నాడు.

అంతలో సరళ వచ్చింది.

"ఇవాళకూడా ఆఫీసుకు వెళ్ళవలసిందేనా?" అన్నది.

"ఇవాళకూడా అంటే." అన్నాడు.

"ఆ చెమటలు చూడండి. అమ్మయ్యో కాళ్లు చల్లగా నీటికుండల్లే ఉన్నయ్. డాక్టరుకెవరికన్నా చూపించండి... నామాట వినండీ"

"సరళా..."

"సరళా...సరళా...సరళ ఏంచేస్తుందీ? ఏం చేయగలుగుతుందీ? నాకోసం కాకపోయినా ఈ పిల్లలముఖం చూచి అయినా డాక్టరుకు చూపించండీ!"

"డాక్టరుకు చూపించాలంటే డబ్బు కావాలి వచ్చేడబ్బు ఈ యింటి అద్దెకూ ఇంట్లో కనీసావసరాలకే చాలటంలేదు. ఇక మందులకుకూడా డబ్బు ఎక్కడినుంచి వస్తుందీ?"

"ఇంతకన్నా ఒకప్పుడు మనసంగతి బాగా ఉన్నది కనుకనా? అట్లా అని రోగం ముదరపెట్టుకుని ఎవరికొంప ఆర్పుదామనుకున్నారూ?? నామాట విని డాక్టరు దగ్గిరికి వెళ్లిరండీ" అని సరళ రుద్ధకంఠంతో. పెట్టెలో నుంచి పదిరూపాయలు తీసి ఇచ్చింది.

"ఎక్కడివీ" అన్నాడు సత్యం.

"నా అన్నయ్య పిల్లలకు ఇచ్చాడు."

"మరి చార్జీలు పంపిస్తేనేగాని రావడానికి వీలుకాదని రాశావ్."

"అవును రాశాను. పిల్లలకు తలా రెండూ ఇవ్వండి. అవి పెట్టుకుని మా యింటికి వెళతాను అని చెప్పడం చేతకాలేదు. అదంతా తరువాత మాట్లాడుదాం. ముందు మీరు డాక్టరు దగ్గరికి వెళ్లిరండి అన్నది సరళ.

వెళ్లకేం చేస్తాడు సత్యం! వెళ్ళినా తరువాత డాక్టరు చెప్పినట్లు పదిరోజులు సెలవు పెట్టక తప్పేదేమున్నది. కొత్తవాడివి. జీతంమీద సెలవు ఇవ్వడానికి వీలులేదని కంపెనీవాళ్లు జీతం నష్టంమీద మాత్రమే సెలవు ఇస్తేమాత్రం చేసేదేమిటి?

## 5

"పెద్దవాడు నీ పెళ్లికి కూడా రాలేదు. చూశావా?" అన్నాడు రామయ్యగారు భాస్కరంతో.

"ఎట్లా వస్తాడూ? ఎల్లుండి పెళ్ళి అని ఇవాళ టెలిగ్రాం ద్వారా డబ్బు పంపిస్తే మాత్రం సెలవు దొరకాలా? అక్కడినుంచి ఇక్కడికి రావటమంటే మాటలా? అయినా వాడు రాకపోయినంత మాత్రాన మనకేం తక్కువయింది కనుక" అన్నాడు భాస్కరం.

"మహా చెబుతున్నావ్ గాని పెళ్ళికి వెళ్ళాలంటే నాలుగు రోజులు సెలవు ఇవ్వకపోయారేం" అన్నాడు రెండవవాడు.

"వాడికి మనమంటే ఇష్టంలేదు. ఇది ఇవాల్టిదా నిన్నటిదా? పదేండ్లనుంచీ విడిగా ఉంటున్నాడు" అన్నాడు మూడవవాడు.

"మంచికిగాని, చెడుకుగాని ఇదివరకు పెద్దన్నయ్యరాని దెప్పుడు చెప్పండి." అన్నాడు భాస్కరం.

"రావడం అనేది ఎవరినో ఉద్ధరించడానికయినట్లు మాట్లాడతావేమిటి? మేమందరం రావడంలేదూ? మంచి చెడులూ, కష్టసుఖాలూ అందరంకలిసి

# ★ కదులుతున్న కుదురు ★

అనుభవించాలి కదా." అన్నాడు రెండవ వాడు.

"వాడు వచ్చి మిమ్మల్ని ఉద్ధరించాడని నేను అనలేదు. కాని, వాడు రాలేదని వాడిమీద నెపమెన్ని, మీ బుర్రలు పాడు చేసుకోవడం ఎందుకూ? ఇక మీ అందరూ వస్తున్నామంటున్నారు. మీ అందరిమాదిరిగానే వాణ్ణీ చూచారా? మంచి చెడులూ కష్టసుఖాలను అందరం కలిసి అనుభవించాలంటున్నారు. వాడికి ఇప్పుడు అయిదుగురు పిల్లలు కదా? ఒక్కనాడయినా అమ్మ వదినె ముఖాన బొట్టుపెట్టి గుడ్డ ముక్క ఇచ్చిందా? వాడి పిల్లలు ఎంత ముద్దు వస్తూంటారూ? వాళ్ళకయినా మనం ఒక్కదమ్మిడీ ఇచ్చామా? అవన్నీ అట్లా ఉంచండి. వాడికి జబ్బుచేసి కొంచెం డబ్బు పంపించమని రాస్తే ఏమన్నాం? ఉద్యోగం పోయింది కొంచెం సహాయం చేయమంటే ఏమన్నాం?" అన్నాడు భాస్కరం.

"అందుకే నువు చాలా జాగ్రత పడుతున్నావ్ గా?" అన్నాడు రెండవవాడు.

"అవును మీ సంసారాలన్నీ చూచిన తరువాతనయినా జాగ్రత పడకపోతే నేను పొర్రి తెలివితక్కువ దద్దమ్మనన్న మాట" అన్నాడు భాస్కరం.

"మరి నామాట? నేను ఇవాళ వెళుతున్నాను. నన్ను ఏలూరు ట్రాన్సుఫర్ చేశారు. నాకు రాజమండ్రిలో మూడువందలదాకా అప్పులున్నాయ్. కనీసం రెండువందలయినా అవసరంగా కావాలి" అన్నాడు రెండవవాడు.

భాస్కరం మాట్లాడలేదు. మూడవ వాడు ఇంటి కప్పువంక చూస్తున్నాడు.

"డబ్బేదిరా? ఇవ్వడానికి" అన్నాడు రామయ్యగారు.

"డబ్బేదంటే నేనేం చెప్పేది? నాకు కావాలి. నా దగ్గరుంటే మీకు ఇవ్వలేదా? ఎక్కడన్నా తెచ్చి ఇవ్వండి. భాస్కరానికి నాలుగువేల రూపాయలు కట్నంగా ఇచ్చారుగా. అందులో కొంచెం ఇవ్వండి" అన్నాడు రెండవవాడు.

"నాలుగువేలు కట్నమిస్తే ఏమిమిగిలింది. వెయ్యిరూపాయలు పిల్లనగలకింద ఇచ్చాం గదా? భాస్కరం వెయ్యిరూపాయలు ముందుగానే తీసుకుని బాంకులో వేసుకున్నాడుగదా? పెండ్లి ఖర్చుకింద మిగతాదంతా ఖర్చయింది." అన్నాడు రామయ్యగారు నిర్లిప్తంగా.

"అయితే నన్నేం చెయ్యమంటావు ఇప్పుడు. ఎక్కడన్నా అప్పుతెచ్చి ఇవ్వండి" అన్నాడు రెండవవాడు.

"ఇక నేను అప్పుచెయ్యను, చెయ్యలేను. రెండునెలల్లో రిటయిరవుతున్నాను. నాకెందుకు వచ్చిన గొడవ?" అన్నాడు రామయ్యగారు.

"అంటే మీకు కోపం వస్తుంది గాని. పిల్లకి నగలకింద అయిదు వందలు ఇస్తే సరిపోకపోయిందా?" అన్నాడు రెండవాడు.

"అది నీకు అనవసం. వాడికి నాలుగు వేలు కట్నం ఇస్తారని మనం అనుకొన్నామా? వాళ్ళు అంత కట్నం ఇచ్చినప్పుడు వెయ్యిరూపాయలయినా నగల కింద ఇవ్వకపోతే బాగుంటుందా?" అన్నాడు మూడవవాడు.

"ఆ బాగుండకపోవటం అనేది ఇవాళనే వచ్చిందేం? మీ చిన్నవదినె నగల సొమ్ముతో సహా నా సంపాదనంతా వాడు కొన్ననాడు ఈ ఆలోచన ఏమయిందేం?" అన్నాడు రెండవవాడు.

రామయ్యగారికి భయం ఎక్కువయింది. రెండవవాడు చెప్పిందంతా నిజమే తాను డబ్బు ఇవ్వలేనిమాటకూడా నిజమే. ఏం చెయ్యాలో తోచక కోపంతో అన్నాడు గదా."

"అనవసరంగా మాట్లాడకు. నువ్వూ నీ పిల్లలూ తక్షణం బయటికి వెళ్ళండి. చేతనయింది చేసుకోండి."

"అట్లాగే వెళతాను. నాకు డబ్బు కావాలి. అనిమాత్రం మరిచిపోకండి" అని రెండవవాడు నుంచున్నవాడు నుంచున్నట్లు పెళ్ళాం బిడ్డలను తీసుకుని రైలుకు వెళ్ళాడు.

## 6

"ఈ రోజయినా వాళ్ళు ఏమన్నా ఇస్తారేమో" అన్నాడు సత్యం బెజవాడలో సరళ అన్నగారి ఇంట్లో.

"వాళ్లెంతట వాళ్లు ఇవ్వరు" అన్నది సరళ.

"అయితే..."

"అయితే గియితే అని పదిహేనేళ్ళనుంచీ నెట్టుకువస్తున్నారు. ఉద్యోగంచేసే టప్పుడే లేనిది ఉద్యోగంనుంచి రిటయిరయిన తరువాత వాళ్ళంతట వాళ్లు మిమ్మల్ని పిలిచి మొహాన బొట్టుపెట్టి డబ్బు ఇస్తారనుకోవటం శుద్ధ పొరపాటు. చేయగలిగితే ఏమన్నా చేసుకోవాలి. లేకపోతే లేదు" అన్నది సరళ భోజనాల దగ్గర.

"కంకిపాడు వెళ్ళివస్తాను" అన్నాడు సత్యం.

"వెళ్ళి ఏం చేస్తారూ?" అన్నది సరళ

"ఏదో చేస్తాను. చూస్తూవుండు" అన్నాడు సత్యం.

"చూస్తూవుండక నేను చేసిందేమున్నది లెండి. ఆయనకూడా ఇవాళనే కంకిపాడు

వెళ్ళారట. అనవసరంగా ఆయనతో తగాదా పడవద్దు." అన్నది సరళ.

"తగాదా పడకపోతే మనకు రావలసింది రాదన్నావుగా మరి."

"నేను అనటం ఏమిటి? తగాదా పడమన్నానా మీతో మానివెయ్యండి. మీరు కంకిపాడు వెళ్ళవద్దు. పైగా ఇదంతా నేను చేయించానని వాళ్లు తిడుతున్నారు."

భోజనాలయినతరువాత బెజవాడనుంచి సత్యం బస్సులో కంకిపాడు బయలుదేరాడు. నాన్నను చూచి పదిహేనేళ్ళయింది. అందరూ కలిసి కూర్చుని చీట్లాడి ఇరవయ్యేండ్లయింది. ఈ జీవితంలో ఎన్ని మార్పులో? ఎన్ని బాధలో? ఇప్పుడు తనకు అయిదుగురు పిల్లలు - పెద్దది ఆడపిల్ల స్కూలు ఫైనల్ చదువుతున్నది. రెండవవాడు అయిదవ ఫారం చదువుతున్నాడు. వాళ్ళకు పెళ్లి చెయ్యాలి ఉద్యోగందొరికే చదువు చెప్పించాలి. తన వొంట్లో ఓపిక తగ్గుతున్నది. నాన్న రిటయిరయినాడు. ఫించను వస్తున్నది మూడవ వాడిదగ్గర ఉంటున్నారు డబ్బు చాలుతున్నదో లేదో. ఎంత అవస్థపడుతున్నారో. భాస్కరం భార్య ఇంకా కాపురానికి రాలేదు. అయినా వాడు విడిగా ఉంటున్నాడు. ఏదో ఉద్యోగం చేస్తూ చదువుకున్నాడు. తన తరువాతి వాడికి నలుగురు పిల్లలు. తాలూకాఫీసు గుమాస్తా ఉద్యోగం. ఆ జీతం రాళ్ళు ఏమూలకు?? కంకిపాడులో వున్న నాలుగు ఎకరాలూ అందరూ తలా కొన్సా పంచుకుంటే ఎంతవస్తుంది! ఈ కొస్త భాగ్యానికి ఎన్ని మనస్తాపాలు పెంచుకున్నారు? ఏమయినాసరే ఇదేదో తేల్చివెయ్యాలనుకుంటూ సత్యం బస్సుదిగి పొలం చేసే రైతు ఇంటికి వెళ్ళాడు

రైతు ఇంట్లో లేడు పొలం వెళ్ళాడు. రైతు బావమరది సత్యాన్ని పొలందగ్గిరికి తీసుకువెళుతూండగా దోవలో రైతు ఎదురయాడు. రైతు వెనుక గుమాస్తా రామయ్యగారున్నారు రామయ్యగారు సత్యాన్ని పలకరించలేదు. సత్యం ముఖంలోకి చూడలేదు సత్యం రామయ్యగారి వంక ఆశగా చూశాడు రామయ్యగారు ముఖం అటు తిప్పుకున్నాడు.

"ఏం కోటయ్యా మహసూలయాయా" అన్నాడు సత్యం.

"అయినయ్యండి. కిస్తీ నన్ను కట్టమన్నారు మీ నాన్నగారు" అన్నాడు కోటయ్య

"గింజలు అమ్మావా?" అన్నాడు సత్యం.

"ఆ అమ్మాను. మీ నాన్నగారు అమ్మమన్నారు. పుట్టి 170 రూపాయలకాడికి అమ్మాను."

"మరి నాకు రెండువందలు కావాలి."

"మీ నాన్నగారుండారుగా అడగండి. ఇవ్వమంటే ఇస్తాను."

"ఆయన ఇవ్వొద్దంటే ఇవ్వవా?" అన్నాడు సత్యం.

"ఇవ్వద్దని ఎందుకంటారూ?"

"అంటారో అనరో అది వేరేసంగతి రెండు వందల రూపాయలు ఇస్తావా? ఇవ్వవా? ఈ యేడే కాదు, వచ్చే యేటినుంచీ మొత్తం అయిదు వాటాలుచేసి నా వాటా నాకు డబ్బు పంపిస్తావా? పంపించడానికి నీకు వీలులేకపోతే నేను పొలం ఇంకొకరికి ఇచ్చుకోవలసి వస్తుంది" అన్నాడు సత్యం.

"ఇద్దరూ ఈడే ఉండారుగా అనుకోనేదేదో మీ యిద్దరూ అనుకుంటే నా చిక్కు తీరుద్దిగా" అన్నాడు కోటయ్య.

"అనుకోటమూ లేదు ఏమీ లేదు. నువ్వు డబ్బు ఇస్తావా? ఇయ్యవా" అన్నాడు సత్యం

"బాబూ ఈనాటివాణ్ణి కాదు. మీ తాతగారి రోజులనుంచీ ఈ గడ్డను నమ్ముకొని ఉన్నాను. ఎంత పొలం? ఎంత పొలం— ఇయాల మీ వాటా నాలుగెకరాలు తప్పితే మిగతాదంతా అందరూ అమ్ముకున్నారు."

"ఇదంతా ఇప్పుడెందుకూ. నాకు అవసరంగా రెండువందలు కావాలి" అన్నాడు సత్యం.

"కావాలంటే పట్టుకుపోదురుగాని. బాబూ నన్నుమాత్రం ఓ కంట కనిపెట్టి ఉండు. ఏం చినబాబుగారూ మాట్లాడరేం? అబ్బాయిగోరికి రెండొవందలు కావాలంట" అన్నాడు కోటయ్య రామయ్యగారివంక చూస్తూ.

"నేను చెప్పేదేమున్నదీ. నేను ఉత్తరం రాసినట్లు చెయ్యి. డబ్బంతా ఇటు ఇవ్వు. నేను వెళ్లాలి. బస్సుకు టైమవుతున్నది" అన్నాడు రామయ్యగారు.

"అదేంటి బాబూ అట్లా అంటారూ? పెద్దబ్బాయిగారు డబ్బు కావాలంటుండారు. ఆరికి రెండువందలు ఇస్తాను. మిగితాది మీరు తీసుకెళ్లండి" అన్నాడు కోటయ్య.



# కదుల్తున్న కుదురు



"మరి వాడి వాటాకి రెండు వందలూ ఎట్లా వస్తయ్" అన్నాడు రామయ్యగారు.

"చినబాబూ నేను మీకు చెప్పేవాణ్ణి కాను. నాయనగారి రోజులనుంచీ పాలం చేస్తున్నవాణ్ణి. మిమ్మల్ని ఎత్తుకు తిరిగాను. ఇన్నాళ్ళనుంచీ పెద్దబ్బాయిగారికి ఏమీ ఇయ్యలేదుగా. ఈసారి రెండువందలూ ఇయ్యండి" అన్నాడు కోటయ్య.

"ఏమీ ఇవ్వకుండానే, గాలిలో పెరిగి ఇంతవాడయ్యాడురా వాడు. మహా చెపుతున్నావ్. వాడి చదువుకోసం ఎన్ని తిప్పలు పడ్డానో, వాడు నన్ను ఎన్ని అవస్థలు పెట్టాడో అదంతా ఇప్పుడెందుకులే."

"బాబూ తప్పద్దా? ఎంత చెడ్డా ఆయన మీ పెద్దకొడుకు. మీరు ఆయనను కన్నారు. తప్పేదంలేదు బాబూ. ఆనాడు నలభయి ఎకరాలు పంచుకునేప్పుడు ఎంత గోల పడ్డారో అంత గోలా ఈనాడూ ఎందుకు బాబూ చదువు సంధ్యలు చెప్పిస్తే ఆయనగారు మాత్రం ఏం కాడు చేశాడూ? పట్నంలో పెద ఉద్యోగం చేస్తుండాడు. బెజవాడలో ఎవరినడిగినా సత్యంగారి సంగతి చెప్పతారు."

కోటయ్య ఇంటివద్దరకూడా తండ్రీ కొడుకూ ఒకరినొకరు పలకరించుకోలేదు. సత్యం రెండు వందలరూపాయలూ తీసుకొని బెజవాడ వెళ్ళిపోయాడు. రామయ్యగారు నాలుగువందలూ తీసుకుని గౌతు కోటయ్యనూ సత్యాన్ని తెగతిట్టి కుంటూరు చేరుకున్నారు.

## 7

"భాగ్యమ్మ సంగతి ఏంచేద్దాంరా" అన్నాడు రామయ్యగారు మూడవవాడితో.

"ఇన్నాళ్ళూ ఎట్లా జరిగిందో ఇక ముందూ అట్లాగే జరుగుతుంది" అన్నాడు మూడవవాడు.

"ఎట్లా జరుగుతుందీ? నా పింఛనూ, నీ జీతమూ, ఆ పంటమీద వచ్చేదీ మనందరికీ చాలడంలేదు. దాని మామగారు దానికి ఇచ్చేదేమిటో తేల్చుకొందాం."

"అట్లాగే తేల్చుకుందాం"

"ఏమిటీ తేల్చుకునేది" అంటూ భాస్కరం వచ్చాడు అంతలో.

"అదే భాగ్యమ్మ మామగారు దానికి మరో వర్తి ఇస్తాడో ఇవ్వడో కోర్టులో తేల్చుకుందామనుకుంటున్నాను." అన్నాడు రామయ్యగారు.

"అనవసరంగా కోర్టుకు డబ్బు తగలెయ్యడం దేనికీ? ఆయన ఇస్తే మహా ఎంతఇస్తాడూ?" అన్నాడు భాస్కరం.

"ఎంతయినా కాని. ఎన్నాళ్ళు ఊరుకుంటాం?" అన్నాడు మూడవవాడు.

"ఇదేం ఆలోచనరా బుల్లెన్నయ్యా ఎన్నాళ్ళయినా నీ ఆలోచన మారదేం?" అన్నాడు భాస్కరం

"పోనీ లెద్దూ... నేను మారకపోతే మారకపోయాను. నువ్వు మారావుగా? పెద్దన్నయ్య శిష్యుడి వయావుగా. నన్ను ఇట్లాగే ఉండనియ్" అన్నాడు మూడవవాడు.

"ఉండనియ్యక నేనేం చెయ్యగలనులే. కాని, అనవసరంగా ఎవరికో శిష్యుడివయావ్ అని పదిసార్లు అని నన్ను అవమానించలేవు. న్యాయంగా పెద్దన్నయ్యకు రావలసిన పొలం ఇవ్వడానికి రసాభాస చేశాం. ఈనాడు భాగ్యమ్మ వాటాకోసం దాని మామగారిమీద దావా వేస్తామంటున్నాం బావ పోయింతరువాత భాగ్యమ్మమీద దాని మామగారికి ఎంత శ్రద్ధ ఉంటుందో పెద్దన్నయ్యమీద నాన్నకూ అంత శ్రద్ధే ఉన్నది"

"అవాకులూ చెవాకులూ వాగకు. భాగ్యమ్మ మామగారితో పోల్చుతున్నావా నన్ను. సిగ్గు ఎట్లా లేదురా నీకు నేను పిల్లలకు చదువు చెప్పించలేదా? పెండ్లిచెయ్య లేదా? ఏ విషయంలో లోపంచేశానోయ్" అన్నాడు రామయ్యగారు.

"ఇవన్నీ భాగ్యమ్మ మామగారుకూడా చేశాడు. కాని అసలు సంగతి ఆస్తి సంగతి. ఆ విషయంలో మీ ఇద్దరూ ఒకటే నంటున్నాను." అన్నాడు భాస్కరం.

"ఏం ఆస్తిసంగతికి ఏమి వచ్చిందీ? ఎవరిది వారు తీసుకొంటూనే ఉన్నారుగా" అన్నాడు రామయ్యగారు.

"ఆ తీసుకొంటున్నారు. అంతే కాని నువ్వు ఇవ్వలేదు. ముష్టి ముప్పాతిక ఎకరం పంచిఇచ్చి ఆమాట నిలపెట్టుకోలేకపోయావ్. నిన్ననడం దేనికిలే? ఇదంతా మా అదృష్టం." అన్నాడు భాస్కరం.

"ఏం నాయనా అదృష్టానికి ఏమి వచ్చింది. చేతనయినంతవరకు చదువు చెప్పించాను. మీ రెక్కలమీద మీరు బతుకుతున్నారు."

"అవును చేశావు. కాదనటంలేదు. చెయ్యాలన్న సరదాకొద్దీ చేశావు. అంతే గాని మాకు కూడా కొన్ని ధర్మాలుంటవని తెలుసుకోలేకపోయావ్. సంప్రదాయం అనేదాన్ని పట్టుకు వేళ్ళాడావు. ఆ సంప్రదాయంకూడా పూర్తిగా నీకు తెలియదు. తమాషా యేమిటంటే పిల్లలు సంపాదించి పెట్టాలని నీ కోరిక. కాని, వాళ్లు ఇంకా సంపాదన మొదలుపెట్టకముందే పెళ్లిళ్లు చేశావు. వాళ్ళూ అదో రకమైన ఉత్సాహంలోపడి తమ సంగతి తాము చూచుకోలేక సతమతమవుతున్న రోజులలో వాళ్లు నీకు సంపాదించి పెట్టలేదని సాధించావు ఇంకా సాధిస్తున్నావ్. పైగా అటువంటి కోరిక నీకులేదని దబాయిస్తావ్..."

"అయిపోయిందిగా, నా తరం అయిపోయింది. ఇక మీరు చెయ్యండి చూస్తాను." అన్నారు రామయ్యగారు.

"అక్కడే ఉన్నది చిక్కంతా. నీకు పదెకరాల పొలం వచ్చింది నువ్వు మాకేమి ఇచ్చావ్? తలా ఎకరంకూడా ఇవ్వలేదు. పైగా మీరు నాకన్న బాగా చెయ్యండి అంటే..."

"నాలేవోయ్ చదువుకున్నందుకు బలే నేర్చుకున్నావ్" అన్నాడు మూడవవాడు

"నేర్చుకోవలసినంత నేర్చుకోలేదనే నా బాధ. భాగ్యమ్మకోసమే వచ్చా. నేను దాన్ని నాతో తీసుకువెళుతున్నా. ఎల్లుండి దానికి మళ్ళీ పెళ్ళి చేస్తున్నా. ఇష్టమయితే మీరు రండి. రాకపోతే మానుకోండి పెళ్లి అంటే ఆడంబరం ఏమీ ఉండదు. నలుగురు స్నేహితులు వస్తారు. పెళ్ళిచేస్తాం. అందరం కలసి భోంచేస్తాం. రిజిస్టరు ఆఫీసుకువెళ్ళి పెళ్ళి రిజిస్టరు చేస్తాం."

"ఇందుకు భాగ్యం ఒప్పుకుందా?" అన్నాడు రామయ్యగారు.

"సరే బాగుంది. అది ఒప్పుకోకపోతే భూకంపట్టేంది. నా పెళ్ళి నువ్వే చేశావుగా" అన్నాడు భాస్కరం.

"ఇక మీ అమ్మ ఏ నుయ్యో గొయ్యో చూచుకొంటుంది" అన్నాడు రామయ్య గారు.

"మాట్లాడితే అమ్మ నుయ్యో గొయ్యో చూచుకొంటుంది అంటూ వెందుకూ? నీకు ఇష్టంలేదని చెప్పరాదూ?"

"నాకు ఇష్టముంటే ఎంత లేకపోతే ఎంత?"

"అసలు సంగతి అది. ఇది నీకు సంబంధించిన విషయం కాదు భాగీ ..రాపోదాం" అంటూ భాస్కరం భాగ్యమ్మను అంటే వాడికంటే పెద్దదీ మిగతా మగపిల్లలకంటె చిన్నది అయిన రామయ్యగారి పెద్దకూతురును వెంటపెట్టుకు వెళ్ళిపోయాడు.

రామయ్యగారు మూడోవాడివంక చూచాడు. మూడోవాడు ఇంటికప్పు వంకచూచాడు, అయిదు నిమిషాలయింతరువాత రామయ్యగారుఅన్నాడు గదా.

"ఇక ఈ నాటకం చాలురా బాబూ. అందరం కలిసిఉందామని నాయకుడిలా ప్రయత్నించాను. అందరూ ఒకచోట ఉండి ఏదో ఉద్యోగాలు చేస్తుంటే వేడి నీళ్ళకు చన్నీళ్లు తోడుగా వుంటయ్ అనుకున్నాను. కాని, అదేమీ పడలేదు. ఇక ఈ వూళ్లో ఎందుకూ నేనూ మీ అమ్మ కంకిపాడు వెళతాం."

"అక్కడ మాత్రం ఎక్కడ ఉంటారు. ఇల్లు అమ్మివేశారుగా" అన్నాడు మూడోవాడు.

"ఫరవాలేదు. ఏదో తంటాలు పడతాను. ఎవరి పీలం వాళ్లు చూచుకోగలరే, రేపుకాక ఎల్లుండి నేను బయలుదేరి వెళతాం." ★

# ప్రమోషన్

సెట్టిల శ్రీరామమూర్తి

"బ్రహ్మయ్యగారింట్లో వున్నారాండి" గేటు కటకటాల్లోంచి ప్రశ్న.

ఓసారి అటుకేసి బుర్రవిసిరి మళ్లీ సావిట్లోకి వెళ్లిపోయాడు వెంకన్న, లోపలేదో పెద్ద పనున్నట్టు. వెంకన్న ఆలోచిస్తున్నాడు "ఈయన్ని ఎంతసేపు ఆలస్యం చేయిద్దాం?" నడుస్తూ అంచనా వేసుకుంటున్నాడు. "ఏమాత్రం కిట్టుంది?"

సావిట్లోంచి గదిలోకి, మళ్లీ వసారాలోకి తిరిగి సావిట్లోకి ఏదో పని కల్పించుకు తచ్చాడుతూ వీధిలో నించున్న ఆయనకేసి మళ్లీ చూపు విసిరి గదిలోకి చక్కాబోయాడు. ఆయన కొంచం ధైర్యం చేసి, చెయ్యి వూపి నిష్ప్రయోజనంగా నీరసంగా క్రిందికి చెయ్యి జారవిడిచాడు. ఆయన బుంగమీసాలూ, జరీ ఖద్దరు కండువా, పంచ, లాల్చీ వాటం అంతా కనిపెట్టున్నాడు వెంకన్న. ఇంకా ఆలస్యం చేస్తే అసలు బెడిసికొట్టుందేమో అని ఓ నిర్ధారణకు వచ్చి, ఆఫీసుగదిలోని వెండిగ్లాసు పెరట్లోకి తీసుకుపోయి తీరుబడిగా నెమ్మదిగా గేటుకేసి వచ్చాడు హైడ్రోజన్‌బాంబు మీదపడ్డా దులిపేసుకునే నిర్లిప్తతో. గేటు తీస్తూ అప్పుడే ఆయన్ని అకస్మాత్తుగా చూసినట్లు ఆశ్చర్యంగా మొహం పెట్టి—

"ఎవరు బాబూ? ఏంటి కావాలి తమకి?" అన్నాడు.

"ఆఫీసరుగారు లోపల వున్నారా?" అన్నాడాయన.

"ఏం? ఎందుకు? ఏంగావాలి మీకు ఆయనతో" అన్నాడు చిరాగ్గా వెంకన్న కనుబొమలు ముడిచి.

"కొంచం పనుంది...ఓసారి దర్శనం చేసుకుందికి వీలుంటుందేమో అని" సందేహిస్తూ అన్నాడు ఆయన.

"ఇప్పుడేం లాభంలేదు. అయ్యగారు 'బిజీ'గా వున్నారు. ఇప్పుడు ఎవ్వరూ చూడ్డానికి వీల్లేదు."

"అది కాదోయ్, ఇల్లా చూడు" తళతళ మెరుస్తూన్న ఓ వెండిరూపాయి చేతులు మారింది. ఆ అరక్షణంలో అంతవరకూ కోపంగా చిరాగ్గావున్న వెంకన్న మొహం వికసించింది. ఆనందంతో కూడిన చిరునవ్వుతో కళ్లు పెద్దవిచేసుకుని

"మీరా బాబూ, ఒక్క నిమిషం వుండండి లోపల చెప్పివస్తాను" అంటూ ఎంతో ఆప్యాయంతో ఏ పాతికేళ్లనించో ప్రాణస్నేహం కలిగినవాడిలా, ఆప్తబంధువులా, ఆయన్ని పలకరించి ప్రసన్నవదనంతో ఇంట్లోకి వెళ్లేడు. మళ్ళీ క్షణంలో వెంకన్న నవ్వుమొహం సావిట్లోంచి ఆయన్ని పిలిచింది. ఆయన బుంగమీసాలు సవరించుకుంటూ ఠీమేదాతో ఆఫీసరుగారిగదిలోకి ప్రవేశించేరు.

ఆఫీసరుగారు బుర్రవంచుకుని ఏ(వి)టో వూరికే రాసేస్తున్నారు, వెంకన్న వచ్చి ఎవరో వచ్చారని చెప్పినప్పట్నించీ. ఆయన గది గుమ్మం లోపలగానిల్చుని చిన్న పొడిదగ్గుదగ్గి, గొంతుక సవరించుకుని, కండువా మెడమీంచి జాయిగా సర్దుకున్నాడు. ఆఫీసరుగారు తలెత్తి చూశేరు.

"మాది...వూరండి...హిహిహీ... తమ దర్శనం చేసుకుందామని..."

"ఏంపని?"

ఆఫీసరు సింహంలా చూస్తున్నాడు. ఆయన ఆఫీసరు నైతికబలాబలాలు అంచనా వేసుకుంటున్నాడు. 'అంతా మేకపోతు గాంభీర్యమా, నిజంగా స్ట్రిక్టుమనిషా' అని. తొంగిమాసి మాయమైన వెంకన్న మొహం ఆయన దిగజారినధైర్యాన్ని ఎగసందోసింది.

"బ్రహ్మయ్యగారు చెప్పారు మీసంగతి. ప్రభువుల దర్శనం చేసుకుందామని వచ్చాను. మావాణ్ణి కాపాడమని"

బ్రహ్మయ్యగారి పేరు వినగానే ఆఫీసరుగారి మొహంలో సీరియస్‌నెస్ తగ్గింది. ముఖకవళికలు మామూలుస్థాయికి వచ్చేయి. ఇంతలో 'ఆయన' సంజ్ఞ చేయగానే ఓబుట్ట గదిలో వాలింది.

"మామిడిపళ్లులెండి. మావూరిపళ్లు చాలా ప్రశస్తమైనవి. ఈచుట్టుప్రక్కలకి ఇల్లాంటి పళ్లులేవు. ఈజాతి మా వక్కతోటలోనే వుంది"

ఆఫీసరుగారి మొహంమీద చిరునవ్వు అంకురించింది.

"ఎందుకండీ ఇవన్నీ"అన్న వారిమాటల్లో అంగీకారం సూచించే మెత్తదనం వుంది.

వెంకన్న బుట్టలోపలకి తీసుకుపోయాడు. వెంకన్నని వద్దనబోయినట్లూ, వాడు ఏమీ వినిపించుకోకుండా బుట్టతీసుకుపోతూన్నట్లూ, వాడు అపినా ఆగేరకం కాదనీ, వాణ్ణి మంచిలోకి మార్చటం బ్రహ్మతరం కాదనీ అర్థం తోపించేలాగ అదోలా మొహం పెట్టేరు ఆఫీసరుగారు.

"మా విశ్వనాథం చాలా తెలివైనవాడండి. అన్ని పనులూ అతి చురుగ్గా చాకచక్యంతో చేస్తాడు. గుమాస్తాలో అంత సమర్థుడు లేడని తమకే తెలిసేవుంటుంది. మరి వెళ్లొస్తాను. సెలవు" ఆయన వెళ్ళిపోయాడు.

ఇంకో గంటకి ఆఫీసరుగారింటిముందు ఓ ఫియట్ ఓల్డుమోడలు కారు ఆగింది. వెంకన్న పరుగెత్తుకుంటూ గేటుదాకా వెళ్ళి, పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చి ఆఫీసరుతో హడావిడిగా చెప్పేడు బ్రహ్మయ్యగారు వచ్చారని.

ఆఫీసరు త్రుళ్లిపడి లేచేడు. బనీనువంటిపై టర్కీటవల్ కప్పుకుని, లుంగీ ముడి బిగించుకుంటూ వెంటనే గేటువరకూ వెళ్ళి ఆయన్ని ఇంట్లోకి ఆహ్వానించేడు.

బ్రహ్మయ్యగారిలాంటి రాజకీయ నాయకుణ్ణి మంచిచేసుకోకపోతే శంకవగిరి మాన్యాలకి ట్రాన్స్‌ఫరు తప్పదని ఆఫీసరుకీ తెల్సు!

"ఏవిటి తమరిలా దయచేసేరు?" అంతటి గెజిటెడు ఆఫీసరూ తనో పురుగు ననుకున్నాడు ఆయన ముందు.

"అబ్బే, మావూరి అక్కయ్య మాటమీద వచ్చేను. వాళ్ళ విశ్వనాథం చాలా చురుకైనవాడూ తెలివైన వాడూనూ. నెక్స్ట ప్రమోషనుకు అతను అన్నివిధాలా తగినవాడనుకుంటాను" బ్రహ్మయ్యగారి వాక్యం తీరులో ఆ విషయంలో తన కేమీ సందేహం లేదనే దృఢనిశ్చయము నిబిడీకృతమైవుంది. సంభాషణ జరిగేటంతసేపూ ఆయన పాముతల చేతికర్రని నెమ్మదిగా నేలమీద కొట్తూ నేవున్నారు వూతపదంగా. ఆ శబ్దంలోని అంతరార్థం ఆ ఆఫీసరుకీ తెలుసు, గది వెనక వసారాలో మామిడిపళ్లు వాసన చూస్తూన్న వెంకన్నకీ తెలుసు.

"అతనికపైన అయిదారుగురు వున్నారంటే—సీనియారిటీ..."

"ఆఁ సమర్థత ముందు సీనియారిటీ లెంత?" చేతికఱ్ఱ పూపుగా ఆఖరిసారి గట్టిగా నేలమీకొట్టి కుర్చీలోంచి లేచేరు బ్రహ్మయ్యగారు.

కొంగు బుఱ్ఱుమంది. చేతికఱ్ఱచప్పుడు ఆఫీసరు మెదడులో మెదులుతూనే వుంది.

రాత్రి తొమ్మిదిపదీ కొట్టూండగా ఆయన మళ్ళీ గేటుముంగు తయారయ్యాడు. వెంకన్న అలికిడి పసికట్టి గిన్నెనవ్వుతో ఆయన్ని లోపలికి తీసుకువచ్చేడు. ఆఫీసరు గారు "దయచేయండి" అని కుర్చీ చూపించేరు.

"ఇప్పుడే బ్రహ్మయ్యగారువచ్చివెళ్ళేరు"

"ఆఁ అలాగా అండి, ఎంతసేపైంది?" అన్నాడాయన, తనేమీ ఎరగనట్లూ, అప్పుడే తనీ ప్రపంచంలో అడుగుపెట్టినట్లూ మొహం పెట్టి.

"మీ విశ్వనాథంసంగతి చెప్పేరు. చూస్తాను"

"చూస్తాననటం కాదు ప్రభువులు తల్చు కుంటే కానిదేముంది" ఒక బరువు కవరు బల్లమీదికి ప్రాకింది.

"ఏఁవిటండీ ఇదంతా" అన్నాడు ఆఫీసరు నీరసంగా. ఒకరి నైతికవిలువలు ఒకరు లెక్కవేసుకుంటూన్నట్లు ఒకరిమొహంలోకి ఒకరు క్షణకాలం చూసుకున్నారు.

ఆయన బుంగమీసాలు సవరించుకుంటూ "అబ్బే ఏముందండీ మీమీద మాకున్న ప్రేమనీ భక్తినీ, గౌరవాన్నీ ఇదో స్వల్ప రూపాన్ని చూపించుకుంటున్నాం ప్రభువులు కటాక్షించాలి మరి"

బ్రహ్మయ్యగారి చేతికఱ్ఱచప్పుడు ఇంకా వింటూనేవున్న ఆఫీసరుగారు చడీచప్పుడూ లేకుండా "అది" డ్రాయర్లోకి దిగజార్చి ఎంతో చిరాకుమొహం పెట్టి చుట్టుప్రక్కల కలయజూసేడు.

"విశ్వనాథమా, చురుకైనవాడు కదూ, ఆట్టే ఇబ్బంది వుండదులెండి. తాయశక్తులా ప్రయత్నిస్తాను" ఆఫీసరు లేచేడు.

"సెలవిప్పించండి" దణ్ణం పెట్టి ఆయన వెళ్ళిపోయాడు.

మరి కొన్నాళ్ళకి. విశ్వనాథం హుషారుగా ఆవేళ ఆఫీసుకివస్తున్నాడు. అతని సంతోషానికి అంతులేదు. పెళ్ళినాటితర్వాత తనకి మళ్ళీ అంతసంతోషము కలిగింది ఆ రోజునే. అక్కయ్యమామ చెప్పేరు ఆర్డర్సు ప్యాసు అయ్యాయనీ, ఆరోజు వస్తాయనీ. తను గెజిటెడు ఆఫీసరు అయిపోతున్నాడు. అక్కయ్యమామ మీసాలపైని అపరిమితమైన అభిమానం పుట్టుకొచ్చింది ఇహమీదట ముందు డవాలాబంట్రోతూ, చెవకొలతినూ...ఇంక తన పెళ్ళానికి కావల్సిన నగలు చేయించవచ్చు...ఇదివరకులా ఆబగా రోడ్డుమీంచే షో కేసులు కేసి చూడ నవసరం లేదు. దర్జాగా లోపలకే వెళ్ళి కొనుక్కోవచ్చు. పిల్లల్ని కొరాలో కాన్వెంటుకు పంపించాలి ఇప్పుడు కాలు మీద కాలు వేసుకుని సుఖంగా కావల్సిన వన్నీ తింటూ (అయ్యరు హోటల్లో రెండు ఇడ్లీ సాంబారుతోనే సరిపుచ్చుకో నక్కర్లేదు), చూస్తూ, కోరికలన్నీ తీర్చుకో వచ్చు. తన స్వంతకారులో – అక్కయ్యమామ ఫియట్ ఓల్డుమోడల్ తల్చుకుని నవ్వుకున్నాడు – భార్యాపిల్లల్తో బీచికి సినీమాలకి తిరగొచ్చు...అమ్మయ్య ఎన్నాళ్ళకి ఈ 'బల్లదగ్గర బానిసత్వం' నించి విముక్తి! చేతిలోని కాయితాల పాడ్ కేసి చూస్తూ సానుభూతిగా ఓ నీరసపు చిరునవ్వు నవ్వేడు. రోజూ తను విధిగా నడిచే ఈ రోడ్డూ, ఈ చెట్లూ, గరల్సుస్కూలు గోడా, ప్రక్క మైదానంలో ఫుట్ బాల్ ఆడే పిల్లలూ – అంతటితో బుణం తీరిపోతుంది బెంగగా చూసేడు చుట్టూ పాపం తన స్నేహితులంతా అల్లా గుమాస్తాలుగానే వుండిపోతారు. ఎంతో తెలివైనవాడైతే నేం అందరికీ అక్కయ్యమామ లుంటారా? తనకి ఆర్డరు రాగానే మిత్రులందరూ అభినందిస్తారు. ఇంక కంగ్రాట్యులేషన్సూ, షేక్ హేండ్సూ, టీ పార్టీలూ ఓ ఒహ. ఏమిటి తనకి ఆఫీసుపన్లు చేతకాకపోయినా, తనని మిత్రులు ఏం వేళాకోళం చేసినా, ఇప్పుడుమట్టుకి తన సుగుణాల్ని వర్ణించి తనని గొప్పగా చెప్పుకుంటారు. తనకి పూలదండలు వేసి పార్టీలిస్తే తాను వినయం నటిస్తూ 'ఇది అంతా మీ అభిమానమే కాని నా ప్రయోజకత్వం ఏమీ లేదనీ, మీ పొగడ్తలకు తగినవాడిని కాననీ' అంటూ ఓ చిన్న వుపన్యాసం దంచేస్తాడు. తనతోటి గుమాస్తాలే తన చేతికిందికి వస్తే? ఆ. విశ్వనాథంలాంటి వాడు వస్తే బాగుండును. పనంతా వాడే చేసుకుపోతాడు. తనకి సంతకాల శ్రమ తప్ప ఇంకేమీ వుండదు...ఈపాటికి ఆఫీసులో తెల్సేవుంటుంది కావాలనే తను ఆలస్యంగా వెళ్తున్నాడు తన కేమీ తెలియ నట్లుండాలని.

ఆఫీసులోకి వచ్చేడు విశ్వనాథం.

"విశ్వనాథం!" అన్నకేక విని, అప్పుడే అందరికీ తెలిసిందీనూ అన్నట్లు వెనక్కి తిరిగి చూసేడు. కేశవయ్య కేకేస్తున్నది తన్ని కాదు ఆ. విశ్వనాథాన్ని! తనూ అటు కేసి చూసేడు. విస్సిగాడి చుట్టూ మిత్రులంతాచేరి సంతోషంగా ఏవేవో అంటున్నారు. కంగ్రాట్యులేషన్సూ, షేక్ హేండ్సూ ఎడతెరపి లేకుండా జరిగిపోతున్నాయి.

"నువ్వు అదృష్టవంతుడివోయ్ విశ్వం. నీ తెలివి తేటలకీ, చురుకుతనానికీ తగినట్లుగానే వచ్చింది ఈ ప్రమోషను. నువ్వు గెజిటెడు ఆఫీసరు వయ్యావంటే మాకు చాలా గర్వకారణం" అన్నాడు రంగయ్య.

"అసలు విశ్వనాథం మొదటినించీ ముక్కుసూటిగా నడిచే మనిషి. ఇంత బాధ పడుతున్నా ఎర్రని ఏగాణీ పైన తెచ్చుకోడం ఎరగడు. వాడి నిజాయితీయే వాణ్ణి రక్షించింది" అన్నాడు కేశవయ్య.

"ఏంరోయ్ ఏవేవో ట్రయల్సు చేసేవేమిట్రా? అంతమంది పైనుండగా నీ కెల్లా వచ్చిందిరా?" అన్నాడు ఛలోక్తిగా వెంకట్రావు.

"వాడి సంగతి తెలిసీ అల్లా అంటావేమిరా? అడిగించుకోకుండా సిరి వాణ్ణి వరించి వచ్చింది అంతే...ఇదిగో ఆ. విశ్వనాథం వచ్చేడే. ఎంతసేపైందిరా, వచ్చి?.. నీకు తెలిసిందిరా, భాయ్ మన విశ్వనాథం ఆఫీసరు అయ్యాడురా" అన్నాడు శంకరయ్య.

"ఆఁ" అని మాత్రమే అనగల్గిన విశ్వనాథం తెరచిన నోరుతో గ్రుడ్లు మిటకరించి, మొహాన్ని నెత్తురుచుక్క లేకుండా కొయ్యయిపోయి అల్లా చూస్తూ నిల్చుండిపోయాడు.

తర్వాత, అక్కయ్య మామమీసాలు పూడ లాగిడ్లు మోడలు ఫియట్ కారుఇంజన్లోవేసి వుడికతైలాలచే విశ్వనాథం తీవ్రప్రయత్నాలూ, అక్కయ్యమామ నాలిక కరచుకున్నా తెగని నాలికా, మన్యానికి ట్రాన్స్ఫరైన ఆఫీసరు అర్థంకాని మొహమూ, బయటికి పొక్కని గ్రంథస్థముకాని ప్రపంచచరిత్రలోని పరమ రహస్యాల్లో వుండిపోయాయి 




# మనశ్శాంతి



రంగు రంగుల దీపాలతో, పచ్చని తోరణాలతో, క్రిందపడి నలిగిపోయిన పూలరెక్కలతో మంగళ వాయిద్యాలతో కళకళలాడుతున్న ఆ పందిట్లో మీరా ఒక్కర్తే అందరికీ విచిత్రంగా కనపడుతోంది. ఎటువైపు చూసినా పట్టుచీరలూ, నగల ప్రశ్నలూ, కొత్త స్నేహాలూ. ఆ ఆనందాన్నంతటినీ ఒదిలేసి మీరా ఓ మూల నక్కి కూర్చునుంది. స్నేహితురాలి పెళ్ళికి వచ్చి అలా దిగులుగా కూర్చున్న మీరాని అందరూ వింతగా చూస్తున్నారు. వాళ్ళ చూపుల్ని భరించలేక ప్రశాంతంగా వుండే తోటలోకి వెళ్ళి గట్టుమీద కూర్చుంది.

గట్టుకింద వేగంగా పారే నీళ్ళవంక చూస్తున్న ఆమె ఆలోచనలు అంత వేగంగానూ ఒకదాన్నొకటి తరుముకుపోతున్నాయి. ఆలోచించినకొద్దీ మీరా మనస్సు కృంగిపోవటమే గాకుండా మొద్దుబారిపోవటము కూడా జరిగింది.

చిన్నతనంనుంచీ తనతో అంత చనువుగా, సఖ్యంగావున్న సరళ హృదయం విప్పి తనతో మాట్లాడలేకపోయింది. తనకి సహాయం చేసేటంత సమర్థత లేదనుకుందేమో! తనంటే నమ్మకం మమకారం వున్నట్లు తిరిగిన ఆత్మీయురాలే, మనస్సుని దహించే విషయాలని చెప్పలేక పోయింది. అన్నాళ్లు స్నేహంగా వుండగలిగినందుకు తను ఒక్క సహాయం చెయ్యటానికిగానీ, ఒక్క సలహా యివ్వటానికిగానీ అవకాశం లేకపోయింది. ఆ లోపం ఎవరిది? నమ్మకం

**కౌమారి**

**ఉషారాణి**

కలిగించలేకపోయిన తనదా? లేక నమ్మి చెప్పలేని సరళదా?

* * *

మనకి సహాయం చెయ్యగలవాళ్ళూ, చెయ్యదలచుకున్నవాళ్ళూ ఒక్క గజం దూరంలోనే వుంటారు. నోరు విప్పి ఒక్క మాట చెప్పినా, చెయ్యిజాపి ఒక్క సహాయం కోరినా, చిక్కులు చాలామటుకు తొలగిపోయే అవకాశముంటుంది. కానీ కొందరు ఆత్మీయులతోనే హృదయం విప్పి మాట్లాడలేరు. భూమి బ్రద్దలైపోతున్నా నోరు మెదపరు. ఎంతటి ప్రమాదకరమైన పరిస్థితులు ఏర్పడుతున్నా మనసులోనే దాచుకుని కృశించిపోతారు. అవి అలా హృదయంలో పేరుకుపోతాయి కాని అంతరించవు. సూది గ్రుచ్చినట్లు మనిషిని వేధిస్తూనే వుంటాయి. తత్ఫలితంగా మానసిక అనారోగ్యం ప్రారంభమవుతుంది. ఒంటరిగా కూర్చున్నప్పుడు ఆ చిక్కులు మరీ ఊదరపెడతాయి మనుష్యుల్ని. పైకి ఎంతో సహనం, ఓర్పు ప్రదర్శించడం జరుగుతుంది. కానీ క్రమంగా మనుషులు కుళ్ళటం ప్రారంభించి, అది ఒక జబ్బుకింద తయారవుతుంది.

ఈ రకం మన స్తత్వం మనుష్యులలో రకరకాలైన మార్పులని తెస్తుంది. ఈ ప్రపంచంలో తాము నమ్మదగినవాళ్లు ఎవరూ లేనట్లూ, తమ కష్టాలు చెప్పుకునేందుకు ఎవరూ లేనట్లూ బాధతో కుమిలిపోయే వారి ఆలోచనాశక్తి పెడదారిన పడుతుంది. ఏ ప్రశ్నకైనా సూటిగా సమాధానం చెప్పలేకపోతారు. సంభాషణా చాతుర్యం సన్నగిల్లుతుంది. పరులనుంచి సానుభూతి దొరకదు. ప్రోత్సాహం వుండదు. ఆలోచనలతో అనుమానాలతో వేధించుకుతినే మనసు అర్థంలేని గుబులుని కలిగిస్తుంది.

* * *

"సరళా! నీ ముఖం చూస్తే నాకివాళ ఏదో భయమేస్తోంది. అలా ముంగిలా కూర్చోవటమూ, పలుకరిస్తే విసుక్కోవటమూ, నిన్ను ఏదో విషయం బాధిస్తోందని స్పష్టమవుతోంది. అదేదో నాతో చెప్పకూడదూ! చేతనైన సహాయం చేస్తాను."

"నా విషయాలు ఒకరితో చెప్పుకోవలసినవి కావు. నాకెవ్వరూ సహాయం చెయ్యలేరు. బ్రతుకంతా యిలా వెళ్ళబుచ్చవలసిందే."

"చాలా పొరబడుతున్నావు. కాస్త ప్రశాంతంగా ఆలోచిస్తే ప్రతి సమస్యకీ పరిష్కారమంటూ వుండకపోదు. వాటిని దాచుకోవటమువల్ల కలిగే ప్రమాదం బహుశా నీకు తెలియనట్లుంది. ధైర్యంగా ఎక్కడి వక్కడ తేల్చేసుకుని, హాయిగా బ్రతకడం నేర్చుకో. నీకు నమ్మకమున్న వారితో నీ మానసిక బాధలనిగురించి చెప్పి ఉపశమనం పొందడం మంచిది. నోరన్నా మెదపకపోతే నువ్వు యిబ్బందుల్లో వున్నావని ఎదటివారి కెలా తెలుస్తుంది? ఇదేమన్నా స్వర్గలోకమా? కలలో దేవత నీకు కనపడి సహాయం చెయ్యటానికి? ఎదటివారికి నీ విషయాలు చెప్పలేకపోవటం కొంతవరకూ నీ పిరికితనంవల్లనే అని చెప్పాలి. ఇంట్లో అంతమంది వున్నారు. అక్కచెల్లెళ్ళూ, అవసరమొస్తే ప్రాణమైనా యివ్వటానికి సిద్ధపడే స్నేహితురాళ్ళూ వున్నారు. వారిలో ఏ ఒక్కరికైనా నీ చిక్కులేమిటో చెప్పటానికి ప్రయత్నించవు గూడదూ?"

ఎంతో సఖ్యంగా సాహచర్యంకోసం ప్రాకులాడుతూ కట్టుగా తిరిగే సరళకి ఆమె సహాయం చెయ్యలేకపోయింది. ప్రాణం విసిగిపోయేటట్లు బ్రతిమాలినా సరే ఒక్క విషయం పైకి పొక్కనివ్వదు. పైపెచ్చు "నీకు తెలీదులే!" "నువ్వు అర్థం చేసుకోలేవులే", "నాఖర్మ మింతేలే" అనే సమాధానాలతో ఆమనిషికి కొంత అహంకారమున్నదేమో ననే అనుమానం కలిగిస్తుంది. మరీ గట్టిగా ప్రశ్నిస్తే ముఖం పక్కకి తిప్పుకుని కళ్ళనీళ్లు దాచుకుంటుంది. అంతటితో వారి సంభాషణ ముగిసిపోతుంది.

కలసి మెలసి తిరుగుతూ, ఒకేచోట వుండే అక్కచెల్లెళ్ళ మధ్యా, తల్లి కూతుళ్ళ మధ్యా కొన్ని విషయాలు అజ్ఞాతంగానే వుండిపోతాయి. అత్తవారింట్లో ఎన్ని యిబ్బందులు పడుతున్నా తల్లితో చెప్పటానికీ, సలహా పొందటానికీ వెనక్కి తీస్తుంది కూతురు. అలాగే డబ్బు చిక్కులూ, యితర యిబ్బందులూ చిత్రహింస పెడుతున్నా, కృశించిపోతారే గానీ పరస్పరం సహకరించుకోలేరు అక్కచెల్లెళ్లు.

* * *

సామాన్యంగా ఆడవాళ్ళ నోట్లో రహస్యాలు దాగవనీ, ఏదో ఒక సందర్భంలో వాటిని బెటపెట్టేస్తారనే అభిప్రాయం వెల్లడిస్తూంటారు కొందరు పురాణగాథలు, కావ్యాలు, ప్రబంధాలు చదివి వాటిని నూరింట నూరుపాళ్లు నమ్మేవారు ఈ విషయాన్ని నమ్మటమూ, ప్రచారం చెయ్యటమూ జరుగుతోంది. ఈ వాదన అంతటితో ఆగటము లేదు. స్త్రీలు తమ విషయాలలో చాలా జాగ్రత్తగా ప్రవర్తిస్తారనీ, యితరుల విషయాలను అతి తేలిగ్గా బయటపెడతారనే అపోహ కూడా ఒకటి వుంది. పరుల కష్టసుఖాలని సరిగ్గా అర్థంచేసుకోగల సహనమూ, సహృదయమూ, ఎంతటి చిక్కులనైనా సరే తమని నమ్మినవారిని స్వార్థత్యాగంతో కాపాడగల శక్తి స్త్రీలలో తరుచు కనపడుతూ వుంటుంది. దీనికి పరులను అర్థంచేసుకుని సానుభూతి కనబరచగల శక్తే కారణమని చెప్పవచ్చును

ఈ సందర్భంలో ఒక ప్రఖ్యాత నవలా రచయిత సృష్టించిన యిద్దరు స్త్రీ మిత్రులని గురించి చెబుతాను. ఆ యిద్దరిలో ఒక యువతి పల్లెటూరిది. పట్నవాసంలో జీవించాలని పెద్ద కలలు కని, ఊహాసౌధాలు నిర్మించుకుని, ఆ మోజులో ఒక యువకుని వివాహమాడుతుంది. కాలక్రమాన ఆమె గాలిమేడలు కూలిపోవటమే కాదు, భర్త స్త్రీలోలుడనే విషయం గ్రహిస్తుంది. రెండో యువతి ధనికులబిడ్డ. చదువుకున్నది. పట్నవాసంలో పెరిగినది. నాయకుని ఎవరికి వారే అమాయకంగా అతి గాఢంగా ఇద్దరూ ప్రేమిస్తారు. ముఖాముఖి కలుసుకున్నప్పుడు అటువంటి స్త్రీలు ఎంతటి అసూయా ద్వేషాలు ప్రదర్శిస్తారో, అవి ఎదురుచూసే పఠితలను రచయిత ఒక విచిత్రమైన సన్నివేశంతో ఆశ్చర్యచకితుల్ని చేస్తాడు. పరుషవాక్యాలతో ప్రారంభమైనవారి సంభాషణలో క్రమంగా పరస్పరం జాలి, సహృదయత కనబడతాయి. గాలివానలో ఓ చెట్టుదగ్గిర కూర్చుని, అతి ఆప్యాయంగా ఒకరిచేతిలో ఒకరు చెయ్యివేసుకుని, వారి హృదయంలో రగులుతున్న బాధనీ, ఆవేదననీ, నాయకుడు వారి జీవితాలను ఎలా నాశనం చేసిందీ చెప్పుకుంటారు.

అలా హృదయం విప్పి మాట్లాడుకోవటంవల్ల యిద్దరూ ఉపశమనం పొందగలుగుతారు. కానీ ఆ కథ చదువుకున్నంతసేపూ ఆ యిద్దరు స్త్రీలూ పరస్పరం కష్టసుఖాలను

# ★ మనశ్శాంతి ★

విప్పి చెప్పుకోవటం సమంజసంగా లేదేమో అనే అనుమానం కలుగుతుంది. దానివల్ల వారికి తరువాత ఎటువంటి లాభం చేకూరిందీ అనే విషయమటుంచి, ఆ పుస్తకం చదివిన తరువాత ఆ సన్నివేశం మన హృదయంలో శాశ్వతంగా నిలిచిపోతుంది.

మన విషయాలని ఒకరితో చెప్పుకోవలసిన అవసరమేముంది? మనకంటె వారికి బాగా ఆలోచించగలిగే శక్తి వుంటుందనే రూఢి ఏమిటి? అని ప్రశ్నించేవారితో వాదించటం కష్టం. అలాగని కనిపించిన ప్రతివాళ్ళతో, ముందూ వెనుకా ఆలోచించకుండా, ఒకే ధోరణిలో స్వవిషయాలని గురించి చెప్పుకోనవసరము లేదు. అటువంటి అవివేకమైన పనికి పూనుకుంటే, మనశ్శాంతి కలగకపోవటమే గాకుండా, నవ్వులపాలయ్యే ప్రమాదంగూడా వుంటుంది.

కొందరి ముఖాలు చూస్తే అసలు వున్న విషయాలనే కాస్త గట్టిగా చెప్ప బుద్ధి పుట్టదు. కొందరు కేవలం మన స్వవిషయాలను సేకరించి మాటగట్టుదామని మహా తపత్రయ పడతారు. ఆ ప్రయత్నంలో గనుక కృతకృత్యులైతే, వీధిలో అడుగు పెట్టింది మొదలు నోట్లో బూరా ఒక్కటి తరువాయిగా అన్ని విషయాలూ బైటికి జారేస్తారు. అటువంటివారిని కాస్త తెలివిగా ఉపయోగించుకోవాలంటే, నలుగురికీ త్వరితంగా తెలియజెప్పాలనుకొనే విషయాలని వేరే ప్రకటనపత్రాల ఖర్చు లేకుండా, వారి చెవిలో వేశామో, అంచీలమీద ప్రపంచానికి తెలుస్తుంది. సామాన్యంగా అటువంటి వ్యక్తులవిషయం స్వానుభవం ద్వారానో లేక పరిశీలనద్వారానో తెలుసుకో వచ్చును.

తనకి సన్నిహితంగా వుండి, నమ్మకమున్న వ్యక్తులకి సొంత చిక్కులను గురించి చెప్పటములో ప్రమాదం లేదు. దానివల్ల తాము లోకువైపోతామని గానీ, ఎదటివారి దృష్టిలో హీనమైపోతామని గానీ అపోహపడుతూ కుళ్ళిపోవటం పొరబాటు. అవి ఒకరితో చెప్పినంతమాత్రాన వారు యితోధికమైన సహాయం చెయ్యాలని ఆశించనవసరం లేదు. ఒక సలహా అడిగినప్పుడు, ఆ విషయమై ఎదటివారు మన అభిప్రాయాలతో ఏకీభవించాలనీ, ఆ సమస్యనిగురించి మనలాగే ఆలోచించాలనీ కోరుకోకూడదు. వారి భావాలని గౌరవించనంతకాలం కొత్తవిషయాలని గురించి తెలుసుకోవటం కనీసం నేర్చుకోవటం జరగదు. తమ చిక్కులనీ సమస్యలనీ ఒకరితో చెప్పుకుని, చర్చించటమువల్ల, లేనిపోని అపోహతో ప్రమాదంగా కనపడే పరిస్థితులని ఎలా తప్పించుకోవచ్చునో, స్వశక్తివల్ల కొన్ని యిబ్బందులని ఎలా తొలగించుకో వచ్చునో బోధపడుతుంది.

జీవితంలో ఏ ఆనందాన్నయినా అనుభవించే శక్తి పొందాలంటే మనశ్శాంతి ఎంతో అవసరమని ఒప్పుకుతీరాలి. చిక్కులు ప్రత్యక్షంగా తొలగిపోయి జీవితమనే బాట సాఫీగా ఆనందమనే వెలుగులో ప్రవేశించటమువలనే గాకుండా, హృదయం విప్పి ఆ చిక్కులని గురించి యితరులతో చెప్పి పొందే ఉపశమనంవల్లగూడా మనశ్శాంతి కలుగుతుంది. ఈ రకం మనశ్శాంతికి తోడ్పడే శక్తులనీ, తత్ఫలితంగా కలిగే లాభాలనీ కొలవటానికి ఏ ప్రమాణాలూ లేకపోవచ్చు కానీ జీవితంలో సన్నిహితంగా వుండి పరస్పరం సహకరించుకోగల వ్యక్తులు దూరమైపోయే అవకాశంమటుకు వుంది ★

---

తమ్ముడు: (చదువుకుంటూ ఆగి) చిన్నక్కా! పదమంటే ఏమిటే?

చిన్నక్క: పదమంటే మాటన్న మాట.

పెద్దక్క: అదేమిటే, తప్పు అర్థం చెబుతున్నావు?

చిన్నక్క: పదమన్నా మాటన్నా ఒకటేగా?

పెద్దక్క: కాదు. పదమంటే వెళ్ళమని, మాటంటే రమ్మని, అర్థంకాదూ?

అయ్యగారి గాంధీ,— వాసేపల్లి.

---







వనితాలోకం సీరియల్



# స్వయంసిద్ధ



## 17

గోవిందుడు ఇంతసేపటినుంచి - ఏదో క్లిష్టమైన లెక్కకి సరియైన ఆన్సరు రాక, కిందా మీదా పడుతూ కూచున్నాడు చదువులగదిలో... అతడికి మరొక ధ్యాసేలేదు. బయట గుమ్మంతలుపు చప్పుడు కావటం, అది విని భార్య లేచివెళ్లటం, ఆమె ఇంతసేపటినుంచి తన యెదురుగా కూర్చుని ఉండకపోవటం - ఇవేవీ కూడా అతడు గమనించనేలేదు. టేబిల్ మీద తెరిచిఉన్న పుస్తకంలోని పేజీలమీదనే అతడి చూపు నాటుకుపోయింది - అది తప్ప ఇంక దేనికేసీ చూడటానికి - ఆ లెక్క పూర్తిఅయితేనే కాని మరొకవైపు మనస్సు మరల్చటానికి గాని అతడికి విశ్రాంతిలేదు.

కొంతసేపయినాక అతడు చటుక్కున చప్పట్లుకొడుతూ 'రూల్ ఆఫ్ త్రీ ఫినిష్' చేశాను. ఈసా రింకేమిస్తావ్!" అన్నాడు సంతోషంతో.

పట్టలేని ఆనందంతో - జిజ్ఞాసాదృష్టితో గోవిందుడు భార్య కూర్చుండే కుర్చీకేసి అప్పుడు తలయెత్తి చూశాడు. అక్కడ భార్యలేదు. అక్కడ మరొకరు గంభీర ముఖంతో నిలబడిఉన్నారు. ఈ సమయంలో, ఈ గదిలో, ఈ స్థితిలో ఆయన్ని తాను చూస్తానని ఊహించుకోలేదతడు! అతడి మనస్సులోని ఉల్లాసం, ముఖంలోని సంతోషం చటుక్కున అప్పుడే మాయమైనాయి ఆ స్థితిలో ఉండగానే అతడి కర్తవ్యం మళ్ళీ చటుక్కున స్ఫురించింది. ఆదరాబాదరా కుర్చీలోంచి నిలబడ్డాడు. భయసంభ్రమాశ్చర్యాలతో అతడికి తెలియకుండానే అతడి నోటినుంచి "నాన్నా. మీరా?" అన్నమాటలు వెలువడ్డాయి.

తండ్రి సమాధానం చెప్పకుండా ఆశ్చర్యంతో కొడుకును ఆపాదమస్తకం తేరిపార చూస్తూ మెల్లిగా ఒక కుర్చీలాక్కుని కూచున్నాడు. ఆ టేబిల్ మీద నోట్సు పుస్తకాలూ, మామూలు పుస్తకాలూ ఎన్నో చెల్లాచెదరుగా పడిఉన్నాయి. దానిమీద పడిఉన్న రెండుమూడు బైండు పుస్తకాలు తీసి, పేజీలు తిరగేసి చూశాడు తండ్రి. అవి ఏ సబ్జెక్టుకు సంబంధించిన పుస్తకాలయింది బహుశా అతడికి తెలియలేదేమో! మళ్ళీ వాటిని యథాస్థానంలో పెట్టేశాడు. తర్వాత గోవిందుడు గంటలతరబడి కుస్తీ చేస్తూ కూర్చున్న లెక్కల పుస్తకంతీసి, ఇంగ్లీషులో చేసిఉన్న లెక్కలకేసి విస్తుబోయి చూస్తూ "ఇవన్నీ నువ్వు చేసిన లెక్కలేనా? నీ దస్తూరీయేనా అబ్బాయీ ఇది?" అని అడిగాడు.

"ఊం." అన్నాడు గోవిందుడు నెమ్మదిగా...

"ఇది ఏ గణితం?"

"త్రైరాశిక గణితం... ఇవాళతో అయిపోయింది."

పుస్తకం పేజీలు తిరగేస్తూ కుతూహలం కొద్దీ "సంకలన గణితానికి చాలా తరువాతిదా?" అని తండ్రి మళ్లీ ప్రశ్నించాడు.

తండ్రి అలా ప్రశ్నించటంతో కుమారుడి మనస్సు ఉబ్బితబ్బిబ్బయింది తండ్రి అతడితో ఇలా ఎప్పుడూ మాట్లాడి యెరుగడు. అలాంటివాడివాళ తన లెఖ్ఖల పుస్తకమే తిరగేస్తూ, త్రైరాశికం - సంకలనానికి ఎంత తరువాతిదో తననే అడిగి తెలుసుకోవాలనుకుంటున్నాడు.

గోవిందుడు ఉత్సాహంతో "చాలా తరువాతిది నాన్నా! ముందు సంకలనము, తరువాత వ్యవకలనము, ఆ తరువాత 'మల్టిప్లికేషన్' (*Multiplication*)-ఆ తరువాత-" ఆ తరువాతిదాని పేరేమిటో చెప్పవలసిన అవసరం కొడుకుకి కలిగించకుండానే "సరే, ఇది ఇవాళతో అయిపోయిందంటున్నావే - ఈ త్రైరాశికాన్ని ఇంగ్లీషులో ఏమంటారు?" అని అడిగాడు తండ్రి.

"'రూల్ ఆఫ్ త్రీ' నాన్నా!" అని వెంటనే చెప్పేశాడు కొడుకు.

హరినారాయణబాబు ఆనంద విహ్వలమైన కొడుకు ముఖంకేసి చూస్తూ-

"సరేకాని అబ్బాయీ! సంకలన గణితమే ఎన్నాళ్ళకీ నీకు సరీగ్గా రాలేదని, మేష్టర్లు 'ఇంక లాభంలేదు, నీకేమీ రా'దని ఆశ వదులుకొని వెళ్ళిపోయారుకదా! అలాంటివాడివివాళ త్రైరాశికందాకా ఎలా దాటుకువచ్చావురా?" అని అడిగాడు.

తండ్రి మాటలకు గోవిందుడు తల వంచుకున్నాడు. అతడి ముఖంలో లజ్జ - వ్యథ - ఈ రెండిటి చిహ్నాలూ ఒక్కసారిగా వ్యక్తమయినాయి.

తండ్రి పుత్రుడి ముఖకవళికలు గమనించి, "మళ్ళీ ఇవన్నీ మొదలుపెట్టి ఎన్నాళ్ళయింది?" అని అడిగాడు.

కొడుకు అలా క్రిందికివాలిన చూపునే తండ్రి ముఖంమీద నిగిడ్చి మెదలకుండా ఊరుకున్నాడు. తండ్రి మళ్లీ తన ప్రశ్నను స్పష్టపరుస్తూ—

"నా ప్రశ్న అర్థం కాలేదా యేంరా? చదువు సంధ్యల్నేనాడో గుంటపెట్టి గంట వాయించావుకదా! మళ్ళీ యెప్పుడు మొదలెట్టావని అడుగుతున్నానురా!" అన్నాడు.

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ  అనువాదం : మదిపట్ల సూరి



# ★ స్వయంసిద్ధ ★

"పూలపాన్పు నాటిరాత్రినుంచి"

"అలాగా? బాగుంది. సరేకాని నేర్పుతున్న దెవరు?"

గోవిందుడు మళ్లీ తలవంచుకున్నాడు. తండ్రి ప్రశ్నతో అతడిముఖం ఎఱ్ఱపడింది. తనభార్య అన్న మాటలు చటుక్కున జ్ఞాపకంవచ్చాయతడికి. భార్యాభర్తలిద్దరూ మాట్లాడుకున్న సంగతు లింకెవరికీ చెప్పకూడదని ఆమె గట్టిగా నొక్కి నొక్కి చెప్పింది. తనకు మళ్ళీ ఈ చదువూ అదీ ఎవరు చెప్పటానికి పూనుకున్నారో, లెఖ్ఖలెవరు నేర్పుతున్నారో చెప్పాల్సి వస్తే భార్యపేరు చెప్పాలి. కాని ఆమె చెప్పవద్దని నిషేధించిందాయె! అంచేత ఈ ప్రశ్న విని గోవిందుడు తలవంచుకుని అలాగే నిలబడ్డాడు.

తండ్రి ఓరచూపుతో అది గమనించి, తనలో తాను నవ్వుకున్నాడు మరుక్షణంలోనే మళ్ళీ - "ఇన్నాళ్ళయినాక ఇప్పుడు మళ్ళీ ఈ లెక్కలమీదికి ఎందుకు పోయింది బుద్ధి?" అని అడిగాడు.

గోవిందుడు తలయెత్తి కంపితకంఠంతో- "ప్రయోజకుడు కావాలంటే ముందు లెక్కలు నేర్చుకుతీరాలి. లేకపోతే బుద్ధి వికసించదు" అన్నాడు.

తండ్రిమనస్సు కేదో చటుక్కున గుచ్చుకున్నట్లయింది. అయినా అతడు మనస్సులోని భావాన్ని గుంభనగా ఉంచుకుని, కొంచెం ఎత్తిపొడుపుగా - "పెద్దపెద్ద మాష్టర్లు నీకు లెక్కలు నూరిపోయాలని ప్రయత్నించినప్పుడు - అవి మరి నీమనస్సుకెందుకు ఎక్కలేదు?" అని అడిగాడు.

గోవిందుడు పసివాడిలాగా - "అప్పుడు వాళ్లెవరూ నాకివి తెలిసేట్లు చెప్పలేదు. ఊరికే మాట మాట్లాడితే, నేను గాడిదనని, వాడి మట్టిబుఱ్ఱని, లాభంలేదు. నాకెం





రాదని తిడుతూఉండేవాళ్లు" అనేశాడు అమాయకంగా.

"తర్వాత ఎవరో - నీది మట్టి బుర్ర కాదని, ప్రయత్నిస్తే నువ్వూ ప్రయోజకుడివి కాగలవని తెలిసేట్లు చెప్పాలనుకుంటాను"

కొడుకు అవునన్నట్లుగా తండ్రి అభిప్రాయాన్ని బలపరుస్తున్నట్లు తల ఊగించాడు. దాంతోపాటు 'భగవంతుడు కాదు వారి బుర్రలో మట్టి పెట్టింది. ఆ పని చేసింది తమలాంటి పూజ్యులే' అని కొడుకు తీవ్రంగా వాదించిన మాటలు హరినారాయణబాబు చెవులకు నగారా దెబ్బల్లా వినిపించసాగాయి.

తర్వాత అతడు కొంతసేపు నిశ్శబ్దంగా గదిలోఉన్న వస్తువులకేసి పరిశీలనగా చూశాడు. 'నిజంగా కేవలం చదువుల గదిలాగానే ఉన్నదది. ఇక్కడ సిసలైన చదువే సాగుతూ ఉంటుం'దని గ్రహించాడు. ఆ మేజాబల్లమీద పడిఉన్న పుస్తకాల్లోంచి ఒక నోట్సు పుస్తకంలాంటిది తీసి, అందులో చక్కగా - నిర్దుష్టంగా రాసి ఉన్న కొన్ని పంక్తులు పరిశీలించి తర్వాత కొడుకుకేసి చూసి - "ఇవి రాసింది నువ్వేనా?" అని అడిగాడు.

'కాదు' అని తల తిప్పాడు గోవిందుడు.

"ఎవరిదస్తూరీ ఇది?"

కొడుకు సమాధానం చెప్పకుండా మళ్ళీ తలవంచుకున్నాడు. తండ్రి గోవిందుడికేసి వక్రదృష్టితో చూస్తూ "అయితే ఇది నీ పెళ్లానిదా?" అని అడిగాడు.

కొడుకు పెదవులు ఒకటి రెండుసార్లు మాత్రం కదిలాయి. తండ్రి అనుమానం సత్యమేనని దాన్నిబట్టే తెలిసిపోయింది.

పుస్తకాలన్నీ పరిశీలించాక తండ్రి దీర్ఘంగా నిట్టూరుస్తూ "అయితే ఇప్పుడు లెఖ్ఖలే మంచి జోరుగా చేస్తున్నావన్న మాట!" అన్నాడు.

కొడుకుకళ్లు రెండూ పెద్దవి చేసి, "లెఖ్ఖలొక్కటే కాదు. చదువుకూడా బాగానే సాగుతోంది" అన్నాడు.

"అలాగా! ఏపద్ధతిని సాగుతోందేమిటి?"

"ఇదుగో - ఈ టైంటేబుల్ చూడండి" అంటూ అతడు ఒక యక్సర్ సైజు పుస్తకంలోని పేజీఒకటి తీసి చూపించాడు తండ్రికి. అందులో కొంచెం పెద్దపెద్ద అక్షరాలతో దైనికకార్యక్రమం వ్రాసి ఉంది. తండ్రి విస్తుపోతూ అది చదవటం మొదలెట్టాడు.

| | | |
|---|---|---|
| తెల్లవారగట్ల అయిదింటినుంచి | ...ఆరున్నరవరకు | ...ప్రాతఃకృత్యాలు...వ్యాయామం. |
| ఆరున్నరనుంచి | ...ఏడింటివరకు | ...మాతృపూజ. |
| ఏడింటినుంచి | ...ఏడున్నరవరకు | ...గీతాపఠనం. |
| ఏడున్నరనుంచి | ...ఎనిమిదింటివరకు | ...ఉపాహారసమయం. |
| ఎనిమిదింటినుంచి | ...పదింటివరకు | ...ఇంగ్లీషు. |
| పదింటినుంచి | ...పన్నెండింటివరకు | ...స్నానం, భోజనం, విశ్రాంతి. |
| పన్నెండింటినుంచి | ...మూడింటివరకు | ...లెక్కలు. |
| మూడింటినుంచి | ...అయిదింటివరకు | ...మాతృభాషాసాహిత్యం |
| అయిదింటినుంచి | ...ఏడున్నరవరకు | ...ఉపాహారం, వ్యాయామం. |
| | | ...సాయాహ్నకృత్యాలు |
| ఏడున్నరనుంచి | ...ఎనిమిదింటివరకు | ...మాతృపూజ. |
| ఎనిమిదింటినుంచి | ...పదింటివరకు | ...వార్తాపత్రికాపఠనం. |
| | | ...ఇష్టాగోష్ఠి వగైరా |
| పదింటినుంచి | ...పదకొండింటివరకు | ...భోజనం, విశ్రాంతి. |
| పదకొండింటినుంచి | రాత్రి పన్నెండింటివరకు | ...శాస్త్రపాఠాలు. |

అది చదవటంకాగానే పుస్తకం మళ్లీ కొడుకుచేతికిచ్చేస్తూ ఒక్క విషయాన్ని గురించి మాత్రం ప్రశ్నించాడు - "మాతృపూజా?"

"ఆ గదిలో అమ్మ ఫోటో ఉంది. ఆ నిర్ణీతసమయంలో ఆ ఫోటోకి పూలదండ వేసి, ధూపదీపాలతో పూజ చేస్తూ ఉంటాను. తర్వాత 'అమ్మా! నా హృదయంలోని జడత్వాన్ని పోగొట్టు. అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి వివేకజ్యోతి చూపించు. సరియైన పద్ధతుల్లో నేనుకూడా ప్రయోజకుణ్ణి అయేట్లు అనుగ్రహించు" అంటూ ఆమె ఫోటోకి మోకరిల్లుతూ ఉంటాను."

అని గోవిందుడు తాను మాతృపూజ చేసేటప్పుడు అనుసరించే పద్ధతిని - అర్ధనిమీలితనేత్రుడై పసిపిల్లవానిలాగా అమాయకంగా అభినయ పూర్వకంగా తండ్రియెదుట ప్రదర్శించాడు.

ఈసారి హరినారాయణబాబు ఎంతో కష్టంమీదకూడా నిగ్రహించుకోలేకపోయాడు. అవిరళంగా వస్తున్న అశ్రువులను బలవంతాన అరికట్టగూస్తే కళ్ళు రెండూ ఎర్రబడి ఉబ్బినవి. అతడికి అన్నీ జ్ఞాపకం రాసాగాయి. వివాహంనాడు కూడా యువకుడైన గోవిందుడి మనస్తత్వం - ఆరేళ్ళ కుర్రాడి మనస్తత్వంలా ఉంది. అలాంటివాడి వాళ్ళ చటుక్కున ఏదో మంత్రదండ స్పర్శ ప్రభావంవల్ల అయినట్లు - పదిహారేళ్లు చక్కగా చదువుకున్న యువకుని మనస్తత్వాన్ని పుణికి పుచ్చుకోగలిగాడు. ఇంకా కొన్ని సంవత్సరాలు ఈ సాధన ఇలాగే సాగితేచాలు...తాను మాత్రం ఎన్నాళ్లని బ్రతుకుతాడింకా!

ఇంతలో చదువుల గదిలో గడియారం మూడు కొట్టింది ... తండ్రి చటుక్కున ఉలిక్కిపడి, రుద్ధమైన కంఠాన్ని ఎలాగో సవరించుకుని, "నీకింక చదువు వేళయింది.

(30-వ పేజీ చూడండి)



జాలరులు



—ఫొటో : గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి, గుంటూరు.

# ★ స్వయంసిద్ధ ★

సరే, ఇంక పొద్దుపోతున్నది. నువ్వు వెళ్ళే ముందు ఒక్కసారి ఆ గదిలోకి కూడా వెళ్ళి చూసి వస్తాను" అన్నాడు.

ఈమాటలు అంటూనే హరినారాయణ బాబు మధ్య పెద్దగది వైపుకు వెళ్ళాడు. కొంత సమయం వృధా అయిపోతోందే అని గోవిందు డిప్పటిదాకా దిగులుపడసాగాడు. ఇప్పుడిక నిశ్చింతుడై ఈవేళకు చదువుకో వలసిన పుస్తకాలు తీసుకుని కూచున్నాడు.

## 18

మధ్య హాల్లోకి రాగానే హరినారాయణ బాబు దృష్టి అర్ధాంగి ఫొటోమీద పడింది.

స్వర్గీయురాలైన ఈ సహధర్మచారిణి ఫొటోని అతడు చాలాసార్లు చూశాడు. ఆ సాధ్వీమణి స్మృతుల నెన్నో గుర్తుకుతెచ్చే ఈ హాల్లో నుంచుని, గడిచిపోయిన గాథల నెన్నో జ్ఞప్తికి తెచ్చుకునే అవకాశాలు చాలాసార్లు లభించాయి అతడికి. ప్రియా విరహానుభూతితో ఎన్నోసార్లు దీర్ఘంగా కూడా నిట్టూర్చాడు. కాని, ఇవాళ మళ్ళీ ఆ హాల్లోకి, సుపరిచితమైన ఆ చిత్తరువు దగ్గరకి వచ్చి నిలబడగానే అతడి కేదో పవిత్రమైన పూజామందిరంలో అడుగు పెట్టినట్లు, దేవీప్రతిమ సాన్నిధ్యంలో నిల బడినట్లు తోచసాగింది. పెద్ద హాల్లాగా ఉన్న ఈ గదిలో ఒకవైపున శయ్య అవీ అమర్చి ఉన్నాయి. అయినప్పటికీ అన్నీ ఎంతో శుచిగా అమర్చి ఉండటంవల్ల ఈ గదిలోని ప్రతివస్తువూ దేవతానిర్మాల్యం లాగా అనింద్యంగా - అనవద్యంగా భాసి స్తున్నది. గతంలో ఎన్ని అహోరాత్రాలు అతడీ గదిలో గడపలేదు! అయితే ఏం ఎన్నడూకూడా ఇదొక పవిత్రమైన పూజామందిరమనే అనుభూతి మాత్రం కలగలేదు. ఈ గదిలో గోడకి తగిలించి ఉన్న తన భార్య చిత్తరువులో కూడా ఏదో అపూర్వమైన తేజస్సు ఉన్నట్లు ద్యోతకమవుతోంది. హరినారాయణబాబు తీక్ష్ణంగా చూశాడు. చిత్తరువులో ఉన్న వ్యక్తి శిరస్సుమీద సన్నగా ఉండే సిందూర రేఖ - సిద్ధహస్తుడైన చిత్రకారుడి కుంచెతో రోజురోజుకీ విస్తృతమవుతున్నట్లు ధగధగ ప్రకాశిస్తోంది. ఈ స్వల్పమైన మార్పుతో ఆ తైలవర్ణ చిత్రంలోని ముఖసౌందర్యం ఎంతో ఇనుమడించినట్లుంది. కాని ఈ లోపం ఇదివరకెన్నడూ అతడి దృష్టికి కొరతగా తోచలేదు. పాపిటిలోని ఈ సిందూర రేఖ, సువాసన పుష్పాలతో ఎంతో చక్కగా కట్టివేసిన ఆ పూలమాల, ఆ చిత్తరువులో ఉన్న ఆకృతికి జీవం పోస్తున్నట్లున్నాయి. అతడు రెప్పవాల్చకుండా ఆ చిత్తరువు కేసే చూస్తున్నాడు. కొన్ని క్షణాలు గడి చాక దృష్టి కొంచెం మరల్చగానే ఆ చిత్తరువుకి దిగువున పాలరాతిమీద ఒక పళ్ళెంలో పెట్టిఉన్న పుష్పాలు కంటపడ్డాయి. అవి చిత్తరువులోని దేవికి భక్తిశ్రద్ధలతో అర్పించిన పూజాద్రవ్యాలని అతడు గ్రహించాడు. ఉదయం - సాయంవేళలలో మాతృపూజకై కొంత సమయం ప్రత్యేకించబడిఉన్న పుత్రుడి టైంటేబిల్ చటుక్కున మళ్ళీ అతడికళ్ళకి జిగేల్‌మని కన్పించింది.

తర్వాత అతడు మెల్లిగా శయ్యవైపుకు వెళ్లాడు. ఆ శయ్యకూడా నిర్దిష్టస్థానంలో లేకుండా గదిలో ఒకమూలగాఉన్న రెండు కిటికీలకు మధ్యప్రదేశంలో వేసి ఉండటం అతడు గదిలోకి రాగానే గమనించాడు. ఇప్పుడు దగ్గరకెళ్ళి చూశాడు. కేవలం స్థలం మార్పే కాదు. ఆ శయ్యలోకూడా చాలా మార్పువచ్చిందిప్పుడు. ఇదివరలో చక్కగా మెత్తనిపరుపులతో కంటికి నిండుగా ఒకే శయ్యగా ఉన్నది - ఇప్పుడు రెండుశయ్యలుగా విభజించబడి విడివిడిగా ఉన్నాయి. ఇదివరలో పైన పరిచిఉండే మొఖమల్ దుప్పట్లుపోయి, ఇప్పుడాస్థానంలో కృష్ణాజినాలు పరిచిఉన్నాయి. ఒకశయ్యకీ ఒకశయ్యకీ మధ్య బారెడుఎడం మాత్రం ఉంది. హరినారాయణబాబు విస్మయంతో - కుతూహలంతో రెండుప్రక్కలీ నిశ్శబ్దంగా పరిశీలనగా చూశాడు. రెండింటికీ తేడాయేమీ లేదు. రెండుశయ్యలలోనూ ఒకేవిధమైన కాఠిన్యమూ, ఒకేరకమైన శుచిత్వమూ వెల్లడవుతున్నాయి. 'వెల్వెట్ క్లాత్' వేసి కుట్టించిన తలగడాలు ఇప్పుడే పక్కమీదా ఉన్నట్టు లేవు. ఇప్పుడున్న తలగడాలుకూడా శయ్యలలాగానే కఠినంగా ఉన్నాయి. ఈ తలగడాలమీద పచ్చటి మొద్దు ఖద్దరు గుడ్డలు పరిచి ఉన్నాయి. ఆ కృష్ణాజినాలు పరిచిఉన్న పక్కలమీద ఈతలగడాలు ఎంతో అందంగాఉన్నాయి.

మరి కొంతసేపు హరినారాయణబాబు అక్కడే నిలబడి, మనస్సులో ఏమి ఆలోచించుకున్నాడో తర్వాత మెల్లిగా భార్య చిత్తరువుదగ్గరకొచ్చి 'అమ్మాయీ!' అని పిలిచాడు కోడల్ని.

ఆయనపిలుపు వినబడగానే 'నన్ను పిలిచారా మామగారూ!' అన్న కోడలి మాటలు విన్పించాయి.

మామగారి తీవ్రదృష్టి గుమ్మంవైపునే పడింది. ఆయన పిలుపుకు సమాధానం చెపుతూనే కోడలు లోపలికి రావటంచూశాడు. ఆమెముఖంలో విక్షోభంకాని, విసుగుకాని, అభిమానంకాని, అనుమానంకాని ఉన్నలక్షణాలేవీ కన్పించనేలేదు. కొన్ని క్షణాలక్రితం విరామం అనేది లేకుండా ఎంతోసేపు తనతో వాదంవేసుకు కూర్చున్నది. తనకి యెంత ఆఘాతం తగిలినా దాన్ని ఓర్మితో సహించి, మళ్ళీ మాటల్లో ఎదుట వ్యక్తిని ఆఘాతపరచటంలో వెను తీయలేదామె. చివరికి మాట్లాడటమంతా అయిపోయాక బుద్ధిపూర్వకంగానే ఆమెని నిర్లక్ష్యంచేసి తాను ఈ గదిలో ప్రవేశించాడు. అయినా ఆ అద్భుతమైనపిల్ల తన పిలుపు వినగానే - అసలింతకుపూర్వం అప్రియమైన సంఘటనేదీ జరగనట్లు - ఈ పిలుపులోనే ఆదరా బాదరా పరుగెత్తుకొచ్చినట్లు - మామూలుగా వచ్చి నిలబడి జిజ్ఞాసాదృష్టితో మామగారి ముఖంకేసి చూడసాగింది.

మనస్సులోని ఆశ్చర్యం ముఖంలో వ్యక్తం కానీయకుండా - పైకి గంభీరంగా - "ఆ గదిలో ఉన్న నీ కాగితాలూ - పుస్తకాలూ అన్నీ చూసివచ్చానమ్మాయీ!" అన్నాడు.

చండి ఒక్కసారి మామగారి ముఖంకేసి చూసి మళ్లీ వెంటనే తలవంచుకుంది. సమాధానం ఏమీ చెప్పలేదు.

హరినారాయణబాబు కోడలి ముఖంలోని భావాన్ని ఓరచూపుతో గమనించి, తన మాటల్ని కొంచెం వక్రంగా మార్చి, "ఈ గదిలోని వస్తువుల్ని - హఠాత్తుగా ఇలా ఎందుకు మార్పించావో అర్థంకావటం లేదు" అన్నాడు.

చండి ఈసారి తల యెత్తి మెల్లిగానూ దృఢంగానూ అన్నది - "మార్చవలసిన అవసరం వచ్చింది మామగారూ!"

"అవసరం వచ్చిందా? అంటే దాని అర్థం?"

"ఆ అర్థం - మీ రా గదిలో కాగితాలూ అవీ చూసివచ్చినా - నిజంగా ఇంకా అర్థంకానేలేదా మామగారూ?"

కోడ లింత కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడటంతో మామగారి ముఖం మళ్ళీ బిగుసెక్కింది. కాస్సేపు మెదలకుండా ఊరుకుని, కోడలికేసి తీక్ష్ణంగా చూస్తూ "నీ మనస్సులోని అసలు ఉద్దేశాన్ని ఎలా



గయితేయేం ఇప్పటికి గ్రహించాను" అన్నాడు.

చండి మామగారి ముఖంకేసి ప్రశ్నార్థకంగా చూసింది — "మా యింట్లో ఉన్న సంప్రదాయం ప్రకారం – మా యింటికి కోడలుగా వచ్చిన అమ్మాయిని సంవత్సరం వరకు పుట్టింటికి పంపించే పద్ధతి లేదని మీ నాన్నతో పెళ్ళినాటి రాత్రే చెప్పాను ఈ నియమాన్ని ఉల్లంఘింప చెయ్యటానికి – దీనికి ఏదో అడ్డుచెప్పి, ప్రాధేయపడటంలో అతను వెనుదీయలేదు అయినా నేను మాత్రం ఒప్పుకోలేదు కాని ఇప్పుడని పిస్తోంది – నే నన్న మాటను చెల్లకుండా చెయ్యాలనే నువ్వు ఇక్కడింత బేఫర్వాగా ఈ పనులన్నీ చేస్తున్నావల్లే ఉంది" అన్నాడు మామగారు.

వసుపుముఖంలో చిన్న మెరుపులాగా చిరునవ్వు తళుక్కుమంది మామగారి ముఖంకేసి స్నిగ్ధదృష్టితో చూస్తూ— "అయితే ఇందులో నా కొచ్చే లాభం ఏముంది మామగారూ?" అని అడిగింది.

"మళ్ళీ నీ పుట్టింటికి వెళ్ళటమే లాభం! వాళ్ళూ నిన్ను చూసి ఆశ్చర్యపోతారు. నువ్వూ సగర్వంగా - ముసలాడి మాట చెల్లకుండా చెయ్యటానికని నే నక్కడికి వెళ్ళి ఇంతపని చేసివచ్చానని చెప్పగలవు" అన్నాడు మామగారు.

"నే నెప్పుడూ అనవసర విషయాల్ని గొప్ప చేసి మాట్లాడను. అలా మాట్లాడట మంటే నాకు అసలు యెప్పుడూ గిట్టదు.



# స్వయంసిద్ధ



అలా అయితే మీరు నా విషయంలో పొరపడ్డారన్నమాట!"

"పొరపడ్డానా? నువ్వనేది నిజమేనా అమ్మాయీ?"

"మీ రిలా అనటం-నాకు శాపం వరంగా పరిణమించినట్లయింది - అని నేనంటే మీరు విశ్వసిస్తారా మామగారూ."

అతడు తన మాటలను ఇంకా కొంచెం మెత్తగా మార్చి, "అదేమిటి?" అని అడిగాడు.

చండిముఖంలో దృఢత్వం ఉట్టిపడుతూనే ఉంది. ఆమె గొంతు సవరించుకుని, సుస్పష్టంగా "మీ అబ్బాయితో పరిచయం కలిగిననాటి రాత్రే - వారి విముక్తికోసం నేనిక్కడే ఉండి ఈ తపస్సును సంవత్సరంవరకు కొనసాగించటానికి నిశ్చయించుకున్నాను" అన్నది.

మామగారు సంశయాన్ని వెల్లడిస్తూ "సంవత్సరంవరకు పుట్టింటికి వెళ్ళటానికి వీల్లేదని తెలిసేనా?" అని అడిగాడు.

"నేను బుద్ధిపూర్వకంగానే పుట్టింటి మార్గాన్ని మూసివేసుకుని వచ్చాను మామగారూ!"

"బుద్ధిపూర్వకంగానా?"

అశ్రురుద్ధ నేత్రాలతో మామగారి ముఖంకేసి చూస్తూ చండి సమాధానం చెప్పసాగింది. "అందుకే అప్పుడు కనకాంజలి ఇవ్వటం! - తమరిచ్చిన పళ్ళెము మోహిరీలూ మా అమ్మఒడిలో పోసి, బంధాలన్నీ త్రెంచేసుకుని, ఒకే ఉద్దేశ్యాన్ని, ఒకే లక్ష్యాన్ని మనస్సులో పెట్టుకుని"——

దుఃఖంతో చటుక్కున ఆమె గొంతు పట్టుకుపోయింది అపైమాట ఇంక బయటికి రాలేదు.

మామగారు చటుక్కున త్రుళ్ళిపడి, ఆశ్చర్యంతో - "ఆఁ. అవును - జ్ఞాపకముంది" అన్నాడు. తర్వాత మళ్ళీ ముఖకవళికనూ, మాటతీరునూ మార్చుకుని, "ఆఁ నీ లక్ష్యమేదో పట్టుబడిపోయింది. పోనీ నువ్వన్నట్లు పుట్టింటికెళ్ళే మార్గాన్ని బంధించావనేది ఒప్పుకుంటాను కాని అత్తవారింటికివచ్చి ఈ చేసేపను లేమిటి మరి? ఎవర్నీ లక్ష్యపెట్టవు. ఈ ఇంటి కోడలివి నువ్వు అయినా ఎవరితోనూ నీకు సంబంధం లేదు. మంచి చెడులవైపు నీకు దృష్టి లేనేలేదు. కర్తవ్యాల నన్నిటినీ త్రోసిపుచ్చి నీ లక్ష్యాన్నే నువ్వు పట్టుకు కూచున్నావు! చిత్రం!" అన్నాడు

క్షణంలో చండి ముఖంలో కాఠిన్యం వ్యక్తమయింది. కన్నీళ్లు కార్చిన ఆ దుర్బలత్వం రెప్పపాటులో మాయమైపోయింది. మామగారిముఖంకేసి నిండుగా చూస్తూ "ఈ ప్రసంగాన్ని ఇంతటితో విరమించండి మామగారూ! ఇది అప్రియమైన చర్చ" అన్నది ధీమాగా.

కోడలిమాటలతో హరినారాయణబాబుకి విపరీతమైన కోపం వచ్చేసింది. ఆమె ఇవాళ హద్దు మీరి, చర్చించతగినవిషయా లేవో కూడా తానే నిర్దేశిస్తోంది. ఈ ప్రసక్తి





ఆమెకి ప్రాణం మీదికి వచ్చినట్లుందని గ్రహించాడతడు. అంచేత దీన్నే ఆధారంగా చేసుకుని, అతడు కోడల్ని తెగినట్లు అఘాతపరచటానికి సంసిద్ధుడయినాడు.

మాటలలోనే తన కోపాన్ని వ్యక్తంచేస్తూ "అన్యాయాన్ని సరించి వచ్చేచర్చ ఎప్పుడూ అప్రియంగానే ఉంటుంది దీన్ని కప్పిపుచ్చుకోవాలని ప్రయత్నించటం మరీ అన్యాయం. నేను నిన్ను అడిగిన ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్పి తీరాలి నువ్వు ఇంతివరకు ఎన్నడూ అన్యాయం అనేది చేసి యెరుగనని, ఒక్క అబద్ధంకూడా ఎన్నడూ ఆడి యెరుగనని అప్పుడు మరి గట్టిగా వాదించావుగా!" అన్నాడు.

చండి నిరుత్తరయై తల వంచుకుంది. ఏమీ మాట్లాడలేదు. కాని ఈ మౌనం ఆమె ఇదివరకన్న మాటలనే బలపరుస్తున్నట్లుంది.

మామగారీసారి మరింత గట్టిగా "నవవధువులు అవశ్యం చేయవలసిన కర్తవ్యాలను వేటినీ నువ్వింత చెయ్యలేదని నేనంటున్నాను" అన్నాడు.

చండి అలాగే తలవంచుకుని ఉంది. మామగారిమాటల్ని ఆమె కాదనీ అనలేదు. తన మీదఉన్న అభియోగాన్ని తాను అంగీకరించటం లేదన్నట్లయినా ఒక్కమాటకూడా మాట్లాడలేదు.

"నువ్వు 'కా'దనలేవుఅని తెల్సును నాకు. నువ్వు ఈ ఇంటికవచ్చి మూడుమాసాలు పైనయింది. నీ ప్రవరనతో - ఇంట్లోఉన్న వాళ్ళతో ఎవ్వరితోనూ నీకు సంబంధం అక్కర్లేదన్న సంగతి అందరికీ తెలిసిపోయింది అసలు ఎవరిమీదా లక్ష్యమున్న మాటే లేదు నీకు ఈమాట కాదంటావా నువ్వు?" అని అడిగాడతడు.

చండి అప్పటికీ మాట్లాడలేదు. రాతిబొమ్మలాగా, రెప్పలు వాల్చకుండా తల వొంచుకుని అలాగే చూస్తూ నిలబడింది.

"అయితే నువ్వీమాటా ఒప్పుకుంటున్నావన్నమాటేగా! నేను ఇంకా కఠినంగా చెప్పాల్సి వస్తోందమ్మాయీ! ఇది అప్రియమైనదయితే అవొచ్చుకాని అక్షరాలా యాథార్థంమటుకు అవును. నీ అత్తగారు, మరిది, ఆడబిడ్డ వీళ్ళెవరి సంగతీ నీ కసలు అఖ్కర్నే లేదు. కావాలన్న మాటకూడా తోచదు నీ మనస్సుకు ఇహా-ఇహా నీకు నామీదాకూడా ఏమాత్రంలక్ష్యం లేదన్న మాటా యథార్థమే."

చండిముఖంలో మార్పేమీ కన్పించలేదు. అంతదాకా యెందుకు? ఇలా ఒకదానివెంట వొకటి చొప్పున ఆరోపణలు చేస్తున్నా ఆమె ముఖంలో దిగులూ, విచారమూ, భయమూ ఉన్నట్లు ఛాయగానైనా కన్పించలేదు.

మామగారు ఈసారి కొంచెం తగ్గి మృదువుగానూ - వికృతంగానూ అడిగాడు. "ప్రపంచంలో నీకున్న ఏకైక లక్ష్యం - భర్తే! అవునా?"

ఆ రాతిబొమ్మ కింతసేపటికి ప్రాణం వచ్చినట్లయింది. పమిటచెంగు కంఠాన్ని చుట్టుకుని, మామగారి పాదాలచెంత వ్రాలి గద్గద కంఠంతో "ఇవాళ మీ ఈఅనుమానమే నాకు పరమ ఆశీస్సు!" అన్నది

మామగారు తదేకధ్యానంగా చండి ముఖంకేసి చూస్తూ "కాని ఇది నూతన వధువు కేమంత గౌరవనీయమైన విషయం కాదు...సీత, సావిత్రి, దమయంతి వీరూ వధువులే. వాళ్ళకీ భర్తలున్నారు, అత్తగార్లున్నారు. సంసారాలూ ఉన్నాయి -" అన్నాడు.

చండి వినమ్రస్వరంతో-"కాని కర్తవ్యసమస్య వీరి జీవితాల్లోకి తుఫాను తీసుకొచ్చినప్పుడుమాత్రం వారికీ ఏకైక లక్ష్యం భర్తే. ఆ సంగతి పురాణాలు చూస్తే తెలుస్తుంది మామగారూ!" అన్నది

కోడలిలా యెదురుజవాబు చెప్పటంతో మామగారు మరింత మండిపడ్డాడు. "పురాణాల్లోని విషయాలు తీసుకుని నీతో చర్చించటం ఇష్టం లేదు నాకు - అవసరమూ లేదు కాని నువ్వు అన్న మాటలనుమాత్రం ఈ యుగంలో ఎవరూ సమర్థించరు. నిదస్తరంలో రామకథామృతం కూడా చూసి వచ్చాను నేను. అది నువ్వు తప్పకుండా చదివేఉంటావు. ఆయన ఏమన్నాడు?... వంట చేయడం చేతయిన అమ్మాయికి వళ్లు శుభ్రంగా ఉంచుకోవటం తెలియకపోదు. భర్తమీద గౌరవం ఎంత ముఖ్యమో అలాగే సంసారంలో అన్ని విషయాలమీదా లక్ష్యం ఉంచుకోవటం కూడా అంత ముఖ్యం."

మామగారి మాటలు శ్రద్ధగా ఆలకించి, చండి తలపైకెత్తి "శ్రీరామకృష్ణప్రభువులు ఆమాట సంసారుల నుద్దేశించి అన్నారు మామగారూ! సంసారంలో చాలా పనుల్లో మునిగివున్న వారుకూడా దానివల్ల. భగవంతునిమీద, లక్ష్యం ఉంచుకోగల్గుతారు. కాని, ధ్రువుడు, ప్రహ్లాదుడు, ఇలాంటి వారివిషయంలో ఈమాట చెల్లుతుందా?" అన్నది.

మామగారు వెటకారంగా "అయితే వాళ్ళుపోయిన మార్గాన్నే అనుసరించాలని నీ కోరికా? అంటుకనేనా యేం అందర్నీ నిర్లక్ష్యంచేసి ఏకముఖిరుద్రాక్షవయి కూచున్నావ్?" అని అడిగాడు.

"ఏకోన్ముఖంగా చెయ్యకపోతే ఏ సాధనా సిద్ధించదు - మామగారూ!"

మామగారు విస్తుపోతూ "సాధనా?" అని అడిగాడు.

కోడలు ధీమాగా "అవును మామగారూ! సాధనే కాని ఈ దేశంలో ఇంక ఏ వధువూ నాలాగా ఇంత కఠోరసాధనను ప్రారంభించలేదు. ఇంత కఠినపరీక్ష కూడా ఎన్నడూ ఏ స్త్రీకీ వచ్చిపడలేదు. అందుకనే నేననేది. వివాహంనాటి రాత్రి నేను పొందిన 'వస్తువు'ను ఉత్తమోత్తమమైన వస్తువుగా చెయ్యటానికి నా లక్ష్యాన్ని పూరిగా అటు మార్చుకోవలసి వచ్చింది. ఎవరికోసమై, నా సాధనో, నా లక్ష్యంకూడా వారిదే. వారి సాధనను ఫలింపచేసేవరకు నా లక్ష్యాన్ని మార్చుకుంటానని ఏమీ అనుకోవఖ్కర్లేదు మామగారూ!" అన్నది.

హరినారాయణబాబు ముఖం గంభీరంగా పెట్టి "మీయీ సాధన ఎన్నాళ్ళవరకు సాగుతుంది?" అని అడిగాడు.

"సంవత్సరం వ్రతం పట్టానని ముందుగానే చెప్పానుకదండీ!"

"సరే తెలిసింది. కాని ఆ వ్యవధిని కొంతవరకు తగ్గించాల్సిన అవసరం వచ్చింది."

చండి తల యెత్తి ప్రశ్నార్థకంగా మామగారి ముఖంకేసి చూసింది.

"నీమీద వచ్చిన ఫిర్యాదును అన్నాళ్ళవరకు విచారించకుండా పడేసిఉంచటానికి వీల్లేదు."

చండి తీక్ష్ణంగా మామగారికేసి చూస్తూ- "ఈ వ్యవధికీ - నామీద ఫిర్యాదుకీ సంబంధం యేముందో నాకు బోధపడలేదు. అయినా విచారణ కాకముందే శిక్షించే యేర్పాటు చేస్తారా?" అని అడిగింది.

"అది సరికాదు. పైగా ఈ ఫిర్యాదునుంచి నిన్ను తప్పించే ఏర్పాటే జరుగుతోంది. ఇప్పుడు వ్యవహారం వచ్చిపడింది. కనుక మీరు ప్రారంభించిన వ్రతానికి విఘ్నం రావొచ్చు. లక్ష్యం మరొకవైపుకు పోవటానికి ఎక్కువ అవకాశం ఉంది. అందుకే చెప్పాను ఈమాట. ఇప్పుడు నా వాంఛ-యేమిటంటే ఈరోజు మొదలుకొని నాలుగు నెలలలోగా మీ వ్రతానికి ఉద్యాపన జరపాలి!"

"నాలుగు మాసాల లోపలా?" చండి నోటినుంచి ఈమాట అస్పష్టంగానే వెలువడింది.



# ★ స్వయంసిద్ధ ★

"ఆఁ. నాలుగు నెలలు మాత్రమే వ్యవధి ఇవ్వబడింది. వచ్చే ఆశ్వీజమాసం దేవీ నవరాత్రాల ప్రారంభదినం నాటికే మీ వ్రతో ద్యాపనం జరగాలి. తర్వాత నీ విచారణ ప్రారంభమవుతుంది. ఈలోగా రెండు వైపులనుంచి వచ్చిన ఫిర్యాదుల్ని గురించి దర్యాప్తుమాత్రమే జరుగుతుంది" అన్నాడు హరినారాయణబాబు ఉత్సాహంతో గట్టిగా...

"విచారణనుగురించి నాకేం దిగుల్లేదు మామగారూ! వ్రతం పూర్ణంకావలసిన వ్యవధి చాలా తక్కువగా ఉన్నదనే విచారం."

"మూడు మాసాలు ఈ వ్రతంతోనే గడిచిపోయాయి. ఇంకా నాలుగు మాసాలున్నాయి నాలుగు మాసాలంటే తక్కువా? కొద్దిరోజుల వ్యవధిఉంటే పెద్దపెద్ద భవనాలే కట్టగా లేనిది నాలుగు నెలల వ్యవధిలో ఒకర్ని ప్రయోజకుణ్ణి చెయ్యటం అసంభవ మవుతుందా?"

మామగారి మాటలతో చండి ముఖం అపరిమితమైన ఉత్సాహంతో ఉద్దీపమయింది. మామగారి ముఖంకేసి ఉజ్వలంగా చూస్తూ -

"తమ ఆశీర్వాదం కనుక ఉంటే అసంభవ మనుకున్నది సంభవమే అవుతుంది మామగారూ!" అన్నది.

కోడలి మాటలకి ఈసారి మామగారికి నవ్వొచ్చింది. అంతలోనే అతడు కొంచెం సగర్వంగా "అయితే ఇప్పుడు చెపుతున్నాను. భవిష్యత్తును పారచూసే అప్పుడు నీకు బంగారపు కొరడాను బహుమతిగా యిచ్చాను. దాని అండతో ఈ అసంభవాన్ని ఏనాటికైనా సంభవంగా చేయగలవని తెలిసే ఇచ్చాను."

మామగారి మాటలతోపాటు - ఆయన ఇచ్చిన ఈ బంగారపు కొరడా దెబ్బకూడా ఒకటి తన వీపున తగిలినట్లు తోచిందామెకి. ఒళ్లు మండిపోయింది. ఆ మంటను అణచుకుని, ముఖంలో వ్యక్తమవుతున్న క్లేశ చిహ్నాలను కూడా బలవంతాన కప్పిపుచ్చుకుని, సవినయంగా. "తమరు కొంచెంసేపు ఆగండి మామగారూ! నేను యిప్పుడే వస్తాను!" అన్నది.

మామగారు తీవ్ర దృష్టితో గమనిస్తూనే ఉన్నాడు. వధువు గబగబా ప్రక్కనున్న గదిలోకి వెళ్లింది. బయటకు విన్పించిన ధ్వనినిబట్టి ఆమె అక్కడ పెట్టె తీసినట్లు తోస్తోంది. చటుక్కున అతడి కనుబొమలు రెండూ ముడిపడ్డాయి.

చాలా కొద్దిసేపటిలోనే, వధువు తిరిగి రావటం చూశాడు. కాని కోడలి చేతిలో ఉన్న వస్తువుమీద అతడి ఉత్సుక దృష్టి పడగానే "ఆ బంగారపు కొరడాయేనా ఇది? అస్వాభావికమైనకంఠస్వరంతో అడిగాడు

వధువు అతి సహజమైన ధోరణిలో "అవునుమామగారూ! మీరిచ్చిందిఇచ్చినట్లు అప్పట్నుంచీ పెట్లోనే ఉంచాను. ఇంతవరకు దాన్ని ఉపయోగించాల్సిన అవసరం రాలేదు. అంచేత మీవస్తువును మీకు తిరిగి అప్పగించేస్తున్నాను." అన్నది.

మామగారు కళ్లు రెండూ పతికాయలంత చేసుకుని, చండికేసి చూస్తూ "తిరిగి ఇచ్చేస్తున్నావా?" అని అడిగాడు.

చండి పెదవులమీద చిరునవ్వు కన్పించింది. "ఇచ్చిన వస్తువును సంపూర్ణంగా వినియోగించి సార్థకం చెయ్యకపోతే - దాన్ని ఉంచి లాభంలేదు మామగారూ! అది బరువౌతుంది చివరకి"

మామగారు మ్లాన దృష్టితో చండికేసి చూస్తూ "అయితే నేనే పొరపడ్డానా?" అన్నాడు భగ్నస్వరంతో.

చండి ఏమాత్రం తొణక్కుండా చెప్పింది జవాబు. "మీరు ఈ పొరపాటును ఇచ్చేటప్పుడు ఊహించలేదు మామగారూ! మీరు అసలునాకోసమని ఉంచిన వస్తువు మన్ను కొట్టుకుని ఉన్న బంగారం లాంటిది. బంగారపుకొరడాతో ఝుళిపించి ఆవస్తువును ఏనాడూ అసలు బంగారుగా చెయ్యలేము. అందుకు కావలసింది ఒరపిడిరాయి అలా బంగారాన్నిగా మార్చేందుకే ఏకోన్ముఖమైన ఈ సాధన."

మామగారు రెప్పవాల్చకుండా కోడలి దృప్తముఖంకేసి చూడసాగాడు. చండి ఇంతలో ఆ కొరడాను మామగారి పాద సన్నిధిని పెట్టి, "నేను దీని మర్యాద కాపాడలేకపోయాను మామగారూ! క్షమించండి!" అన్నది.

హరినారాయణబాబు వివర్ణముఖంతో వంగి ఆ కొరడాను అందుకుని, "నిజంగా నువ్వీ భారాన్ని వహించటానికి ఒప్పుకోవా అమ్మాయీ?" అని అడిగాడు.

"అవును మామగారూ! నిజంగా ఇది నా తాహతుకు మించిన బరువు" అని మరుక్షణంలోనే "అసలు ఇది కంటపడితేనే ఒళ్లుమంట నాకు' అన్నది.

మామగారు నీరసంగా - "అలాగా! అయితే పోనీ ఈ భారాన్ని నివారణుడికి అప్పచెపుతానులే" అన్నాడు.

చండిముఖం ఒక్కనిమిషంపాటు ఉత్తేజితమయింది. చింతనిప్పుల్లాంటి కళ్లతో ఆమె మామగారిముఖంకేసి చూస్తూ "అలాగే అప్పచెప్పండి. కాని అత్తగారిముఖంకేసి ఒక్కసారిచూసి, దానికసరైనస్థానం ఎక్కడో ప్రశ్నించారంటే - దానికి జవాబు మీ మనస్సుకు మీకే తోస్తుంది మామగారూ!" అనేసింది ఒక్కగుక్కలో.

ఈమాటలు అంటూనే చండి చరచరా ప్రక్కగదిలోకి వెళ్ళిపోయింది. ఆ చివరి మాటలోఉన్న చురుకేదో మామగారికి గట్టిగానే తగిలింది. వెంటనే అతడు భార్య చిత్తరువుకేసి విచారణగా చూస్తూ "నువ్వు లేని ప్రదేశమంటూ ఎక్కడుంది? నీకన్నీ తెలుసు. నీవిషయంలో చేసిన పొరపాటుకి ఇన్నాళ్లికి ప్రతీకారం చెయ్యటం అంటూ తటస్థపడుతోంది. ఇప్పుడు నువ్వే ఓసారి దిగివచ్చి, ఈ కొరడాని నీ చేతులతో స్వీకరిస్తే, గంగూలీవంశంలోని అయోగ్యమైన ఈ స్వర్ణగార్దభాన్ని శిక్షించగలవు. దీనికదే సరిఅయిన ప్రాయశ్చిత్తం!" అంటూ వాపోయాడు... (సశేషం)







# మామిడిచెట్టు - బాలుడు

చావలి రామచంద్రరావు

ఒకరోజున బాలుడొకడు
పాఠశాలనుండి మరలి
త్రోవలోన నిలిచియున్న
మామిడివృక్షమును గాంచి
సందేహంబేదో కలుగ
ప్రశ్నించా డీవిధముగ :

"తోటలోని సాటిచెట్లు
ఆకాశము నంటుకొనగ
పోటీల్ పడి పెరుగుచుండ
ఏమిటి నీ వీతీరుగ
మరుగుజ్జుగ మారినావు.

"చూచితివా నీరూపము
ఎంత రోతగొడుతున్నదొ
గూనియవ్వవలె నుంటివి
ఏల కలిగె నీదుర్గతి?

"ఇప్పుడైన పూనికతో
తిరిగి సరిగ పెరుగరాద ?
సాటిచెట్లవలెనె నీవు
మేటివేల కాకూడదు?"

అని యడిగిన ఆ వృక్షము
వినుమని బదులొసగకున్న
మనసులోనె మథనపడుచు
చనబోయెను బాలుడపుడు.

బదులు చెప్పలేదటన్న
బెంగతప్ప వేరెరుగని
పాప మతనికేమి తెలుసు
చెట్లు మాటలాడవనుచు.

ఇంతలోనె గాలివచ్చి
వింతగ ఆకులను కదిపి
ఎంతొ మధురస్వరముతోడ
సంతసముగ పలుకసాగె.

అంతట యాబాలుడపుడు
వృక్షమె మాట్లాడసాగె
ననుచు ఎంతో సంబరముతో
వినసాగెను శ్రద్ధమీర.

"మించిపోయె మించిపోయె
మంచిరోజు లంతరించె
ఎంత తన్నుకున్న నేను
తిరిగి సరిగ పెరుగలేను.

"మొక్కగ నేనున్ననాడె
చక్కజేసి నను తిన్నగ
చక్కదనపు మ్రానుజేయ
ఒక్కడునూ లేక పోయె

"పెక్కురు వస్తారు లిపుడు
ఒక్కుమ్మడి పాటుబడిన
ఒక్కవీసమైన నన్ను
చక్కజేయ జాలరోయి.

"నాకొరకై చింతపడక
నా యనుభవమెరిగి నీవు
బాలునిగా నున్ననాడె
తెలివిగలిగి మెలగుమోయి.

"తిన్నని ఆదర్శముగల
ఎన్నదగిన మానవుడవు
ఎన్నిశ్రమలు పడినగాని
పిన్నవయసులోనె సుమా!

"పెద్దవాడవైనపిదప
బుద్ధి మారరాదనకు:
చిన్ననాటి యలవాటులు
పొమ్మన్నను పోజాలవు.

"మంచినెపుడు ప్రేమించుట
శత్రువంత ద్వేషించుట
చిన్నతనమునుండె నేర్చి
వన్నెకెక్కగలవు నీవు.

"పసితనమున ఒళ్ళు మరచి
ముసలివాడవైన పిదప
పసలగు మానవుడుకాగ
పస లేదని దిగులుపడిన
పసివాడా! ఫలము సున్న!

"నన్నుగాంచి నీవిప్పుడు
జాలిపడిన తీరుగనే
నిన్నుజూచియును విజ్ఞులు
నిట్టూర్తురు వేదనతో.

"మంచియదను మించిపోవ
ఎంతమంచివారలైన
నిన్నుజూచి జాలిపడుట
కన్నమించి చేయున దిల
నున్నాయని తెలియుమన్న"

ఆమామిడివృక్ష మటుల
మోమోటము లేకయున్న
ఆమాటలు విన్నబాలు
డేమనుకున్నాడొగాని,

ఆబాలుని గంభీరత
ఆబాలుని మోముతీరు
వింతవింత కాంతులతో
లోనిదీక్ష చాటసాగె.

"చెట్టు నేడు నాకెంతో
గట్టిపాఠమును జెప్పెను
యిదిమాత్రము మరువ"ననుచు,
తనకు తానె చెప్పుకొనుచు,
ఎంతో గంభీరముగా
[illegible]

# కృతఘ్నతకు శాస్తి

మెహి. యుం.

ఒకరోజున చావోబారన్ పెద్ద కోలాహలంతో చంగ్‌షాన్ పర్వతాల్లోకి వేటకి బయలుదేరాడు. జాగిలాలు, ఫాల్కన్ పక్షులు, ఈటెలు, విల్లంబులు ధరించిన విలుకాండ్రు అతని పరివారము. వారట్లా వెళుతూవుండగా రోడ్డుకు కుడిప్రక్కగా అడ్డంగా నిలుచున్న తోడేలొకదాన్ని చూచాడు బారన్. వారి దృష్టిని అటువైపు ఆకర్షించడానికా అన్నట్లు అరుస్తూ అది వెనకకాళ్ల మీద వింతగానుంచుంది. దీన్ని చూచి బారన్ బాణము వదిలాడు. తోడేలైతే గాయపడింది గాని, పారిపోయింది. వేటగాళ్లు వెంటపడి తరమటం మొదలెట్టారు. మనుష్యులు, జాగిలాల అరుపుల ధ్వనితో అడవి అంతా ప్రతిధ్వనించింది. తోడేలు పారిపోవటానికి సహాయంగా వాళ్ల హడావుడికి పెద్ద దుమారం లేచింది.

ఇదేసమయంలో టంగ్ క్వ్యా అనేవాడొకడు తన పుస్తకాలు బట్టల సంచితో ఒక బలిష్టమైన గాడిదమీద ప్రయాణమయి చంగ్‌షాన్‌కు వస్తున్నాడు. ఆకాలంలో స్వార్థత్యాగానికి, తోటి మానవ సేవకి జీవితాలర్పించి పాటుబడుతూ విశేషమైన ప్రచారము గలిగిన "మాట్సెను" అనే మతశాఖకు చెందినవారిలో ఒకడు ఈ బాటసారి. వారు అమితమైన పట్టుదలతో రాజుల్ని, భూస్వాముల్ని, ప్రజల్ని సహృదయులుగా మార్చడానికి విశ్వప్రేమనుగూర్చి బోధిస్తూ తిరిగేవారు. ఇతరులకు సహాయపడటానికి, వారిని సుఖవంతులుగా చేయటానికి వారు తమ జీవితాల్ని దరిద్రదేవతకి అంకితం చేశారు. అవసరమైతే తనువులు గూడా త్యాగం చేసేవారు. అట్టి మతానికి చెందినవాడు ఈ టంగ్ క్వ్యా.

టంగ్ క్వ్యా ఆ రణగొణధ్వని అంతా విన్నాడు. వేటగాండ్రచే తీవ్రముగా తరమబడుతూ గాయపడిన తోడేలొకటి తనవేపుకు పరుగెత్తుకొని రావటం చూచాడు. ఆ జంతువు అతన్ని చూచి సహాయం కొరకై దీనంగా విలపించింది. దాని వీపునున్న బాణం చూచి టంగ్ క్వ్యా హృదయం కరుణాపూరిత మయింది.

"భయపడబోకు, నేను నీ వీపునుండి ఆ బాణంతీసివేస్తా" అన్నాడు టంగ్ క్వ్యా.

"ఓ, నువుమాట్సెనువి. చాలా మంచివాడవు. వెనుక వేటగాళ్లు తరుముకువస్తున్నారు. వాళ్లు వెళ్ళిపోయేదాకా నన్ను నీ సంచిలో దాకోనియ్యి, నా జీవితాన్ని రక్షించు. నేను యావజ్జీవితం నీకు కృతజ్ఞురాలుగా ఉంటాను." అని ఆ తోడేలు ప్రార్థించింది.

"దురదృష్టవంతురాలా! నీకీ ఆపద ఎందుకువచ్చింది? నీకు కావలసింది తెలివి. కాని అదే లోపించింది. సరే త్వరగా నా సంచీలో దూరు. కృతజ్ఞతని గురించి మాట్లాడబోకు. చేయగల్గిందేదో చేయటానికి నాకూ సంతోషంగానే వుంది!!"

మాట్సెను తన సంచిలోని వస్తువులన్నీ తీసి దాన్ని సంచిలోకుక్కటం మొదలెట్టాడు. తోడేలు బాగా ఎదిగి వుంది. కాని సంచి చిన్నది. తల ముందు పెడితే వెనుక కాళ్లూ కుచ్చుతోకా బయటవుండిపోతున్నాయి. తోకా వెనక కాళ్లూ ముందు పెడితే మెడ విరగందే తలాముందరి కాళ్లూ పట్టటం లేదు. సాధ్యమైనన్ని విధాలుగా మళ్లీమళ్లీ ప్రయత్నంచేశారు గాని లాభంలేకపోయింది.

"తొందరగా కానియ్యి, వాళ్ళు దగ్గరకు వచ్చేస్తున్నారు. కాళ్లు చేతులు కట్టిపడెయ్యి." అని అది క్రిందకు దొర్లింది. మాట్సెను దాన్ని కట్టగా కట్టాడు. అతి కష్టం మీద అతడు నొక్కుతూ సాగదీస్తూ దాన్ని సంచిలో ఇరికించి గాడిదమీద పడేశాడు. కాని అతనికి ఆశ్చర్యంవేసింది. సంచిలోంచి రక్తపు చుక్కలు జారిపడుతున్నాయి. అదీకాకుండా అతని చేతులు, ఆ కాస్త ప్రదేశం రక్తపు చారలతో కనిపిస్తున్నాయి. అతడు త్వరగా ఆ చారలు శుభ్రంగా కప్పెట్టేసి ఆ గాడిదని అక్కడ



చుట్టూతా త్రిప్పి సంచి కనబడకుండా చాటున నించోపెట్టాడు. బారన్ తన అనుచరులతో వచ్చాడు. తోడేలేదైనా కనబడిందా అని మాట్సినుని అడిగాడు.

"లేదు, అది వట్టి జిత్తులమారి జంతువు. ఇక్కడకు రాదు. అడవిలో ఎక్కడన్నా దాక్కునివుంటుంది." అని రోడ్డుప్రక్కగా నుంచుని ఏమీ ఎరగనట్టు జవాబిచ్చేడు. బారన్ మాట్సినువంక కోపంగాచూచాడు. "ఎవరైనా సరే అది తప్పించుకుపోవటానికి సహాయంచేస్తే దానికి తగ్గఫలం వాడు అనుభవించాల్సివుంటుం"దంటూ బారన్ చేతిలో కత్తి ఝుళిపిస్తూ అన్నాడు.

వేటగాళ్ళ గుర్రాల పదధ్వని దూరాన గాలిలో కలసిపోవటం విన్న తోడేలు "మాట్సిన్, త్వరరగా నన్ను బయటికితియ్యి. నాకేం ఊపిరాడటంలేదు." అని సంచిలోంచి అరిచింది. వెంటనే టంగ్ క్వ్యా గాడిదమీాదనుంచి దిగి సంచిలోంచి తోడేలును తీసి దాని కట్లువిప్పదీశాడు. దాని గాయాన్ని సాదరంగా నిమురుతూ" ఇంకా బాధగా వుందా."అని అడిగాడు.

"అబ్బే, లేదు కొద్దిగా చీరుకపోయింది. నా ప్రాణాన్ని రక్షించావు. ఇంకోసహాయంకూడా చేసిపెడతావా?

"నా శక్తికిమించనిది— ఏదైనా చేయడానికి నాకు సంతోషమే. నీకు తెలుసుగా, మేము మాట్సీనులము. ఈ ప్రపంచాన్ని రక్షించగలిగేది ప్రేమసూత్ర మొక్కటే. నీకు నేనేం సహాయంచెయ్యాలో చెప్పు? చేస్తాను.

"మంచిది, నాకు ఆకలి మండిపోతోంది" అంది అతనివంక ప్రక్కచూపులు చూస్తూ.

"అవును?"

"మూడురోజుల్నించీ తింటానికి ఏమీ దొరకలేదు. నీవు తలచుకుంటే నిజంగా నన్ను రక్షించగలవు. నేను గనక ఇపుడు చచ్చిపోతే నా ప్రాణాన్ని వృథాగా రక్షించిన వాడవవుతావ్. నిన్నెందుకు తిననియ్యవ్? కొద్దిగా స్వార్థత్యాగం చెయ్యి. నీకు తెలుసుగా అంతకన్నా ఎక్కువ ఏమీ అడగటంలేదు"

టంగ్ క్వ్యాకు ఎక్కడలేని భయంవచ్చింది. గజగజ వణికిపోతున్నాడు. తోడేలు కోరలు చాచి అతనిమీాదికి దూకింది. వెంటనే అతడు ప్రాణభీతితో గాడిద రెండో ప్రక్కకు పరుగెత్తాడు.

"వద్దు, చంపవద్దు, నన్ను చంప

# ★ కృతఘ్నతకు శాస్తి ★

లేవు." అని అతడు అరిచాడు.

"ఎందుకని?"

"వద్దు, చంపవద్దు—నేను నీ ప్రాణాన్ని రక్షించాను."

ఒకరి నొకరు తరుముకుంటూ గాడిదచుట్టూ తిరగటం మొదలెట్టారు. గాడిదకిదంతా అగమ్యగోచరంగా వుంది.

"ఇదిగో నువ్వు సరిగ్గా ప్రవర్తించు. మనం ఇట్లా వాదాలుపడి ఆఖరుకు ఏదో ఒకటి బలవంతంగా చెయ్యటానికి ప్రయత్నించడం బాగా లేదు. ఆఖరుకు నువ్వు నన్ను చీల్చుకుతిన్నా సరే. నువ్వు చేసేపని మంచిదని తోచడంలా నీకు. తర్వాత నీ అంతరాత్మ నిన్ను బాధిస్తుంది. అవునా? నన్ను తినేటపుడు నువ్వు మంచిపని చేస్తున్నావో చెడ్డపని చేస్తున్నావో తెలుసుకోవాలని లేదూ?" అంటూ మాట్సెను గాడిద భుజాలమీదనుంచి తోడేలు నుద్దేశించి అన్నాడు.

"అయితే, నా కిపుడు ఆకలిగా వుంది. నీ వాదనతో నా తల దిమ్మెక్కిపోతోంది" అందితోడేలు రుసరుస లాడుతూ.

అయితే మరి మన వివాదం న్యాయ సమ్మతంగా పరిష్కారం చేసుకుందాం. ఆచారం ప్రకారం ముగ్గురి పెద్దల నడుగుదాం. నేను నీ ప్రాణాన్ని రక్షించాను. అందుకని నన్ను తినే హక్కు నీ కుందో లేదో. చెప్పమని అడుగుదాం.

"సరి సరి అట్లానే కానియ్యి, తలకాయనొప్పిగా అంత పొడుగున చెప్పకు. దేవుడు మనుషుల్ని తోడేళ్లు తింటానికే సృష్టించాడని నా నమ్మకం. మీ జాతి కన్నా మా జాతి చాలా వుత్తమమైంది. నీవు పతితుడవు. నీ ప్రాణాల్ని రక్షించుకోలేవు" అంది తోడేలు.

వారు రోడ్డువెంబడే బయలుదేరారు. చీకటిపడుతోంది కాని ఎవరూ కనబడలేదు.

"ఇదిగో నాకు చాలా ఆకలిగా వుంది. నే నేమాత్రం ఆగలేను. అంది తోడేలు. ప్రక్కనున్న ఒక జీర్ణవృక్షాన్ని చూపుతూ,

"పద వాణ్ణి అడుగుదాం"అంది.

"ఏమిటి ఈ చెట్టునా? వాడికేం తెలుసు?

"అడుగు, వాడే చెపుతాడు."

మాట్సెను వినయంగా చెట్టుకు వంగి నమస్కరించి, తన ప్రాణాన్ని కూడా లెక్కచెయ్యకుండా తను ఆ జంతువును ఎట్లా రక్షించిందీ నివేదించాడు. రక్షించిన నన్ను భక్షించటం న్యాయసమ్మతమో లేక కృతజ్ఞత తెలుపవలసిన విధమో విచారించండి" అన్నాడు.

బజేమనే ధ్వనితో పెద్దగా చెట్లోంచి ఒక స్వరం వినవచ్చింది. "విన్నాను స్వామీ, విన్నాను. మీరు చెప్పిందంతా అర్థమయ్యింది. మీరు కృతజ్ఞతనిగూర్చి మాట్లాడుతున్నారు. ముందు నా కథవినండి. నేనో ఏప్రికాట్ వృక్షాన్ని. తోటమాలి నాకు జీవంపోసినపుడు నేనో విత్తును మాత్రమే. సంవత్సరంలో పుష్పించాను. మరి మూడేళ్ళలో కాయలు కాశాను. అయిదేళ్లలో నా ప్రమాను చేతి లావయ్యింది. పదేళ్లలో చిన్న పిల్లవాడి పొట్టంత అయ్యింది. ఇపుడు నా వయస్సు రెండుదశాబ్దాలు. నా జీవితమంతా నా పళ్లతో తోటమాలిని అతని కుటుంబాన్ని పోషించాను. అతని స్నేహితుల్ని కూడా మేపాను. ఆఖరుకు నా పళ్లను మార్కెట్ కు తీసుకువెళ్ళి అమ్మి లాభంగడించాడు. నే నిపుడు వృద్ధుడ్నయ్యాను. ఇంక ఫలాలు ఇవ్వలేనని తెల్సుకున్నాడు. ఆకులన్నీ దులిపేశాడు. నా కొమ్మలు విరిచాడు. రంపంతో కోసి పొయ్యిలోకి వుపయోగించుకున్నాడు. అంతటితో సంతృప్తి పడలేదు. ముక్కలుగా కొట్టి చిత్రిక పడటానికి నన్ను కలపగా అమ్మేతాడని విన్నాను. మానవులు మా కొరకు సృజించిన జీవితమంటే ఇది. అటువంటపుడు నిన్ని తోడేలు ఎందుకు తినకూడదు." అని చెట్టు తీర్పుఇచ్చింది.

"న్యాయదేవత మాట్లాడుతోంది" అని మహదానందంతో తోడేలు టాంగ్ క్యూ మీద కురకబోయింది.

"ఒక్క నిముషం ఆగు. ఇంకా మనం ఇద్దరితీర్పు వినాలి" అన్నాడు టంగ్ క్యూ.

"నువ్వు చెప్పినట్లే కానియ్యి. ఇదివరకటికంటే ఎంత మంచి వాసన వేస్తున్నావని చెప్పను" అని తోడేలు గుటకలు మింగుతూ అంది.

వా రల్లా కొంతదూరం పోగానే జీవితమంటే విరక్తిచెందినట్టు కన

బడుతున్న ఒక దున్నపోతు కంచె కెదురుగా నిలబడి కన్పించింది.

"వీడిని అడుగు-చూస్తోంటే జీవితంలో చాలా ఢక్కా మొక్కీలు తిన్న ఘటంలా కనుపిస్తోంది" అంది తోడేలు.

మళ్లీ మాట్సేను జరిగినదంతా నివేదించి న్యాయమైన తీర్పు చెప్పమన్నాడు. దున్నపోతు అతని వంక నీరసంగా చూచింది. అతనికి మనసులో నిరాశాభావం జనించింది. కాసేపు ఆలోచించి చెప్పటం మొదలెట్టింది "మంచిది. వృద్ధుడైన ఆ ఏప్రికాట్ వృక్షం చెప్పిందేదో అది సబబైనదే. చూడు నా వంక—వృద్ధాప్యం వచ్చింది, బక్క చిక్కి చావుకు సిద్ధంగావున్నాను. నన్ను నీవు నా యవ్వనంలో చూచివుండవలసింది. సంతలో నన్నొక రైతు తన పొలం పని చెయ్యటానికి కొన్నాడు. మిగిలినవన్నీ ముసలివై పోతున్నాయి. నేనే ఎక్కువగా కష్టపడి పనిచేసేవాడిని. నేనంటే తన కెంతో ఇష్టమని చెప్పేవాడు మా యజమాని. బీడు వారిన తనభూమినిదున్ని సాగుకు పనికివచ్చేటట్లు చేసేవాడిని. ఊడ్పులపుడు బురదలో తెగతిరిగే వాడిని. కోతలపుడు మిల్లులో పని చేసేవాడీని. ఎపుడూ ఖాళీగాకూచోలేదు. ఒక్కడినే ఇద్దరు ముగ్గురి పని చేసేవాడిని. నా శ్రమ ఫలితంగా రైతు సుఖజీవనంగడిపేవాడు. అతని తిండీ, గుడ్డా—అతను సంపాదించిన ప్రతిదైనా నానుండి వచ్చినవే. వడ్లకొట్టుకు క్రొత్తగా చేర్చి ఇంకొక ఇల్లేశాడు. కొడుక్కి పెళ్ళిచేశాడు. ఇపుడు పెద్ద భూస్వామిలా చుట్టూ పిల్లాజెల్లతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. నేను ఇక్కడకు వచ్చినపుడు చూడవలసింది అతని స్థితి. మట్టిపాత్రలు, మూకుళ్ల



రినాసిరస్

ఫొటో: డి. రామలింగేశ్వరరావు,—మద్రాసు.

# ★ కృతఘ్నుతకు శాస్తి ★

లోను తిసేవాళ్లు తిండి. ఇపుడు శుభ్రమైన జాడీలలో సారా ఎపుడూ అతని నేలమాళిగలో జాగ్రత్త చేయబడి వుంటుంది. నేను రైతు కుటుంబానికి చెయ్యంది మాత్రం నువ్వేంచేశావు ఈ తోడేలు కి? రైతుభార్య నిరుపయోగమని తలుస్తోందినన్ను. ముసలితనం కారణం చేత, చలికి గాలికి బాధపడుతూ నేను బయటవుండ వలసిందే. చూస్తున్నావుగా, ఇక్కడ ఎండలో వెచ్చదనానికి నించున్నాను. చీకటి పడితే ఏకాకిని. నాకేమి విచారంలేదు. ప్రతివారు ఎప్పుడో ఒకప్పుడు ముసలివారవక తప్పదు. కాని నన్ను మా యజమానురాలు కసాయివాడికి అమ్మదలచినదని విన్నాను. జీవితమంటే ఇదే! కృతజ్ఞతని గూర్చి మాట్లాడ బోకు. ఈ తోడేలు నిన్నెందుకు భక్షించ కూడదో చూద్దామంటే ఒక చిన్న కారణంకూడా కనబడటం లేదు." ఇదీ ఆ దున్నపోతు తీర్పు.

తోడేలు మళ్లీ మొదట్లాగే చెయ్యబోయింది. కాని టంగ్ క్యూ "అపుడే కాదు. ఆగినదానివి ఇంత సేపూ ఎట్లానూ ఆగావు. మనవరతు ప్రకారం మూడో వాడుకూడా ఏం చెపుతాడో విందాం" అన్నాడు.

అంతలో వారు కర్ర ఊతగా నడచి వస్తున్న ఒక వృద్ధుడ్ని చూచారు. అతని పొడుగాటి గడ్డం చూస్తే అతనెవరో సన్యాసిలాగున్నాడు. ఆఖరుకు ఒకమానవుడ్ని చూడ గలిగినందుకు టంగ్ క్యూ హృదయం ఆనందంతో నిండి పోయింది. ఆముసలి వాని దగ్గరకు పరుగెత్తు కొనిపోయి వారి వివాదాన్ని పరిష్కరించ వలసిందిగా కోరాడు. "నీ నోటి వెంబడి ఒక్క మాట నన్ను రక్షిస్తుంది, బాబాయి" అని దీనంగా ప్రార్థించాడు.

ఆ వృద్ధుడు వారి కథనంతా విన్నాడు.

"ఏమిటి, ప్రతిఫలం కృతఘ్నతా! ఈ మాట్సీనుకు నువ్వు చేసినదానికి ప్రతిఫలం పొందక పోవు. అమానుషంగా నిర్దయగా నీ పట్లప్రవర్తించే కుమారుడొకడు నీకో రోజున కలుగుతాడు. కృతఘ్నుడికి వృద్ధాప్యంలో కృతఘ్నుడైన కొడుకే తగిన బహుమానం ఫో ఇక్కడ్నించి. లేకపోతే చంపుతా" అంటూ ఆవృద్ధుడు తీక్షణంగా దాని వంక చూస్తూ అన్నాడు.

"కాని తమరునాకథను వినలేదు." అని వాదించిందా జంతువు. "వినండి, ఈమాట్సీను నన్ను కాళ్లు చేతులు కట్టి ఊపిరాడకుండా ఆ సంచిలో కుక్కాడు. చస్తానేమో అనుకున్నాను. ఆ సంచిలో ఎంత యాతన అనుభవించినానో ఆలోచించారా?" అంది.

"అట్లాగా, అయితే ఇతడు కూడా నిందాపాత్రుడే" అన్నాడా సన్యాసి. సమస్యమళ్లీ తిరిగి మొదట కొచ్చింది.

"ఎవర్ని నమ్మాలో వినాలో కూడా తెలియటంలేదు నాకు. నువ్వేమో తోడేల్ని రక్షించానని చెపుతున్నావు. తోడేలేమో తన్ను బాధించావని చెపుతోంది. ఎవరిది తప్పో ఎవరిది రైటో నిర్ణయించాలంటే ఒకటే మార్గం కనబడుతోంది. ప్రత్యక్షంగా జరిగింది చూడటమే! నిన్నతడు సంచిలో ఎంత బాధపెట్టాడో చూడాలినేను!" అన్నాడు. "చూడు" అంటూ తోడేలు తన కాళ్లు శరీరంకట్టబడటానికి వప్పుకొంది. మాట్సీను దానిని సంచిలో కుక్కాడు.

"నీదగ్గర పదునైన బాకుందా" అని నెమ్మదిగా అడిగాడు సన్యాసి.

"ఆ" అన్నాడు టంగ్ క్యూ విభ్రాంతుడై.

"మంచిది?"

"నన్ను తోడేలుని చంపమని అంటం లేదుగదా! అవునా!

"నీయిష్టం, చంపినానసరే, చచ్చినాసరే— ఏమి నీతిపరుడివిరా నా తండ్రీ" అని సన్యాసి నవ్వుతూ అన్నాడు. అట్లా అంటూనే సంచిలోని తోడేలులోకి కత్తిని దింపటానికై టంగ్ క్యూకు సహాయం చేశాడు. అంతే దాంతో పేచీ తీరిపోయింది.

(లిన్యుటాంగ్ ఇంగ్లీషులోకి అనువదించిన చైనీస్ కథకు మొ. యుగంధర చౌదరి అనువాదం) ★

---




## జరిగిన కథ

[మా నాన్నగారు—మష్యూ ఐసెట్టీ—లాన్‌గ్యుడాక్‌లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అవీ వుండేవి. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయతూ మా కుటుంబాన్ని ఏదో ఒక ఆపద చుట్టు ముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారిస్థితి పూర్తిగా చితికి పోయింది. కొంతకాలానికి మా నాన్నగారు దివాలా తీసి మా ఫ్యాక్టరీని అమ్మేశారు. మేము మా స్వస్థలం విడిచిపెట్టి లయన్స్ పట్టణానికి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ తరువాత కొంతకాలానికే మానాన్నగారు వ్యాపారంలో మళ్లా దెబ్బతిన్నారు. మా సంసారం రెండోసారి చితికి పోయింది. ఉన్న నలుగురం విడిపోవలసి వచ్చింది. మా అమ్మని పుట్టింటికి పంపేశాం. జాక్‌ని లయన్స్‌లోనే ఒకకొట్లో గుమాస్తాగా చేర్చారు మానాన్న. తను సారా వుత్పత్తిదార్ల సంఘంతరఫున ఒక వుద్యోగం సంపాదించుకొన్నారు. నన్ను తనదగ్గరకు పంపితే దాక్షిణాత్య విశ్వవిద్యాలయంలో 'అషర్' వుద్యోగం యిప్పిస్తానని మానాన్నగారి స్నేహితుడైన 'రెక్టర్' జాబు రాశాడు. తక్షణం బయలుదేరి అవూరు వెళ్లాను. ఆయన సిఫార్సు మూలంగా సర్లాన్‌డీ కాలేజీలో 'అషర్' గాచేరాను. మొదట్లో జూనియర్ తరగతిలో పనిచేశాను. తరువాత కొంతకాలానికి నన్ను ఇంటర్‌మీడియెట్ క్లాసుకి మార్చారు. ఆ వేసవి శెలవుల్లో కూడా నేను అక్కడే వుండి డిగ్రీల కోసం చదువుతున్నాను. ఇంతలో జబ్బు చేసింది. ఆస్పత్రిలో వుండగా, నేను అంతకుముందు మనస్సులో మోహించిన 'నీలోత్పలాక్షి' నాకు పరిచర్యలు చేయటానికి వచ్చినట్లే వచ్చి, అకస్మాత్తుగా అంతర్థానమైపోయింది.

నాలో అన్ని ఆశలు రేపిన నీలోత్పలాక్షి అంతర్థానమైపోయింది. ఒకచెంప అందుకే ఏడుస్తుంటే, అది చాలదన్నట్లు కాలేజి సెలవులు కూడా ఐపోయాయి. ఆరువారాలతరువాత మంచం వదిలిపెట్టి బయట కాలు పెట్టాను. కాలేజి అప్పుడప్పుడే బద్ధకంగా నిద్దర లేస్తున్నట్లుంది. గదులు, హాళ్లూ అన్నీ నీళ్లుపోసి శుభ్రంగా కడుగుతున్నారు. వియటో గారు తాళం చెవులు ఆడించుకొంటూ హడావుడిగా తిరుగుతున్నారు.

ప్రతిరోజూ బగ్గీల్లోనూ బళ్ళల్లోనూ కాలేజీ విద్యార్థులు పెట్టే బేడాతో వస్తున్నారు. పాత ముఖాలు కొన్ని పోయి, కొత్త ముఖాలు మరికొన్ని వచ్చాయి. క్లాసుల విభజన జరిగింది. నిరుడులాగే యీ ఏడాది కూడా నాకు ఇంటర్‌మీడియెట్ క్లాసే అప్పగించారు. ఆవార్త తెలియగానే, నిరుటి అనుభవాలు తలుచుకొని హడలిపోయాను. ఐనా ఈ ఏడాదివచ్చే పిల్లలు నిరుటిపిల్లలంత దుష్టులు కాకపోవచ్చు. ఏమో— ఎవరు చెప్పగలరు?

కాలేజీ ప్రారంభదినాన చర్చిలో పాటలూ, ప్రార్థనలూ జరిగాయి. ప్రిన్సిపాలూ, ప్రొఫెసర్లూ అందరూ వచ్చారు. నేనుమాత్రం వాళ్లకి దూరంగా విద్యార్థుల గుంపులతో కలిసి నిలబడ్డాను. అక్కడ వున్నంతసేపు ప్రొఫెసర్ల హోదాలు, వాళ్ళగౌన్లు చూసి చాలా ఈర్ష్యపడ్డాను. నేను ఏనాటికి ప్రొఫెసర్ నౌతాను? ఏనాటికి నావారందరికీ తగిన ఆశ్రయం కల్పించగలుగుతాను?...ఆరోజు వచ్చేలోగా యింకా ఎన్ని బాధలు పడాలోకదా?

అనువాదం: విశ్వాత్ముల నరసింహమూర్తి



# అన్నా-చిన్నా



నా మనస్సులో ముసురుకొంటున్న విచార భావాలను విపులీకరిస్తోందా అన్నట్లు అవతల వాయిస్తున్న 'ఆర్గన్'లోనుంచి విషాదసంగీతం వినిపిస్తోంది. అది వింటుంటే నాకు ఆవురు మని ఏడవాలనిపించింది. అంతలో ఎదురుగుండా దూరాన వున్న వ్యక్తి ఎవరో నావంకచూస్తూ స్నేహపాత్రమైన చిరునవ్వు నవ్వుతున్నట్లు తోచింది. పరీక్షగా చూశాను. మరెవరో కాదు—ఫాదర్ జెర్మేన్! ఆ క్షణంలో ఆయన చేసిన మందహాసం నా మనస్సు నెంతో ఉత్తేజ పరిచింది.

దాంతరువాత రెండు రోజులకి 'ప్రిన్సిపాల్ డే.' ఆరోజున ప్రిన్సిపాల్‌గారి అధ్వర్యాన కాలేజి ప్రొఫెసర్లు విద్యార్థులు అంతా కలిసి వూరికి దూరంగా వున్న మైదానంమీదకి పోయి, ఆరుబయట విందు ఆరగిస్తారు. ఇది అనాదిగా వస్తున్న ఆచారం.

తెల్లవారుఝామునే ఉపాధ్యాయులూ విద్యార్థులూ అంతా బళ్లల్లో బయలుదేరారు. తినుబండారాలు, పానీయాలు వెనక రెండు బళ్ళనిండా వస్తున్నాయి. ముందున్న బండిలో కాలేజీ పెద్దలు, బాండ్ వాయించే కుర్రాళ్ళూ కూర్చున్నారు. బాండ్ మహాజోరుగా మోగుతోంది. ఊళ్ళో జనమంతా యీ హడావుడికి లేచి వీధుల్లోకి వచ్చి చూస్తూ నిలుచుండిపోయారు.

బళ్లన్నీ మైదానానికి చేరగానే, పచ్చగడ్డిమీద తెల్లటి దుప్పట్లూ అవీ పరిచేశారు. అంతంత పెద్ద ప్రొఫెసర్లు కటికి నేలమీద కూలబడుతూ వుండటం చూసి విద్యార్థులు పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుకొన్నారు. వడ్డన ప్రారంభమైంది. సీసాల బిరడాలు పేలిపోతున్నాయి. అందరూ యిలా సంతోషంలో మునిగి తేలుతుండగా నేనొక్కణ్ణే దిగాలుపడి ఒకమూలను కూర్చుని వున్నాను ఇంతలో ప్రిన్సిపాలుగారు చేతిలో ఏదో కాగితం పట్టుకొని కూర్చున్నచోట నుంచి లేచారు.

"సోదరులారా! అజ్ఞాత కవి ఒకరు నాకిప్పుడే కొన్ని పద్యాలు పంపించారు. గడచిన సంవత్సరాల్లో ఏకచ్ఛత్రాధిపత్యంగా పద్యాలు అల్లి మిమ్మలను ప్రబోధించిన ఎం. వియట్‌గారి కీసంవత్సరం ఒక ప్రత్యర్థి తయారైనాడన్న మాట. ఇప్పుడువచ్చిన యీ పద్యాలు నన్ను మరీ శ్లాఘించేవిగా వున్నప్పటికీ, మీరందరూ అనుమతిస్తే బిగ్గరగా చదువుతాను."

"చదవండి...చదవండి...చదవండి."

బహుమతి ప్రదానోత్సవాలకి పనికివచ్చే మాంచి బొంగురుగొంతుకతో ప్రిన్సిపాలు పద్యాలు బిగ్గరగా చదివారు.

ఆ పద్యాల్లో కాలేజికి సంబంధించిన ప్రతి వ్యక్తికీ—ప్రిన్సిపాలు మొదలుకొని కళ్లద్దాల రాకాసి వరకు, అందరికీ—తలా ఒక స్తుతివాక్యమూ అంకితం చేయబడింది.

పద్యాలు చదవటం పూర్తికాగానే సభ్యులు చాలాసేపు కరతాళధ్వనులు చేశారు. కవి ఎవరైందీ సభవారికి తెలిపిడి కావాలని పట్టుపట్టారు. 'డింభకాథముడ'నైన నేను వొణుకుతూ వొణుకుతూ పైకి లేచాను. నన్ను చూడగానే సభలో మరొకసారి హర్షధ్వానాలు చెలరేగాయి. నేను చెడ్డసిగ్గుపడిపోతున్నాను. ప్రిన్సిపాల్ నన్ను కావిలించుకున్నంత పనిచేశాడు. ప్రొఫెసర్లంతా నాతోగాఢంగా కరస్పర్శ చేశారు. రెండోతరగతిమాస్టరు ఆపద్యాలు తనకి స్తే పేపర్లో అచ్చు వేయిస్తానన్నాడు. అంతకుముందు విందులో తాగినసారా నిషాతోపాటు యీ పొగడ్తల మైకంకూడా నా తలకెక్కింది. అంతటి ఆనందమయఘట్టంలోనూ ఎబ్బే జెర్మేన్ నన్ను వుద్దేశించి 'ఇడియెట్!' అని తిట్టుకొని నామీద విసుక్కుంటున్నట్లు వినిపించింది. ఇంకోవంక వియట్‌గారి తాళంచెవులు కసిగా పళ్లు పటపట కొరికిన చప్పుళ్లు చేస్తువేవున్నాయి. ఈ రెండు సంఘటనల మూలంగా నా తలబిరుసు కొంచెం తగ్గింది.

సభలో వెల్లువలా వచ్చిన వుత్సాహం కొంచెం సర్దుకొన్నకూడదట ప్రిన్సిపాల్‌గారు లేచి 'సైలెన్స్' అని చప్పట్లు చరిచాడు:

"ఎం. వియట్! ఇప్పుడు మీవంతు. ఇలావచ్చి గంభీరమైన మీ కవిత వినిపించండి."

వియట్ గంభీరంగా కోటుజేబులోంచి లావుపాటి పుస్తకం ఒకటి బయటికి తీశాడు. పుస్తకం లావు

బట్టి చూస్తే ఆయన కవిత యెంత గంభీరతరంగా వుండబోతుందో ననిపించింది. ఎక్కడో మూల ఒదిగి కూర్చున్న నావంక ఓరచూపులు చూస్తూ, తను రాసిన పద్యాలు చదవటం ఆరంభించాడు.

కాలేజీలలో కట్టుబాట్లు ఎంత ఘనమైనవో వినుతించటమే ఆయనగారి మహాకావ్యంయొక్క పరమాశయం. దాన్ని ఆయన సంభాషణాపరమైన పద్యకావ్యంగా రాశాడు. కట్టుబాట్లు అవీ జోరుగా అమలులో వున్న ఒకానొక కాలేజీ విద్యార్థి 'మెనాల్కస్' అనేవాడూ, ఏ కట్టుబాట్లూ చట్టుబండలూ లేని మరొక కాలేజిలోని విద్యార్థి 'డోరిలాస్' ఒకచోట సమావేశమై 'కట్టుబాట్లు వుండటం మంచిదా, కాదా' అనే విషయమై సుదీర్ఘంగా చర్చించుకొంటారు. చివరికి కట్టుబాట్లు వుండటమే ఘనమని యిద్దరూ తీర్మానిస్తారు. ఇదీ—ఆయన కావ్యానికిగల యితివృత్తం.

కావ్యం చదవటం ఐపోయింది...కాని సభలో ఎక్కడా సంచలనం లేదు. ఆయన పద్యాలు చదువుతున్న సమయంలోనే విద్యార్థులంతా ఫలహారపు పళ్ళేలు దూరంగా పట్టుకుపోయి మైదానానికి ఆచివర కొందరు, యీచివర కొందరు కూర్చుని కడుపునిండా తింటున్నారు. అలా దూరంగాపోయిన వాళ్ళవంక చేదుగా చూసి చిరునవ్వు నవ్వుతున్నాడు వియట్. ప్రొఫెసర్లు మొదట కూర్చున్నచోటనే చివరిదాకా కూర్చున్నారు కాని, యీయన పద్యాలను మెచ్చుకోవటానికి ఎవరికీ దమ్ములు లేకపోయినాయి. పాపం—వియట్‌గారిది ఆ రోజు ఘోర పరాజయం. అక్కడికీ ఆయన్ని బుజ్జగించాలని "ఇతివృత్తం చాలా మామూలైంది. అయినా, వియట్‌గారు కాబట్టి అంత మామూలు విషయంమీద అంత మంచి పద్యాలు రాశారు!" అని ప్రిన్సిపాల్ మెచ్చుకొన్నారు.

"అవును. నాకూ అలాగే అనిపిస్తోంది. పద్యాలు కమ్మగా వున్నాయి." అన్నాను నేను. అప్పటికే నాకు వియట్‌గారిమీద అప్రయత్నంగా వచ్చిన విజయానికి విచారంగావుంది.

ఒట్టిమాటలతో వియట్‌గారు వూరుకోలేదు. దానికి ఆయన ఏమీ సమాధానం చెప్పలేదు. తల నేలకివంచి, విషపునవ్వు ఒకటి నవ్వాడు. ఆరోజు రోజంతా ఆయన మొఖంమీద అదేనవ్వు తాండవమాడుతోంది. విందూ వగైరా ముగిసి ప్రొద్దు గ్రుంకాక అందరమూ బళ్ళలో తిరిగి వస్తున్నప్పుడు కూడా బండి చక్రాలుచేసే చప్పుళ్లతోపాటు వియట్‌గారితాళంచెవులు నన్నే వుద్దేశించి "ఈవేళ కాకపోయినా ఏనాటికైనా నీమీద పగ తీర్చుకోలేకపోతానా?" అనినామీద సవాలు చేస్తున్నట్లే అనిపించింది.

## 10. 'బౌక్యారస్' గొడవ

చాలాకాలంగా పనిచేయని గడియారానికి 'కీ'యిస్తే, అందులోని చక్రాలూ మరలూ అవి చాలా అయిష్టంగా తిరుగుతున్నట్లు పనిచేస్తాయి. రెండు నెలల సెలవులు తరువాత కాలేజికూడా అలాగే మందకొడిగా పనిచేస్తోంది. అయితేఏం? — అందరిమత్తూ వదలగొట్టటానికి వియట్‌గారున్నాడు. ఆయనగారి ప్రత్యక్షపర్యవేక్షణలో కాలేజిలో క్రమేపి కట్టుబాట్లూ నియమనిబంధనలు పూర్తిగా అమలులోకి వచ్చేశాయి.

నాకూ, నా క్లాసు విద్యార్థులకీ యీఏడుకూడా బొత్తిగా పడటంలేదు. ఈ ఏడు యింటర్‌మిడియెట్ క్లాసుకొచ్చిన కుర్రాళ్లు నిరుటి కుర్రాళ్లకంటె మరింతకరుకుగానూ బండతనంగానూ అవుపిస్తున్నారు, నా కంటికి. ఇటీవలనే జబ్బుపడి లేవటంతో నాకూ బక్కకోపం ఎక్కువైంది; ఏదీ సహించలేకపోతున్నాను. నిరుడు అంత గోవులా వున్నవాణ్ణి, యీ ఏడు చీటికిమాటికి చిటపటలాడుతూ సింహంలా వుంటున్నాను. క్లాసులో ఏ కాస్త తప్పు చేసినా అందరికీ కఠినమైన శిక్షలు వేయటం మొదలుపెట్టాను. ఆ పద్ధతినైతే వీళ్లను బాగా అణిచిపెట్టి వుంచగలననుకొన్నాను.

కాని అదేం పనిచేయలేదు. నేను వేసిన శిక్షలు వాళ్లకి రోజురోజుకీ అలవాటై, అవి అంటే వాళ్లకేమీ భయమే లేకుండా పోయింది. చివరికొక రోజున నా పరాజయం పబ్లిక్ క్లాసులోనే బయటపడింది. క్లాసు క్లాసు అంతా నామీద తిరుగుబాటు చేసే ధోరణిలోకి వచ్చింది. ఆ తిరుగుబాటుకు తట్టుకు నిలబడటానికి నాకు సాధనసంపత్తి ఏదీ లేకుండా పోయింది.



# అన్నా - చిన్నా



ఆ దృశ్యం నాకు యిప్పటికీ కళ్లకి కట్టినట్లు కనిపిస్తోంది. అన్నివైపులనుంచీ 'గెట్ అవుట్!'... కిచ్ కిచ్...'బాబా'...'మ్యావ్...మ్యావ్' అని ఒకటే అరుపులు.

సిరాబుడ్లూ, కాగితపుబంతులూ కుప్ప తెప్పలుగా వచ్చి నాబల్లమీద పడుతున్నాయి. నాకేదో ఫిర్యాదు చేయవస్తున్నామనే నెపంతో తడవతడవకీ ఐదారుగురు కోతివెధవలు ఒక్కసారిగా నా డెస్కు మీదికి గెంతుతున్నారు.

ఏం చెయ్యటానికీ పాలుపోక, చిట్టచివరికి వియట్ గారిసహాయాన్ని అర్థించాను. అదెంత అవమానమో మీరే వూహించుకోవచ్చు!

మైదానంమీద విందు జరిగిననాటినుంచి వియట్ నామీద మరీ కక్షకట్టాడు. ఇప్పుడు నేనిటువంటి నిస్సహాయస్థితికి దిగజారిపోయి, రక్షించమని తననే వేడేసరికి ఆయన కది చాలా ఘనంగా తోచి వుండవచ్చు. తాళంచెవుల గుత్తులతో చప్పుడు చెయ్యకుండా ఆయనవచ్చి క్లాసురూములో నిల్చునేసరికల్లా,—బెకబెకమని అరిచే కప్పలమధ్యకి మట్టిబెడ్డ విసిరినట్లు,—అంతా కన్నుమూసి తెరిచేలోగా ఎవడి సీటులో వాడు మొఖానికి పుస్తకం అడ్డం పెట్టుకొని గుట్టు చప్పుడు కాకుండా కూర్చుండిపోయారు. కొద్ది క్షణాలసేపు వియట్ గారు విజయగర్వంతో తాళం చెవులు చప్పుడుచేసుకొంటూ గదిలో అటూ యిటూ పచారుచేసి, వ్యంగ్యార్థాలు స్ఫురించే చూపు ఒకటి నావంకకుచూసి, ఒక్కమాట అయినా మాట్లాడకుండా బయటకు వెళ్లిపోయాడు.

నాకు తల తీసేసినట్లు అయింది. నా సహోద్యోగులంతా నన్నుచూసి నవ్వటం మొదలుపెట్టారు. ప్రిన్సిపాల్ గారిని కలుసుకొన్నప్పుడు ఆయన నన్ను చాలా న్యూనపరిచాడు. ఇదికూడా వియట్ గారి చలవే అయివుంటుంది: సందేహం లేదు. అదేమి యిదేమని — అన్నిటికంటే మిన్నగా జరిగింది ఆ 'బాక్యారన్' గొడవ.

ఆ సంఘటననుగురించి వివరణ యీనాటికీ 'నర్లానడీ' కాలేజి రికార్డుల్లో బహుశః భద్రంగా దాచివుంటారు. ఆవూరివాళ్లు యిప్పటికీ ఆవిషయాన్ని గురించి మాట్లాడుతున్నా మాట్లాడుతూ వుండవచ్చు. నేనూ దాన్నిగురించే మాట్లాడుతాను...ఇప్పటికైనా అందులోని నిజానిజాలు నలుగురికీ తెలియటం మంచిది.

. సెదెన్నిస్ ప్రాంతంలోని జమీందారీ కుటుంబాల పక్షాన ప్రతినిధిగా మా కాలేజి ఇంటర్ మీడియెట్ క్లాసులో 'మార్క్వెస్ బాక్యారన్' ఒకడుండేవాడు. వాడంటే కాలేజీలో అందరికీ హడల్. వయస్సు పదిహేనుసంవత్సరాలకు మించి వుండదు. పెద్దపెద్ద పాదాలూ, చేతులూ, పత్తికాయల్లాంటి కళ్ళూ—అదీ వాడి అవతారం. దానికి తగ్గట్టు వాడికసలు నుదుర్ఘంటూ ఏమీ లేదు. అటువంటి గొప్ప కుటుంబంలో పుట్టిన కుర్రాడొకడు తన కాలేజిలో వుంటే కాలేజి కేదో ఘనత వస్తుందన్న భ్రమలోపడి ప్రిన్సిపాల్ వాణ్ణి చాలా ఘనంగా చూసేవాడు. మిగిలినవాళ్ల సంగతి చెప్పనే అక్కరలేదు. అందరూ వాడిపేరు వింటేనే హడిలిపోతున్నట్లు నటించేవాళ్లు. వాణ్ణిగురించి మాట్లాడవలసివస్తే మహాగౌరవంగా 'మార్క్వెస్'గారు అని మాత్రం అంటుండేవాళ్లు. నేనూ మొదట్లో అందరిలాగే వాడంటే లేనిపోని గౌరవం కనపరిచేవాణ్ణి.

ఆవిధంగా కొద్దిరోజులు గడిచాయి.

అప్పుడుకూడా ఆ జమీందారు బిడ్డ నావంక అసహ్యంగా చూడటమూ, అడిగినదానికి తలబిరుసు సమాధానాలు చెప్తూ వుండటమూ చేస్తుండేవాడు. ఏంచేసినాసరే మనకెందుకులే అన్నట్లు వూరుకొనేవాణ్ణి.

కాని ఒకరోజు క్లాసు పిల్లలందరిముందూ నన్ను పట్టుకొని కించపరచాలని అతి తలబిరుసుగా మాట్లాడాడు—ఇంక భరించలేకపోయాను.

అక్కడికీ వచ్చిన ఆవేశాన్నంతటినీ అణిచేసుకొని, మర్యాద చెడకుండా "జమీందారుగారూ! తమరు పుస్తకాలూ అవీ సర్దుకొని తక్షణం బయటకు నడుస్తారా?" అని అడిగాను.

అతఃపూర్వం వాణ్ణి క్లాసులోనుంచి బయటకు పొమ్మన్నవాళ్లు ఎవరూ లేరు. లోపల ఆశ్చర్యపడు

తున్నా వాడుపైకిమాత్రం అదేమీ కనపడనీయకుండా కూర్చున్నచోటనుంచి కదలకుండా పత్తికాయల్లా ముందుకు పొడుచుకొచ్చినకళ్లతో నావంక కొరకొరా చూస్తూ వుండిపోయాడు.

అప్పటికే నాకు అర్థమైంది; వ్యవహారం చాలా దూరం పోయేలా వుందని. అయినా అప్పుడు వెనక్కి తగ్గటం కుదరనివిషయం.

"తక్షణం బయటికి నడుస్తారా, లేదా?" అని మళ్ళీ గద్దించి అడిగాను.

మిగిలిన పిల్లలంతా కొయ్యబారిపోయి ఏం జరుగుతుందోనని చూస్తూ వుండిపోయారు. నా క్లాసు ఇంతనిశ్శబ్దంగా వుండటం అదేప్రథమం...

అప్పటికి జమీందారిగారబ్బాయి కొంచెం తమాయించుకొన్నాడు కాబోలు—"నేను వెళ్లబోయేదిలేద"ని మహా మొండితనంగా సమాధానం చెప్పాడు.

వాడి ధైర్యసాహసాలను క్లాసులో పిల్లలంతా రహస్యంగా స్తుతించారు.

నేను వొళ్లు తెలియని కోపంలో కుర్చీలోనుంచీ ఒక్క వుదుటున లేచాను.

"వెళ్లవా? సరే; చూద్దాం!" అంటూ మెట్లు దిగాను.

నిజంగా నా కాక్షణంలో ఆ కుర్రవాడిమీద చెయ్యిచేసుకోవాలన్న వుద్దేశం ఎంతమాత్రం లేదు. ఇందుకు ఆ పరమేశ్వరు డొక్కడే సాక్షి. వాణ్ణి ఎలాగైనా హడలగొట్టి వూరుకోబెట్టుదా మనుకొన్నాను; అంతవరకే. కాని నేను మెట్లుదిగి వస్తూవుండటంచూసి వాడు మహా వెటకారంగా నవ్వటం మొదలుపెట్టాడు. దాంతో నాకు మతిపోయింది. నరానరి పోయి వాడి కాలర్ పట్టుకొని బెంచిమీదనుంచి కిందకు లాగి పారేద్దామని చెయ్యి ముందుకు చాచాను.

వాడు కోటు అడుగున ఎవరికీ కనిపించకుండా పెద్దసైజు ఇనపరూళ్లకర్ర దాచివుంచాడు. నా కా విషయం తెలియదు. నేను చెయ్యి పైకి ఎత్తీ ఎత్తగానే వాడూ, కోటుఅడుగునుంచీ ఆ రూళ్ళకర్రతీసి నా చేతిమీద గట్టిగా కొట్టాడు. బాధ భరించలేక నేను బిగ్గరగా అరిచేశాను.

ఇదంతా ఫార్సులావుంది కాబోలు; క్లాసులో పిల్లలంతా గల్లంతుగా నవ్వుతూ బిగరగా చప్పట్లు చరచటం మొదలుపెట్టారు.

"బలేపని చేశారు; మార్క్విస్; బలేపని!" అని కొందరు అంటున్నారు.

నాకు యింక వొళ్లు తెలియలేదు. ఒక్కసారిగా ఆ డెస్కుమీదికి గంతేశాను. అక్కణ్ణుంచి మార్క్విస్ మీదికి లంఘించాను. ఒకచేత్తో వాడి కంఠం గట్టిగా వాటేసుకొని, రెండోచేత్తో అందినచోటనల్లా గుద్దాను. పళ్ళతోపట్టి పీకేశాను. బెంచీకి అంటుకుపోయి కూర్చున్నవాణ్ణి బలవంతాన వూడబెరికి వుండచుట్టి క్లాసు బయటి ఖాళీ జాగాలోకి విసిరేశాను. ఇదంతా జరగటానికి రెండుమూడు సెకండ్లు అయినా పట్టిందో లేదో! నిజంగా నాకు అంతబలం వుందని నే నెన్నడూ అనుకోలేదు.

క్లాసులో పిల్లలు నిర్విణ్ణులైనారు. ఇందాక మార్క్విస్‌ని మెచ్చుకొన్నప్పటిలాగా యిప్పుడు కోతి గంతులు వేసే కలేజా ఎవడికీ లేకపోయింది. ప్రతి వెధవా బిక్కచచ్చిపోయాడు.

కోపంతో ఆ పాదమస్తకం వణికిపోతునే వచ్చి నా స్థానంలో కూర్చున్నాను. నేను లోపలికి రావటం చూడగానే ప్రతివెధవా పుస్తకంచాటున ముఖం దాచేసుకొని కుక్కిన పేనుల్లా పడివున్నారు. కొరకరాని కొయ్యలాంటి యీ కుర్రాళ్లనైతే యీ దెబ్బతో అణిచేశాను కాని, ప్రిన్సిపాలూ, వియట్ గార్లు ఏమంటారో? కాలేజి వ్యవస్థకే గర్వకారణుడైన జమీందారుబిడ్డడిపై చెయ్యిచేసుకోవటమంటే, వాళ్ళ దృష్టిలో అదెంత ఘోరమైన నేరమో? ఇలాంటి సాహసానికి నేను ఒడిగట్టానంటే వాళ్లు నన్నీ వుద్యోగంలోయిక ఒక్కక్షణమైనా వుండనిస్తారా?

"హల్లో! ఎవరండీ మాట్లాడేది?"

"ఆ! నేను హెడ్మాస్టర్ని"

"నమస్కారమండీ!" మన అబ్బాయికి యీవేళ కాస్త తలనొప్పిగా ఉంది అందుకు గాను ఈదినముమాత్రం 'లీవు' వేయించండి."

"అది సరే కానీండీ— మీ రెవరండీ మాట్లాడేది?"

"నే నాండి? మా నాయన వెంకట్రావ్ గార్ని!"

ఆర్. పి. నరశింగారావు, ఆదోని.

# గొడుగు వెల ఎంత?

వి. యస్. చెన్నూరి

ఇహ వొచ్చేది వర్షాకాలం. చేత గొడుగులేకుండా ఇల్లు వొదలడానికి లేదు. ఉన్న వొక్క గొడుగూ పాడయిపోయింది. ఎలాగయినా ఒహ గొడుగు కొనుక్కోక పోతే ముందు ముందు చాలా ఇబ్బంది పడాలిసివుంటుంది'— అని అనుకొంటూనే రోజులు గడుపుతున్నాడే కాని, పర్సులోంచి డబ్బు పైకి తీయాలంటే మనసొప్పిందికాదు రంగయ్యగారికి.

తొలకరి చినుకులు పడ్డం ప్రారంభించినై. వొహటి రెండు దఫాలు చాలా యిబ్బందిపెట్టిం తరువాతగాని, రంగయ్యగారికి తెగింపు కలిగిందికాదు. పర్సు జేబులో వేసుకుని, గబగబా బజారుకు వెళ్లాడు. బజారంతా గాలించి, ఓ దుకాణంలో, ఓ జింకమార్కు బోలుకమ్మీల గొడుగు పదిరూపాయలకి బేరంచేశాడు. ఇంతలో తనతో బాటు బేరంచెయ్యడానికి వొచ్చిన ఓ పెద్దమనిషి—'మద్రాసులో అయితే దీని ఖరీదు ఏ ఏడో—ఎనిమిదో వుంటుంది'అని చెప్పడంతో, వృథాగా రెండో మూడో అంగడివాడికి వొదులుకునేందుకు మనసొప్పలేదు రంగయ్యగారికి.

'ఎలాగూ వొచ్చే ఆదివారం నాడు మద్రాసు వెళ్లాలిసినపనుంది. అమ్మాయికి పెళ్లి. పువ్వులూ, పళ్ళూ మొదలయిన సామాన్లు పట్టుకురావాలి. ఈ వారంరోజులూ యెలాగో కళ్లుమూసుకు గడిపేస్తే, మద్రాసులోనే కొనుక్కోవచ్చు.' అనుకొన్నాడు.

అనుకున్నట్టే వారంరోజులూ గడిచిపోయినై. ఆదివారం ఉదయం బండికి మద్రాసు ప్రయాణమయ్యాడు.

రంగయ్యగారు మద్రాసులో పెళ్ళికి కావలసిన సామానంతా కొనుక్కున్న తరువాత, మరిచిపోకుండా, గొడుగులకంపెనీకి బయలుదేరాడు. చైనాబజారు, దేవరాజ మొదలివీథీ, రతన్‌బజారూ అన్నీ గాలించి, చివరికి, ఓ దుకాణంలో జింకమార్కు బోలుకమ్మీల గొడుగుని బేరంచేసి, ఎనిమిదిరూపాయలకి ఇహ సెటిల్ చేసుకోబోతాడనగా, పక్కన బేరంచేస్తున్న ఆసామీతో, అతని స్నేహితుడు—'మౌంటురోడ్డులో 'ఫలానా' షాపులో క్రిందటివారం తాను అదే గొడుగు ఏడురూపాయలకే ఖరీదు చేసినట్టు' చెబుతోండగా రంగయ్యగారి చెవినిబడింది. వెంటనే, చేతిలోనిగొడుగక్కడ పడేసి, చరచరా బస్సుస్టాపింగ్‌కు దారితీశాడు. ఇంతలో బస్సుకయితే రెండణాలిచ్చుకోవాలనీ, ట్రాముకయితే అణాన్నరతోనే పోవొచ్చుననీ, జ్ఞాపకంరాగా, గిరుక్కున వెనక్కి తిరిగి ట్రాంస్టాపింగ్‌లో నుంచున్నాడు.

ట్రాము క్రిక్కిరిసిన జనంతో—స్థూలకాయుని మల్లే రోజుకుంటూ వొచ్చి ఆగడం; దాని చుట్టూ జనం ఈగలకు మల్లే ముసురుకోడం; రంగయ్యగారు ఫైల్‌మాన్‌కు మల్లే గోచీబిగదీసి, జనంలోదూరి, కసరత్తుచేసి ఎలాగో ఎక్కి నుంచోడం జరిగింది. ట్రాము కదిలింది. జనం తొక్కిడిలో జేబుదొంగలుంటారన్న సంగతి ఆయనకి బాగా తెలుసు. అంచేతనే తనకి కావలసిన చిల్లరడబ్బులు తప్ప జేబులో మరేమీ వుంచుకోలేదు. మిగతా డబ్బంతా నరమానవుడి కంటబడకుండా దాచివుంచాడు. పోతూపోతూన్న ట్రాముకి, సహం దూరం వెళ్లేసరికి కిర్రుమని బ్రేకు పడిపోయింది. "ఏమిటి సంగతి"— అని విచారించగా ముందు, లైను మీద ఒక ట్రాము యేవో చిన్న రిపేర్స్‌వల్ల ఆగిపోయిందనీ,— త్వరలోనే అది కదలవొచ్చనీ— లైను క్లియర్ కాగానే తమ ట్రామూ కదుల్తుందనీ తెలిసింది.

ఇదిగో పోతుంది - అదిగో పోతుంది, అంటూనే అరగంట దాటిపోయింది. ట్రాములోంచి జనం వొక్కొక్కరుగా దిగిపోతున్నారు. అణాన్నర డబ్బులు పెట్టి టికెట్టు కొనుక్కున్న తరువాత ట్రాముని వొదిలి వెళ్లాలంటే మొదట రంగయ్యగారికి మనసొప్పింది కాదు.

రంగయ్యగారు రిస్టు వాచీ చూచుకున్నారు. ఏడయిపోయింది. ఇహ మెయిలుకి గంటన్నర మాత్రమే వుంది. లగేజి ఆఫీసులో ఎవరో ఎరిగిన వాళ్లుంటే సామాను ముందుగానే స్టేషన్‌లోకి చేర్చేశాడు కాబట్టి, త్వరగా వెళ్లితే మౌంటురోడ్డెళ్లి గొడుగు కొనుక్కుని వొచ్చేందుకు వ్యవధి లేకపోలేదు. కాని, ట్రాము కదిలేట్టు లేదు.' చివరికి రంగయ్యగారు ట్రాం ఆశ వొదులుకుని క్రిందికి దిగారు.

ఆ లైన్లో అన్ని ట్రాములూ ఆగిపోవడం మూలాన బస్సుల్లో స్థలం దొరకడం కష్టంగా వుంది. రిక్షాలూ జట్కాలూ కూడా చాలా రద్దీగా వున్నయ్. పాపం, ఎంత ప్రయత్నించినా రిక్షాగానీ, జట్కాగానీ చిక్కనే లేదు. ఇలా మరో అరగంట దాటిపోయింది. ఇహ వుండేదే గంట వ్యవధి. ఈ గంటవ్యవధిలో మౌంటురోడ్డు వెళ్లి రావడం వీలుపడదు. అందుచేత రంగయ్యగారు మౌంటురోడ్డు ఆశ వొదులుకోవలసి వొచ్చింది. సెంట్రలుకయినా బస్సు చిక్కుతుందేమో నని ప్రయత్నించాడు. కాని, అదీ వృథా ప్రయాస కాగా, పాపం, కాలినడకనే వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు. ఆపాటికి మరో అరగంట దాటిపోయింది. ఇహ వున్న వ్యవధల్లా అరగంటమాత్రమే! పాపం రంగయ్యగారికి అసలే నడవడం అలవాటు లేదు. పైగా భారీశరీరం. అందులో తొందరగా వెళ్ళాలి. ఏం చేస్తాడు? పాపం, రొప్పుకొంటూ, రొజుకొంటూ, చెమటలు కార్చుకొంటూ రోడ్డు రోలర్‌కి మల్లే తారురోడ్డు మీద దొర్లడం ప్రారంభించాడు. ఏం దొర్లినా ఏం ప్రయోజనం? నడక సాగితే నా? తీరా ఆయనగారు స్టేషన్ చేరుకునేసరికి, అప్పుడే మెయిలు పొగలు కక్కుతూ ప్లాట్‌ఫారం వొదులుతోంది. ఆ దృశ్యం చూచేసరికి రంగయ్యగారి గుండెలు గబుక్కున ఆగిపోయినై.

రంగయ్యగారు మెయిల్లో వెళ్లకపోతే ఇంటిదగ్గర ఎక్కడపనక్కడే ఆగిపోతాయి. తెల్లవారుఝామున జరగాల్సిన ముహూర్తం ఆగిపోవొచ్చు. అక్కడివాళ్లు ఆందోళన పడిపోతారు. నలుగుర్లో నామోషీ కూడాను. అదీకాకుండా, పెళ్ళి సందిర్గాను కొన్న వందరూపాయల పువ్వులూ వృథా అయిపోతాయి. పాపం, ఆయనగారికి ఏం చెయ్యడానికీ తోచలేదు. ముచ్చెమటలు పోశాయి. పార్సిల్ పెట్టెలో రంగయ్యగారి ఎరిగిన మనిషి వున్నాడని చెప్పానుగా, అతగాడు - యేదేనా టాక్సీ ఎంగేజ్ చేసుకోమని సలహా యిచ్చాడు.

పాపం, ఉన్న ఒక్క ట్రెయినూ దాటిపోయింది. బస్సులూ లేవు. ఇహ నేం చేస్తాడు? టాక్సీని ఎంగేజి చేసుకోవడంకంటె గత్యంతరం లేకపోయింది.

అవసరానికి అందరూ గిరాకీ చేస్తారు. అందులో అపరాత్రివేళ. ఏపాతికో ముప్ఫయ్యో అడిగే వాడల్లా యాభై రూపాయలు డిమాండు చేశాడు టాక్సీవాడు. ఏంచేస్తాడు పాపం? ఎలాగో బేరం చేసి, నలభై రూపాయల కొప్పించి తన సామానుతో బాటు తానూ కార్లో పడ్డాడు. పాపం, ఇల్లు చేరుకునేదాకా రంగయ్యగారి మనసు మనసులో లేదు.

టయిముకి ఇల్లు చేర్చినందుకు ఓ వేపు టాక్సీడ్రైవర్ని అభినందిస్తూ, వృథాగా నలభై రూపాయలు వాడికివ్వవలసి వొచ్చినందుకు మరో వేపు విచారిస్తూ కుర్చీలో చతికిలబడ్డాడు.

ఇన్నింటికీ కారణం తన పీనాసితనమేనన్న విషయం జ్ఞాపకానికి రాగానే పాపం, రంగయ్యగారికి చెడ్డసిగ్గేసింది. తాను కార్లో రావలసి వొచ్చినందుకు కారణం ఎవరితోనూ చెప్పుకోలేదు.

దేవుడిపుణ్యాన ముహూర్తం నిర్విఘ్నంగానే జరిగిపోయింది.

మరునాటిరోజు ప్రొద్దున్నే రంగయ్యగారు పర్సు జేబులో వేసుకుని బజారుకు వెళ్లి, పదిరూపాయలు పెట్టి, జింకమార్కు జోలు కమ్మీల గొడుగు కొనుక్కుని చక్కావొచ్చాడు.

పొరిగింటి పుల్లయ్య రంగయ్యగారి గొడుగుని చూచి - "ఏం బావా? ఎంతకొన్నావ్ ఈ గొడుగుని?" అని అడిగితే, పైకి పదిరూపాయలనే చెప్పాడు కాని, అసలు ఖరీదు యాభై రూపాయలన్న సంగతి మాత్రం బయట పెట్టలేదు. ★

# తోడేలు - గొల్లపిల్లవాడు

ఆ రోజు శనివారం. నాన్నగారు కేసు నిమిత్తం రాజమండ్రి వెళ్లారు. ఇంకేం మా పనులకు పట్టపగ్గాలుండవుగా! ఏం చేసిన అక్కయ్య తప్పించి, అన్నయ్య, అమ్మ ఏఁవని అడగరు. నాన్నగారంటే అసలు ఏ సినిమాకు వెళ్ళనివ్వరు. అందులోను ఇంగ్లీషు పిక్చర్లకు అసలే వెళ్ళనివ్వరు. అక్కయ్య కూడ అంతే... నాన్నగారు లేరుగా, అక్కయ్యకు నచ్చచెప్పి పిక్చరుకెళదామనుకున్నాం. క్రౌను టాకీసులో "కొవాడిస్" వచ్చింది. బలే స్టంటుపిక్చరు. స్టంటు పిక్చరంటే మహా ప్రాణం. అందులో హీరో బలేగా యుద్ధం చేశాడుట, నిన్న వెళ్ళిన రామం చెప్పాడు. ప్రతీ విద్యార్థి చూడవలసిందన్నాడు. డబ్బులైతే ఆమాత్రం మాదగ్గర లేకపోలేదు. (అసలు మాదగ్గర ఎడ్వాన్సుగా ఒక పిక్చరుఖర్చుకు తగ్గట్టుగా ఉంటుంది లెండి! మాలోకి) పెద్దవాడు గోపాలం. గోపాలంతో ఈసంగతి చెప్పాను. సత్యాన్ని కూడ పిలిచి మా గదిలో కూర్చుని, ఆలోచించాం. అక్కకు ఎలాగు నచ్చచెప్పి "కొవాడిస్"కు వెళ్లటమా అని. అసలు అక్కయ్యతో కాస్సేపు తియ్యగా మాట్లాడి "అక్కయ్యా! మేం సినిమాకు వెళతాం" అని అంటే చాలు డబ్బులిచ్చి పంపుతుంది.

అక్కయ్యతో సరదాగామాట్లాడటం ఒక్క గోపాలానికే తెలుసు. అంచేత అక్కయ్యతో కాస్సేపు కబుర్లుచెప్పి వెడదాం అనుకున్నాం. కాని అక్కయ్య తోకలా సూర్యం తిరుగుతుంది. ఎలాగు? మేంపిక్చరుకు వెళ్లుతున్నట్లు తెలిసిందో, వెంట వస్తానని మారాం చేసి ఏడుస్తుంది. పోనీ తీసుకవెళ్ళామా, నాన్నగారు రాఁగానే "నాన్నగారూ! మేమంతా మీరు లేనప్పుడు కొవాడిసుకెళ్లామండి. చాల బావుంది. అని ఏవేవో చెబుతుంది. తీసుకు వెళ్లకపోతేనాన్నగారు రాజమండ్రినుంచి గుమ్మం

**పక్కింటి బాలకృష్ణారావు**

లోనికి అడుగు పెట్టగానే ఫిర్యాదు. సూర్యం ఫిర్యాదు చేసిందంటే మా పని తాం. సత్యానికి బలే ఉపాయం తట్టింది. ప్రయివేటు క్లాసుందని చెప్పి పిక్చరుకు వెడదామన్నాడు. భేష్! అనుకున్నాం. మేం ఏపిక్చరుకు వెళ్ళినా మా పక్కింటి హరి వస్తుంటాడు మాతో. హరిని పిలచాం. ఎగిరి వచ్చాడు. మాప్లానంతా చెప్పేం. బావుందన్నాడు. హరిని ఒంటిగంటకే రమ్మని చెప్పాం. వాళ్ళింటి దగ్గర ప్రయివేటు కెళుతున్నానని వచ్చేశాడు. ప్రయివేటుకు రమ్మని మమ్మల్ని పిలిచాడు. అక్కయ్య అడిగింది ఏం ప్రయివేటని. "ఇంగ్లీషు మాష్టరుగారు ప్రయివేటుక్లాసు పెట్టారు, రెండుగంటలకే రమ్మన్నారు." అని చెప్పాడు హరి. అక్కయ్య ఏమంటుందో అని గుండెబితుక్కుబితుక్కుమని కొట్టుకుంది. అక్కయ్య మారుమాట్లాడ లేదు. అక్కయ్య దగ్గరగానేఉంది. "మేంఅప్పుడే రాము ఇంకా ఒంటిగంటన్నరే కాలేదు. ముందెందుకు వెళ్లడం దండగ. టైము వేస్టు. అప్పుడే రాము. యిష్టం ఉంటే $1\frac{1}{2}$ వరకు ఉండు వస్తాం" అన్నాను నిక్కచ్చిగా.

"అయితే నేముందుగా వెళతా"నని పోయాడు హరి. (ఇదంతా మా నాటకంలెండి). హరి ఎక్కడికెళతాడో మాకు తెలియకపోదు. సినిమాకు వెళ్లేదారిలో మా వేణు ఇల్లుంది. ఎన్నిపిక్చర్లకు ఎన్నిసార్లు వెళ్ళినా, వాళ్లనాన్న ఏమీఅనరుట. ఎంతో మంచివారు. వాళ్లింటో పుట్టవలసిందని ఎన్నోసార్లు అనుకున్నాం. దేముడికిబుద్ధిలేదు. అసలు ఒకసారి పిక్చరుకు వెళ్లకపోతే, ఎందుకు వెళ్లలేదు, వెళ్లు అని పురమాయించి పంపుతారుట. అంత మంచివారు. (ఆయనకి సినిమాలంటే పిచ్చిలెండి) సరిగ్గా ఒంగ్ మని ఒంటిగంటన్నరయింది. బయలుదేరాం మేం ముగ్గురం. తిన్నగా పుస్తకాలు పట్టుకొని చుట్టు తిరిగి, అంటే స్కూలుకు వెళ్లే దారిగుండా వేణు దగ్గర కెళ్ళి పుస్తకాలు వాళ్లింట్లో పెట్టి "కొవాడిస్"కు పోయాం. హాల్లో కూర్చున్నంతసేపు హీరో వెనకాలే నేనున్నట్లు వాడికి దెబ్బతగిలితే, నాకే తగిలినట్లు వాడు ఓడిపోతూంటే, నాకే

పరాజయం కలిగినట్లయింది. సరి! పిక్చరు వదిలేశారు. తిన్నగా పుస్తకాలు తీసుకొని చుట్టు తిరిగి ఇంటికి పోయాం. ఇంతఆలస్యం అయిందేం అని గుమ్మం ఎక్కుతూంటేనే అక్కయ్య ప్రశ్న వేసింది. అబ్బే! ఏంలేదక్కయ్యా! దారిలో రామారావుయింట్లో కాస్సేపు కూర్చుని వచ్చాం అని బుకాయించాను. మేం కోవాడీసుకు వెళ్ళినట్లు ఎవ్వరికీ తెలియనీయలేదు. ఆదివారం సాయంకాలం నాన్నగారువచ్చారు. కోర్టులో ఎవరో ప్లీడర్లు చెప్పారుట. కోవాడీసు చాల బావుందని. సోమవారంరాత్రి ఫస్టుషోకు సూర్యంని తీసుకవెళ్లారు. ఆమర్నాడు సూర్యం చాల గొప్పగా కోవాడీసుగురించి చెప్పింది.

మరిమనమూ చూశాంగా, నేనూ చెప్పాను, హీరో యిలా ఏక్టు చేశాడంటూ. ఎప్పుడు చూశావని అడిగింది. మొన్న శనివారం ప్రయివేటుక్లాసుకు వెళ్తామని బుకాయించి సినిమాకి వెళ్లేంఅనిగొప్పగాచెప్పేను. అప్పుడే అక్కయ్య కంప్లెయింటు, అబద్ధాలాడి ఎందుకెళ్లారని. అంతా బిక్కముఖం వేసుక్కూర్చున్నారు. సరి ఆ గొడవయిపోయింది. పరీక్షలు దగ్గరకొచ్చాయి. క్లాసులో కోర్సు పూర్తికాలేదు. మా యింగ్లీషు మాస్టరుగారు ప్రయివేటుక్లాసులు పెట్టి కంప్లీటు చేస్తానన్నారు. రేపు శనివారం మధ్యాహ్నం ప్రయివేటుకురండి అని చెప్పారు. శనివారం మధ్యాహ్నం ఒంటిగంటన్నరకు నిజంగా పుస్తకాలు పట్టుకొని పక్కింటి హరి వచ్చాడు. రండి టయిమయిందన్నాడు. అక్కయ్య వేసింది అప్పుడే ప్రశ్న. ఎక్కడికని? "చేతులో పుస్తకాలు కనబట్టంలేదూ ప్రయివేటుక్లాసుకు" అన్నాను. "మీ డాబులు, వేషాలు కట్టిపెట్టండి. మా బావుంది ప్రయివేటుక్లాసని పిక్చర్లకెళ్లటం? ఎంతమాత్రం వెళ్లటానికి వీలులే"దంది. "చూడక్కా! మా జేబుల్లో డబ్బులేందే, ఎలాగు వెళతాం?" అన్నాను. "మీ వాడప్పుడే రెడీగా మీగురించి ఉంటాడని తెలియదనుకోకు. ఎంతమాత్రం వెళ్లవ"ద్దంది. అమ్మతో రిపోర్టు చేశాం.

అమ్మకూడఅక్కమాటే. "కొత్తపిక్చరు "పరివర్తన" కామీ తయ్యారు? నాన్నగారితో చెబుతా"నంది. ఇంకేంచేస్తాం! "లేదమ్మా మా మాస్టరుగారు ప్రయివేటుక్లాసు పెట్టారు. పిక్చరుకు కాదు." అన్నాను. అమ్మ, అక్కయ్య ఎలాగు నమ్ముతారు? "తోడేలు - గొల్లపిల్లవాడు" కథలోనీతి మాకు బాగా తెలిసొచ్చింది. ఆరోజు ప్రయివేటుకు ఆబ్సెంటు. ఇప్పటికీ ప్రయివేటంటే అక్కయ్యకు, అమ్మకు పిక్చరనే భావం. ★



కదనభూమిలో క్షతగాత్రుడై స్మృతి తప్పి పడిపోయిన యువరాజు సలీం.
"అనార్కలీ"లో నాగేశ్వరరావు, నాగయ్య, పీకేటి.

# రేడియోలో ఫిలిం సంగీతం

ఆలిండియా రేడియో కార్యక్రమాల్లో ఫిలిం సంగీతాన్ని ఇప్పటికంటె ఎక్కువ చేయడానికి కేంద్ర ప్రభుత్వపు రేడియో శాఖవారు ఆలోచిస్తున్నట్లు, ఈ విషయమై వారు ఫిలిం ఫెడరేషన్ వారితో సంప్రదింపులు జరిపినట్లు వచ్చిన వార్తలు, దేశంలోని ఫిలిం సంగీతాభిమానులకు సంతోష కారణం కాగలవు.

ఫిలిం సంగీతం భారతీయ సంగీత సంప్రదాయాలకు విరుద్ధంగా ఉంటున్నదనీ, ప్రజల సంగీతాభిరుచులను పాడు చేస్తున్నదనీ భావించి రేడియోశాఖవారు కొంత కాలంనుండి ఫిలిం సంగీతాన్ని ప్రసారం చెయ్యడం తగ్గించివేశారు. ఫిలిం సంగీతానికి బదులు శాస్త్రీయ సంగీత కార్యక్రమాలను ఎక్కువచేయడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నాన్ని రేడియోశాఖవారు ఆశించినంతగా శ్రోతలు హర్షించినట్లు కనిపించలేదు. శాస్త్రీయ సంగీతం విని బలవంతాన తమ అభిరుచిని వృద్ధిచేసుకోవడంకంటె ఫిలిం సంగీతాన్ని అధికంగా ప్రసారంచేసే సిలోన్, గోవా, కరాచీ రేడియో కేంద్రాలకు రేడియోలను ట్యూన్ చేసుకోవడమే మంచిదని చాలమంది శ్రోతలు భావించారు. ఈ పరిస్థితిలో మళ్ళీ ఫిలిం సంగీతాన్ని కొంచెం ఎక్కువ చేయడం అవసరమని రేడియో శాఖవారు తలుస్తున్నట్లు కనిపిస్తోంది.

సినిమా పాటలపై ప్రజల్లో మోజు ఎక్కువగా ఉంది. అయితే ప్రతి సినిమాలోని ప్రతి పాటా ప్రజాదరంపొందుతోందని గానీ, ప్రతిపాటా సాంప్రదాయికంగా ఉత్తమస్థాయిలో ఉంటోందని గానీ ఎవరూ భావించడంలేదు. ఫిలిం సంగీతాన్ని రేడియోల్లో తిరిగి ఎక్కువచేసే ముందు, బాగా ప్రజాదరం పొందిన పాటలనూ, సంప్రదాయానికి బొత్తిగా విరుద్ధంగా లేనివాటినీ శ్రవణసుఖం కలిగిస్తూ ఒక కనీస స్థాయికి దిగిపోకుండా వున్న వాటినీ ఎన్నుకోవడం అవసరం. ఇటువంటి పాటలు సినిమాల్లో చాలా ఉన్నాయి. వీటినే రేడియోవారు

తీసుకోవచ్చు. ఈ పద్ధతి శ్రోతల ఆమోదం కూడా పొందవచ్చు.

ఫిలిం సంగీతాన్ని తగ్గించే ముందు, రేడియోశాఖవారు, ఫిలిం సంగీతంస్థానంలో తాము స్వయంగా తయారుచేయించే లలిత సంగీత కార్యక్రమాలు ప్రవేశపెట్టడానికి కూడా పథకం వేశారు. ఈ పథకం కొంతవరకూ అమలులోకి వచ్చింది. చాలవరకూ ఫలించింది కూడాను. ఈ లలిత సంగీత కార్యక్రమాలు అటు శాస్త్రీయ సంగీతానికీ, ఇటు ఫిలింబాణీలకూ మధ్యగా ఉంటూ శ్రోతల ఆమోదన్ని చాలవరకూ పొందగలిగాయి. ఈ కార్యక్రమాలను ఇంకా విస్తరించడానికి అవకాశం ఉంది. అయితే, ఫిలిం సంగీతం ప్రచారం పొందినంతగా ఈ కార్యక్రమాలు పొందలేవు సినిమాకున్న పలుకుబడి రేడియోకు లేకపోవడమే దీనికి కారణం అందుచేత రేడియోవారు సంగీతానికి వినియోగించే కాలాన్ని ఫిలిం సంగీతానికి, లలిత సంగీతానికి, శాస్త్రీయ సంగీతానికి దాదాపు సమంగా ఉండేట్లు ఏర్పాటు చేసుకోవడం మంచిపద్ధతి అనిపిస్తుంది.



యూనియన్ పిక్చర్స్‌వారి "శ్రీ జగన్నాథ మాహాత్మ్యం"లో దాగుడుమూతలాడే లలిత, ఆమె చెలికత్తెలు.



"అమర సందేశం"లో పద్మిని, అమరనాథ్, మిక్కిలినేని, వంగర.



"పల్లెపడుచు"లో రైతు సి. ఎస్. ఆర్.

## రోమియో ఎండ్ జూలియట్

ఆంగ్లో-ఇటాలియన్ చిత్రం "రోమియో ఎండ్ జూలియట్"కు వెనిస్‌లో జరిగిన చలనచిత్రోత్సవంలో ప్రథమ బహుమతి ఇవ్వబడింది. ప్రొడక్షన్ విలువలలో సాటిలేనిదని ఈ చిత్రాన్ని అంతా మెచ్చుకున్నారు. రెనాటో కాస్టెలానీ అనే ఇటాలియన్ డైరెక్టరు దీన్ని డైరెక్టు చేశాడు. లారెన్స్ హార్వే రోమియోగాను, సుసాన్ షెంటాల్ జూలియట్‌గాను నటించారు. నటన విషయంలో కొన్ని విమర్శలు వచ్చినా ప్రథమబహుమతి దీనికే వచ్చింది. ఆర్థర్ రాంక్ సంస్థా, ఒక ఇటాలియన్ సంస్థా కలిసి తీసిన ఈ చిత్రం కథాస్థలమైన వెరోనాలోనే షూట్ చేయబడింది. ఈ నెల 28 వ ఇది లండనులో మొదటసారిగా విడుదల కానున్నది.

వెనీస్ ఉత్సవంలో "సెవెన్ సెమూరాయ్" "శాన్షోదయో" అనే రెండు జపానీస్ చిత్రాలకూ, "ఆన్ ది వాటర్ ఫ్రంట్" అనే హాలీవుడ్ చిత్రానికి, "లా స్ట్రాడా" అనే ఇటాలియన్ చిత్రానికి ద్వితీయ శ్రేణి బహుమతులు వచ్చాయి.

## ఫిలిములు - బాల నేరస్థులు

ఐక్యరాజ్య విద్యా, సాంఘిక, సాంస్కృతిక సంస్థకు చెందిన ఫిలిప్ బొచార్డ్ అనే నిపుణుడొకాయన, "బాలురు నేరాలు చేయడానికి ఫిలిములు కారణం కా"దని ఇటీవల అన్నాడు. "బాలుడిలో అదివరకే నేరం చెయ్యడానికి కావలసిన మనస్తత్వం ఉంటే తప్ప ఫిలిములు ఏ హానీ చెయ్యలేవు. సంఘవాతావరణంలో సరిగా ఇమడని బాలుడు, లేక అదివరకే మనస్సు స్థిమితంగా లేని బాలుడు ఫిలిము చూసినప్పుడు, ఆ ఫిలిము అతన్ని నేరానికి పురికొల్పవచ్చును," అని ఆయన అభిప్రాయపడుతున్నాడు.

పిల్లలకు పనికివచ్చే చిత్రాలను గూర్చి చెబుతూ, బ్రిటన్, జెకోస్లొవాకియా, రష్యా వంటి కొద్ది దేశాల్లో తప్ప పిల్లల చిత్రాలనుగూర్చి సరియైన శ్రద్ధ కనబడడం లేదని ఆయన అన్నాడు. ప్రత్యేకంగా పిల్లలకోసం చిత్రాలు తయారుచేసి, వాటి ప్రదర్శనకోసం సినిమా క్లబ్బులను ఏర్పాటుచేస్తున్న కొద్ది దేశాల్లోనూ మంచి ఫలితాలు కనిపించాయని కూడా ఆయన అన్నాడు.

* * *

వాల్టర్ లిప్మన్ అనే అమెరికన్ పత్రికా రచయిత అమెరికాలో బాల నేరస్థులసంఖ్య విపరీతంగా పెరుగుతోందని ప్రభుత్వపు అంచనాలవల్ల తెలుస్తోందని, ఈ నేరాలకు ప్రోత్సాహమిచ్చే ముఖ్య కారణాల్లో ఫిలిములు, టెలివిజన్, కామిక్ పుస్తకాలు పేర్కొనదగినవనీ ఇటీవల వ్రాశాడు. హింసాప్రవృత్తిని బహిరంగంగా ప్రదర్శించడంవల్ల, హింసావాంఛ ప్రకోపిస్తుందనీ, ఆ వాంఛను తీర్చుకునే విధానం కూడా బోధించినట్లవుతుందనీ ఆయన అభిప్రాయపడ్డాడు. సెన్సార్‌షిప్ విధానం ప్రస్తుతం ఎంత నిరుపయోగముగా ఉన్నప్పటికీ, ప్రజా వినోదసాధనాలవల్ల కలిగే చెడును అరికట్టడానికి సెన్సార్‌షిప్ ఉండవలసిందేనని ఆయన వ్రాశాడు.



"పల్లెపడుచు" లో జమీందారీ గుమాస్తాగా అల్లు రామలింగయ్య.

# వరదబాధితులకు సినిమానటుల ధన సేకరణ

అస్సాం, పశ్చిమ బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్‌లలో వరదలవల్ల విపరీతంగా నష్టపడిన ప్రజలకు సహాయం చేసేందుకు బొంబాయి ఫిలిం నటీనటులు ముందుకు వచ్చి, ధనం సేకరిస్తున్నారు. ఈనెల 15 వ తేదీన బొంబాయిలోని వీధులలో సినిమా తారలందరూ ఊరేగింపు జరిపి ప్రజలకు విజ్ఞప్తిచేసి ధనసేకరణ సాగించారు. నిర్మాతలకు, డిస్ట్రిబ్యూటర్లకు, ఎగ్జిబిటర్లకు దేశంలోని సినిమా అభిమానులకుకూడా వీరు విజ్ఞప్తిచేసి వరదబాధితులకు సహాయపడవలసిందిగా కోరుతున్నారు.

ఈనెల 15 వ తేదీన బొంబాయి ఫిలిం తారలు బజార్లలో భిక్షమెత్తిన దృశ్యం చలనచిత్ర చరిత్రలో అపూర్వమైనది. ఫిలిం తారలకు ప్రజలలో గల అపారాదరానికి నిదర్శనంగా, తారలు లారీలెక్కి ఊరేగుతూ చేసిన విజ్ఞప్తి ననుసరించి డబ్బు, నగలు వర్షం కురిసినట్లు కురిశాయి. ఊరేగింపునకు అటూ ఇటూ వేలాది ప్రజలు బారులుతీర్చి నుంచున్నారు. పోలీసు బందోబస్తు ఉండడంవల్ల తప్పిందిగాని లేకపోతే త్రొక్కిడి మరింత ఎక్కువయ్యేదే. ఊరేగింపు ప్రారంభం కావడానికి చాలా ముందే తారాభిమానులు వీధులలో కాచుకుని ఉన్నారు. వలంటీర్లు ధనం సేకరించడం ప్రారంభించారు. తారలందరూ ఊరేగింపులో పాల్గొనేందుకు వీలుగా బొంబాయి స్టూడియోలన్నీ ఆరోజున మూసివేశారు.

నటులు, నటీమణులు, ప్రొడ్యూసర్లు, డిస్ట్రిబ్యూటర్లు, ఫిలిం పరిశ్రమతో సంబంధమున్న ప్రతివాడూ ఊరేగింపులో చేరి జోలెలు తెరిచి, లారీలకు అమర్చబడిన మైక్రోఫోనులద్వారా సహాయంకోసం విజ్ఞప్తులు చేశారు. ఊరేగింపు సెంట్రల్ స్టూడియోస్ వద్ద ప్రారంభమై, దాదర్‌లోని శ్రీ సౌండ్ స్టూడియోస్ వద్ద అంతమైంది.

ఫిలిం తారల ధనసేకరణోద్యమం నెల రోజులపాటు కొనసాగుతుందని తెలుస్తోంది.

## సినిమా వార్తలు

### "అన్నదాత"

అశ్వరాజ్ ప్రొడక్షన్స్‌వారి "అన్నదాత" దాదాపు పూర్తి కావచ్చింది. మరొక అయిదు రోజుల షూటింగ్‌తో ముగిసిపోతుందని తెలుస్తోంది. అంజలీదేవి, నాగేశ్వరరావు, రంగారావు, చలం మున్నగువారు నటించే ఈ చిత్రాన్ని వేదాంతం రాఘవయ్యగారు డైరెక్టు చేస్తున్నారు. దీన్ని అక్టోబరు మధ్యకాలంలో విడుదల చేయవచ్చునట.

* * *

నాగూర్ సినీ ప్రొడక్షన్స్‌వారి "ఇద్దరు పెళ్ళాలు", ఎ. వి. ఎమ్. వారి "జాతకం", పరిమళావారి "ప్రజారాజ్యం" చిత్రాలు కూడా అక్టోబరులో విడుదలకావచ్చును.

* * *

### "మా గోపి"

విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి "మా గోపి" పూర్తిచేయబడినది. ఈ నెల 24 వ తేదీన విడుదలవుతుందని తెలుస్తోంది. నాగయ్య, జి. వరలక్ష్మి, జమున, నరసింహారావు, మాస్టర్ వెంకటేశ్వర్, రేలంగి మున్నగు

గోకుల్ వారి "వదినెగారి గాజులు" ప్రారంభోత్సవం ఈనెల 2 న రేవతీలో జరిగింది. అనిసెట్టి, పినిశెట్టి, డైరెక్టర్ రజనీకాంత్, అమరనాథ్, నిర్మాత కృష్ణమూర్తి, చలం, బి. ఎస్. రంగా, అంజలీదేవి, జమున మున్నగువారిని పై ఫోటోలో చూడవచ్చును.



...వారు నటించిన ఈ చిత్రాన్ని బి. ఎస్. రంగా డైరెక్టు చేశారు. హృదయంగమములైన సన్నివేశాలతో, మంచి నటనావైదుష్యంతో ఈ చిత్రం ప్రేక్షకులను కదిలించగలదని విశ్వసించబడుతోంది.

* * *

## "రేచుక్క"

ప్రతిభా వారి "రేచుక్క" నూటికి 80 వంతులదాకా పూర్తయింది. ఆఖరు ఘట్టంలో పడింది. కొన్ని చిన్న చిన్న సెట్లమీద దృశ్యాలు షూట్ చేయడంతో చిత్రం పూర్తవుతుంది. అంజలీదేవి, ఎన్. టి. రామారావు ప్రధానభూమికలు నిర్వహిస్తున్న ఈ చిత్రం పి. పుల్లయ్యగారి దర్శకత్వాన తయారవుతోంది. నవంబరు నెలాఖరుకి విడుదలకు సిద్ధమవుతుందని తెలుస్తోంది. ★

"వదినెగారి గాజులు" ప్రారంభోత్సవ సందర్భంలో ప్రసాద్ గారు కెమెరా 'స్విచ్ ఆన్' చేశారు.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## చిట్టిప్రశ్నలకు జవాబులు

కొటూరి వెంకటేశ్వరరావుగారు, కోలమూరు.

—ఎలక్ట్రిక్‌షాకు మన మెదడులోని ముఖ్య కేంద్రములను - ఊపిరి తీయుటను సాగించువాటిని- స్తంభింపజేయును. అందువల్ల శ్వాస చటుక్కున ఆగిపోవును. ఎలక్ట్రిక్‌షాకు తిన్నవారిని బోరగిల పండబెట్టి నొక్కి విడిచీ కృత్రిమశ్వాస కల్పింతురిందుకే. ఒకొక్కప్పుడు గంటకాలము కూడా పట్టుటకలదు ఆ వ్యక్తి కోలుకోవడానికి.

*　　*　　*

గుమ్మలూరి నరసింహశాస్త్రి గారు, మద్రాసు.

అణువులో, కేంద్రకమూ, దానిచుట్టూ గ్రహములవలె ఎలక్ట్రానులూ ఉంటాయి. ఎలక్ట్రానులది ఋణవిద్యుదావేశమూ కేంద్రకానిది ధన విద్యుదావేశమూను. ఇలాంటి అణువుపైకి ఎలక్ట్రాను విసిరితే అణువులో ఉపరిభాగమున ఉన్న ఎలక్ట్రానులు దీనిని తిరస్కరిస్తాయి. ఎలక్ట్రానును కాక ధన విద్యుదావేశము గల ప్రోటాను కణమును విసరితే అణువు మధ్యనగల కేంద్రకము దానిని వికర్షించును. కాని న్యూట్రానును విసరితే దీనికి ఏ ఆవేశమూ లేదు కనక నిరాటంకంగా వెళ్ళి కేంద్రకానికి తగిలి పరిస్థితులు అనుకూలమైతే కేంద్రకాన్ని ఛేదింగలదు. ఇక పరమాణువులోనికి న్యూట్రానులను పంపడమెలాగా? అని ప్రశ్న. బెరీలియమూ; రేడియమూ కలిపితే ఆ మిశ్రమమునుంచి న్యూట్రానులు వెలువడును; యురేనియముతో ఈ మిశ్రమము చేరిస్తే యురేనియము అణువును తారసిల్లిన న్యూట్రాను నిరాటంకముగా చొచ్చుకుపోయి కేంద్రకానికి తగిలి విచ్ఛిన్నము చేయగలదు.

*　　*　　*

పి. దిగంబరరావుగారు, సంగారెడ్డి.

—కనుగ్రుడ్డుమీదికి అనుక్షణమూ కన్నీరు కొంచెముగా ప్రవించును. కంటిరెప్ప మూతపడినప్పుడు ఈ నీరు, అడుగురెప్ప కొలికి లోగల రంధ్రము ద్వారా ముక్కు లోపలి భాగానికి చేరుకొనును. రెప్ప వేయకుండా చూచినప్పుడు కనుగ్రుడ్డు ఉపరిభాగము పొడిగా ఉండుటవల్ల మంట పుట్టి, ఈ బాధ తగ్గించుటకు కన్నీరు కార్చును. కళ్ళవెంబడి నీరు కార్చినవారు, (ఈనీరు వైరీతిగా జాస్తిగా ముక్కులోనికి ప్రవేశించుటవల్ల చీమిడి పల్చనై) ముక్కు చీదుకుంటారు.

*　　*　　*

మండ వీరభద్రరావుగారు, కాకినాడ.

టి. బి. అన్న అక్షరాలకు పల్మనరీ ట్యూబర్‌క్యులోసిస్ అని సంకేతము. "శ్వాసకోశపు క్షయ" అని దాని అర్థము. కర్రను చెదలు తినివేసినట్లు ఊపిరితిత్తులనుగాని, ఎముకనుగాని, క్షయరోగకారక క్రిములు తినివేయుటయే ఈ వ్యాధి.

సాయంకాలము కొద్దిగా జ్వరము తగులుతూండడమూ, బరువు క్రమక్రమంగా క్షీణించడమూ, రాత్రిపూట సాయంకాలపు జ్వరము దిగిపోయి చెమటలు పట్టుటా ఈ వ్యాధిలక్షణాలంటారు. సాయంకాలము పొడిదగ్గు జోరుగా వస్తూండడము కూడాను. అయితే వీటిలో ఏదో ఒకటి తప్పిజారి మనలో కనబడితే కొంప మునిగినదని ఖంగారుపడడము వెర్రి. డాక్టరు పరీక్షచేసి చికిత్స చెప్పినప్పుడు అనుసరించి ఆరోగ్యవంతులైనవారెందరో కలరు.

*　　*　　*

యస్. ముల్లాక్ గారు, బంగోలు.

—భూమి, తక్కిన గ్రహాలవలెనే సూర్యుడినించి విడిపోయిన గోళము. ఆ రీతిగా విడిపోయి పారిపోతూన్నప్పుడు భూమిమీద సూర్యగోళపు ఆకర్షణ పనిచేసి (తాడుకట్టి గిరగిర తిప్పినరాతిని తాడులాగే) పట్టిఉంచుటవల్ల భూమి సూర్యుని చుట్టూ తిరగవలసి వచ్చింది. సూర్యుడు కూడా తనచుట్టూ తాను తిరుగుతూన్నాడు. కనక భూమికి ఈ రకపు తిరుగుడుకూడా అలవడింది.

—గాలిలో హైడ్రోజను ఎక్కువగా లేదు. ఏదో ఉన్నది అనిపించేటంత తక్కువగా ఉన్నది. ఈ ఉదజని ఆక్సిజనుతో ఎందుకు కలిసిపోదూ? అని మీ ప్రశ్న. ఉదజని ఆమ్లజని మిశ్రమాన్ని సంయోగము చేయించి నీటి ఆవిరిగా మార్చడానికి విద్యుత్ స్ఫులింగము అవసరము. విద్యుత్ స్ఫులింగాలు అన్నివేళలా ఉండవుకదా! మెరుపులు పుట్టినప్పుడు ఈ రకపు సంయోగము మాత్రమే కాక నత్రజని ఆమ్లజని సంయోగముకూడా జరుగుతుంది. నత్రజని గాలిలో నాలుగుపాళ్ళు. కనక ఇదే ఆక్సిజనుతో కలుస్తుంది. ★

## గ్రంథస్వీకారం

### కథాసాగరం—8

### హితశ్రీ కథలు

దేశి ప్రచురణలు, విజయవాడ - 2. వెల రు. 1.

సంపద, దారిద్ర్యం యీ రెండూకూడా మానవుడిపట్ల ఏవో కుట్రలు పన్నుతాయనీ, అది తెలుసుకోలేని వాడు సంపద చేసే సవాలుకీ అందుకోలేడనీ, దారిద్ర్యం చేసే సవాలుకీ తట్టుకోలేడనీ ఋజువు చేయటానికి రెండు జంటల దంపతుల్ని తీసుకొని 'హితశ్రీ'గారు 'ఎత్తుపల్లాలు' అన్న పేరుతో ఒక కథ అల్లారు. ఆ కథతో పాటు 'వర్షించని మేఘాలు', 'నిజానిజాలు', 'సంజవెలుగు', 'పొడుగునీడలు', 'తీరనికోరిక' అనే శీర్షికలతో వీరు రచించిన మరొక ఐదు కథలతో కలిపి దేశి ప్రచురణవారు 'కథాసాగరం—8'గా ఒక పుస్తకం ప్రచురించారు.

ఈ కథలన్నింటిలోకి 'నిజానిజాలు' అనే కథలో హితశ్రీగారి మానవ మనస్తత్వ పరిశీలనా ప్రయత్నం పరిణతి నందుకొన్నట్లు కనిపిస్తోంది. తనకు కోరిక లేమీ లేవనుకొంటూ, అంచేత తనలో స్వార్థం అనేది అసలే వుండటానికి అవకాశం లేదని నమ్మిన ఒకానొక వ్యక్తి ఆత్మపరీక్ష చేసుకొని తాను మొదటినుంచీ చివరిదాకా తన కోసమే బ్రతుకుతున్నాననీ, తనలో స్వార్థచింత అత్యధికంగా వుందనీ చివరి నిమిషంలో తెలుసుకోవటం యీ కథలోని యితివృత్తం. ఆ వ్యక్తితో ఆదిలో అసామాన్యంగా సంబంధం కల్పించుకోవటానికి యిష్టపడిన ఒక బాలవితంతువు, అంతంలో అతని సహధర్మచారిణిగా జీవితాంతం మెలగటానికి తనకు తానై సిద్ధపడుతుంది. ఈపాత్రను చిత్రించటంలో కూడా 'హితశ్రీ' ప్రౌఢిమ చూపించారు. మిగిలిన నాలుగూ కొన మెరుపు కథలు.

## సినిమా:
# "నాక్ ఆన్ వుడ్"

రాజకీయ గూఢచారుల కుట్రలకు సంబంధించిన చిత్రాలు తీయడం యుద్ధానంతరం హాలీవుడ్‌లో ఒక ఫేషన్ అయింది తమ దేశభక్తిని నిరూపించుకోవడంకోసం, హాలీవుడ్ కంపెనీలు ఈ చిత్రాల ద్వారా 'కోల్డ్ వార్'లో పాల్గొంటున్నాయి. డానీ కేయీ నటించిన "నాక్ ఆన్ వుడ్" అనే చిత్రం ఇటువంటి చిత్రాల్లో ఒకటి ఈ చిత్రం ప్రస్తుతం మనదేశంలో చాలామంది ప్రేక్షకులను ఆకర్షిస్తోంది. డానీ కేయీ స్వయంగా ఈమధ్య మనదేశం వచ్చి తన కొత్త చిత్రానికి ప్రచారం చేసివెళ్లాడు. చార్లీచాప్లిన్‌ను కోల్పోయిన అమెరికా, చాప్లిన్ స్థానానికి డానీ కేయీని లేవనెత్తి, ఆ నష్టాన్ని భర్తీ చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టు కనిపిస్తుంది "నాక్ ఆన్ వుడ్" చిత్రంమీద అమెరికన్ పత్రికలు కురిపించిన ప్రశంసల పరంపరే దీనికి నిదర్శనం. పైగా ఈ చిత్రంలో 'కోల్డ్‌వార్'కు తోడ్పడే అంశాలు చాలా ఉన్నాయి.



తిరుపతి విశ్వకళాపరిషత్తు ప్రారంభోత్సవ సందర్భంలో నాట్యంచేసిన దువ్వూరి రాధ.

ఇందులో డానీ కేయీ ఒక అమెరికన్ వెంట్రిలోక్విస్టుగా నటించాడు. అయితే కథకూ అతని వెంట్రిలోక్విజమ్ వృత్తికీ సంబంధం లేదు. అతన్ని రెండు గూఢచారుల వర్గాలు తమ విద్రోహచర్యలలో ఉపయోగించుకోవడం, అతని మానసిక జాడ్యాన్ని ఒక ఆడ సైకియాట్రిస్టు కుదర్చడానికి ప్రయత్నించడం, ఆ సైకియాట్రిస్టును అతను ప్రేమించడం, ఒక గూఢచారులవర్గం మరొకవర్గపు గూఢచారులను హత్యచేసినప్పుడు ఆ హత్యానేరం డానీ కేయీమీద పడడం, అతడు నిర్దోషి అనిఋజువై చివరికి ప్రేమించిన అమ్మాయిని పెళ్ళిచేసుకోవడం వగైరా కథతో యీ చిత్రం నడుస్తుంది. ఒక వర్గపు గూఢచారుల్లో ఒకడి పేరు గ్రోమిక్ (ఈ పేరులో ఆఖరి అక్షరాన్ని కొంచెంమారిస్తే ఒక దేశపు రాజకీయవ్యక్తి పేరుగా మారుతుంది.) ఈ చిత్రం ఆఖర్లో డానీ కేయీ తన్ను వెంటాడుతున్న పోలీసులను తప్పించుకోవడానికి ఒక థియేటర్లో ప్రవేశించి అక్కడ ప్రదర్శించబడుతున్న రష్యన్ బాలే నృత్యంలో కలిసిపోతాడు. రష్యన్ బాలేను హాస్యాస్పదంగా చూపించడానికి ఈ సీక్వెన్సు ఉపయోగించబడింది.

వినోదంకోసమే చిత్రాలు తీస్తున్నామని చెప్పే హాలీవుడ్ కంపెనీలు రాజకీయ ప్రచారం చెయ్యడంకూడా 'ఎంటర్‌టెయిన్‌మెంట్'లోనే చేర్చి ఈమాదిరి చిత్రాలు తయారుచేస్తున్నాయి ఆ వినోదమూ, ఈ ప్రచారమూకూడా ఏవగింపు కలిగించేస్థాయికి దిగజారిపోవడం విచారకరం.



రాజకుమారుడైన కుమార రాయలను కొండజాతివారు పెంచి పెద్దచేశారు.
ప్రతిభావారి "రేచుక్క"లో ఎన్. టి. రామారావు.



వెలుగుజాడలు





# మీరు ఆదర్శ గృహిణులేనా ?




అయితే, మీరు నెలకంతా సరిపోయే సరుకులను లెక్కవేసి కొనుక్కొని, అప్పటికప్పుడూ ప్రతిదీ కొనవలసి రావడంవల్ల అయ్యే దుబారా నివారించుకొని పొదుపుగా గడుపుతూ వుంటారు.

ఆరోగ్యప్రదమైన విధంగా సీలువేసివున్న 10, 5, 2 పౌనుల తుషార్ డబ్బాలలో మీకు సరిపోగలదానిని కొనుక్కోవచ్చు గనుక మీరు చాలా సంతసిస్తారు.







## తుషార్ — ఆదర్శప్రాయమైన వంటసరుకు

**ఉచితం**



బహురుచికరమైన వివిధరకాల వంటకాలు తయారుచేసే విధానాలుగల పుస్తకం ఉచితంగా లభిస్తుంది-అడగండి

ASP. Y1 .7/54

**తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.**

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Prees. 7, Thambu Chetty St, Madras